అపరాధ పరిశోధన అనుబంధం—144

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## తప్పుచేసిన మహామనిషి

రచన : వసుంధర

## రుద్రసింహం

రచన: వి. ఎస్. రావ్

## నాగులకొండ

రచన : సుంకరి రాంప్రసాద్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—144
డిశంబరు, 1985
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# తప్పు చేసిన మహా మనీషి

## వసుంధర

ఆయన తెల్లటి గ్లాస్కో పంచె ధరించాడు. దానిపైన మల్లెపూవులాంటి పోలీఎస్టర్ లాల్చీ. మనిషి ఆజాను బాహువు. ముఖంలో ఎటువంటి వారికైనా గౌరవం పుట్టించే గాంభీర్యం.

ఆయన వయసు యాభై దాటివుండవచ్చు. అయినా తలపై అక్కడక్కడ మాత్రమే నెరిసిన వెంట్రుక లున్నాయి. మీసాలు నల్లగా మెరుస్తున్నాయి.

హోటల్లోంచి బయటకు వస్తూ ఆయన టాక్సీకోసం ఆగాడు. టాక్సీ రాగానే ఆపి ఎక్కి కూర్చుని-"మందిరం వీధి!" అన్నాడు.

టాక్సీవాలా ఆశ్చర్యపోయాడు. ఆయన వేషానికీ, అభిరుచులకీ ఎక్కడా పోలిక లేదనుకున్నాడు.

మందిరం వీధి గురించి అందరికీ తెలిసినదే!

అది వేశ్యలుండే చోటు....అందులోనూ చౌకబారు వేశ్యలు....

అక్కడకు ఎక్కువగా పాటక జనం వెడతారు. ఉన్న వాళ్ళెవరైనా వెళ్ళినా టాక్సీలో యెవరూ వెళ్ళరు.

"సార్ — మీరీ ఊరికి కొత్తా?" అన్నాడు టాక్సీ వాలా.

"ఊఁ" అన్నాడాయన.

"మందిరం వీధి తమబోంట్లు వెళ్ళేది కాదు. కావాలంటే తమను ఎలక్ట్రానిక్ హావుస్‌కు తీసుకొని వెడతాను" అన్నాడు టాక్సీవాలా.

"ఎలక్ట్రానిక్ హావుసా-అదెక్కడ?" అన్నాడాయన.

"మార్కెట్ సెంటర్లో ఉంది సార్. మూడంతస్తుల మేడ అది. గ్రౌండ్ ఫ్లోర్లో ఎలక్ట్రానిక్ షాపులుంటాయి. మిగతా మేడలో మీకు కళ్ళు చెదిరే క్వాలిటీ పిల్లలు దొరుకుతారు. అక్కడ ఎప్పుడూ యాభై మందికి తక్కువ కాకుండా సినీతారల్లాంటి పిల్లలుంటారు. ఈ రోజున్న వారు రేపుండరు. అక్కడ మీరు ఫోటో చూసి ఎన్నిక చేసుకోవచ్చు...."

టాక్సీవాలాను సగంలో ఆపి—"సరేలే—ఆ విషయం రేపు చూద్దాం. ఈ వేళ్టికి మందిరం వీధికి పోనీయ్...." అన్నాడాయన.

"సార్ — అక్కడుండేది అలగాజనం...." అని టాక్సీవాలా ఏదో చెప్పబోయాడు. ఆయన అతడి వంక చురుగ్గా చూశాడు.

టాక్సీ కదిలింది. సరిగ్గా అయిదు నిమిషాల్లో రామ మందిరం ముందాగింది. ఆయన టాక్సీవాలాకు డబ్బిచ్చి— "నువ్వు వెళ్ళు!" అన్నాడు.

# 2

ఆ ఊళ్ళో మందిరం వీధికి సంబంధించి ఎన్నో కథలున్నాయి. ఎవరైనా ఆ వీధికి వెడుతున్నామన్నా, ఆఖరికి రామ మందిరానికి వెడుతున్నామన్నా అంతా అనుమానంగా చూస్తారు.

అయితే రామమందిరానికి పేరుప్రఖ్యాతులున్నాయి.

ముందక్కడ రామమందిరం ఒక్కటే ఉండేదనీ—ఆ మందిరంలో ఉండే దేవదాసికి—ఆ వీధిలో పెద్ద మేడ వుండేదనీ—ఆమె సంతానమే క్రమంగా మందిరం వీధినంతా ఆక్రమించుకున్నదనీ కొందరంటారు.

ముందక్కడ వేశ్యావాటిక మాత్రమే ఉండేదనీ—అక్కడికి వెళ్ళడానికి ఇబ్బందిగా ఉండడంవల్ల కొందరు పెద్దలక్కడో మందిరం కట్టించి దానికి మహిమలు అంటగట్టారనీ కొందరంటారు.

ఆ వీధిలో జరిగే పాపాన్ని యెప్పటికప్పుడు కడిగి వేయడం కోసం ఆ మందిరాన్నక్కడో పుణ్యాత్ముడు కట్టించాడని కొందరంటారు.

టాక్సీ దిగి ఆయన తిన్నగా మందిరంలోనికే వెళ్ళాడు.

అక్కడ పెద్దగా జనం లేదు. ఉన్నవాళ్ళొకరి వంక ఒకరు చూడటం లేదు. పలకరించుకోవడం లేదు.

ఆయన—విగ్రహాల వంక చూశాడు.

శిల్పకళ ఉట్టిపడుతున్న పాలరాతి విగ్రహాలు.

సీతారామలక్ష్మణులు — వారి పాదాల చెంత హనుమంతుడు.

పవిత్రతకు మారు పేరు సీత. ఏకపత్నీవ్రతుడు రాముడు. అన్నకోసం భార్యను వదిలినవాడు లక్ష్మణుడు. స్వామి సేవకు మించి మరేమీ కోరని హనుమంతుడు

ఆజన్మ బ్రహ్మచారి.

వారిలో అందరూ స్వసుఖాన్ని త్యాగం చేసినవారే! వారి గురించి తెలసిన ఆ మందిరం—ఒక వీధికి పేరుగా వుంది. ఆ వీధికి అందరూ స్వసుఖాన్ని ఆశించి తప్పు చేయడానికి వడతారు.

"స్వామీ! నన్ను మన్నించు—" అనుకున్నాడాయన మనసులో.

పూజారి పళ్ళెంతో ఆయన ముందుకు వచ్చాడు.

"తప్పు చేయడం మానవ సహజం. మనిషి తప్పుల్ని క్షమించడానికే దేవుడున్నాడు. దేవుడి కుంకం నొసట రాసుకుంటే—చేసిన తప్పులన్నీ తొలగిపోవడమే కాదు. చేయబోయే తప్పులా కుంకం నొసటనున్నంత కాలం—దేవుడికే చెందుతాయి. మనిషి సంటవు—...." అన్నాడు పూజారి.

ఆయన పూజారి వంక అదోలా చూశాడు. తప్పు చేయమని ప్రోత్సహిస్తున్న వాడిలా ఉన్నాడు పూజారి.

"కుంకం కాస్త ఇలా యివ్వండి..." అన్నాడాయన.

"పదిపైసల పాట్లం కావాలా, రూపాయ పాట్లం కావాలా?" అన్నాడు పూజారి.

"రెండింటికీ తేడా ఎమిటి?"

"ప ది పై స ల పాట్లం సామాన్యులకు. రూపాయ పాట్లం గొప్పవారికి—"

"రెండింటికీ తేడా ఏమిటి?" మళ్ళీ అడిగాడాయన.

"రూపాయ పాట్లంలోని కుంకుం పెట్టుకుంటే—దేవుడు ప్రత్యేకంగా ఆశీర్వదిస్తాడు. మనిషి చేసే తప్పులు క్షమించబడడమే కాదు—జీవితంలో పైకిపోయే అవకాశాలు పెరుగుతాయి. కీర్తి ప్రతిష్టలు వస్తాయి. ఉన్నత

పదవులు లభిస్తాయి...."

పూజారి యింకా యేదో చెబుతూండగానే—"పది పైసల పొట్లాలో పదివ్వండి—" అన్నాడాయన.

"బాబూ—తమరు రూపాయ పొట్లాలు తీసుకోండి" అన్నాడు పూజారి కంగారుగా.

ఆయన నవ్వి—"నాకు పదిపైసల పొట్లాలే కావాలి" అన్నాడు.

పూజారి గొణుక్కుంటూ — "తమబోంట్లుకూడా పదిపైసల పొట్లాలు కావాలనడం అన్యాయం—" అని పొట్లాలు తెచ్చిచ్చాడు.

ఆయన ఆ పొట్లాలందుకొని—"ఉన్నవాడినొకలాగా, లేనివాడినొకలాగా భావించడం మనిషికే చెల్లింది. దేవుడూ ఆదే పనిచేస్తే ఆయన దేవుడు కాలేడు—" అన్నాడు.

"దేవుడు యెదుటి మనిషి శక్తిని బట్టి ప్రతిఫలం రాబట్టాలనుకుంటాడు. ఒక కూలివాడు తను కష్టపడి సంపాదించిన దాంట్లోంచి మనస్ఫూర్తిగా పదిపైసలిచ్చినా ఆయన సంతృప్తి చెందుతాడు. లక్షలకు లక్షలున్న మనిషి ఆ లెక్కన ఎంతిస్తే దేవుడికి సంతృప్తి కలుగుతుంది?" అన్నాడు పూజారి.

"నేనన్నదదికాదు. పదిపైసలిచ్చిన వాడినొకలాగా, రూపాయిచ్చినవాడి నొకలాగా ఆదరించేవాడు దేవుడు కాదు. తీసుకున్నవి పదిపైసల పొట్లాలైనా నే నిచ్చే దెలాగూ రూపాయే!" అంటూ పదిరూపాయలిచ్చాడు పూజారికాయన.

పూజారి ముఖంలో ఆనందం కనబడింది.

"ఇప్పుడు దేవుడి విషయమెలాగున్నా మీ దీవెనలు

నాకు తప్పక లభిస్తాయి...." అంటూ అక్కణ్ణించి కదిలాడాయన.

## 3

ఇలా వీధిలో అడుగు పెట్టగానే అలా నలుగురాయన చుట్టూ మూగారు. అంతా సరుకును వర్ణిస్తున్నారు.

"అబద్ధాలు చెప్పొద్దు నాకు. పదహారేళ్ళు దాటిన వాళ్ళూ, ఇరవై ఏళ్ళలోపు వాళ్ళూ అయ్యుండాలి...." అన్నాడాయన.

"గొప్ప టేస్టు బాబుగారిది...." అన్నాడొకడు.

"మంగాయమ్మ కంపెనీకి వెళ్ళండి బాబూ...." అన్నాడింకొకడు.

"కాదు—పంకజం కంపెనీకి...."

"కాదు వీరామణి కంపెనీ...."

మొత్తం యేడు కంపెనీల పేర్లు తేలాయి. వాళ్ళక్కడ గొడవ పడుతున్నారు.

ఆయన చిరాగ్గా—"మీ గొడవలతో నన్ను వేధించకండి. నా అవసరం కోసం బహుశా అన్ని కంపెనీలకూ వెడతాను. ముందు మంగాయమ్మ కంపెనీకి దారి చూపించండి—" అన్నాడు.

ఒకడాయన్ను తనవెంట రమ్మన్నాడు. ఇద్దరూ ఓ పాత మేడ ముందుకు వెళ్లారు. అతడాయన్నక్కడ ఆగమని తను లోపలకు వెళ్లాడు. కొద్ది క్షణాల్లో ఓ నడివయస్కురాలితో తిరిగి వచ్చాడు.

ఖరీదైన పట్టుచీర. కొప్పులో పూలు. కళ్ళకు కాటుక. తాంబూలంతో గారపట్టిన పళ్ళు. నడకలో భారీ శరీరానికి తగిన వయ్యారాలు. మెడలో మందంగా ఉన్న కాసుల పేరు.

"నమస్కారం బాబూ—లోపలకు దయచేయండి-" అందామె.

ఆయన హుందాగా ఆమె ననుసరించాడు. బ్రోకరు వెళ్ళిపోయాడు.

"చెప్పండి బాబూ! ఈ వీధికి నా కంపెనీ నంబర్ వన్. ఇక్కడ దొరికే సుఖం విదేశాల్లోకూడా తమకు దొరకదు...." అందామె.

"నా సుఖం శరీరానికి కాదు...." అన్నాడాయన.

"అంటే?" అంది మంగాయమ్మ.

"నేను చూసి ఆనందిస్తాను. మనిషి శిల్పంలా వుండాలి. మంచి వయసులో వుండాలి. పదహారూ— ఇరవైకి మధ్యనున్నమాట...."

"తెలుసు బాబూ—ఇరవై యేళ్ళు దాటిన వాళ్ళను నా కంపెనీలో ఉంచుకోను. పదహారు దాటందే చేర్చుకోను....సరిగ్గా మీకోసమే నావాళ్ళనందర్నీ నేనిక్కడ పోగేసినట్లుంది. మీరే చూద్దురుగాని...." అంటూ చప్పట్లు కొట్టింది మంగాయమ్మ.

బిలబిలలాడుతూ పదహారుమంది అమ్మాయిలక్కడకు వచ్చి వరుసగా నిలబడ్డారు.

ఆయన వారి వంక తేరిపార చూశాడు.

అందరూ రాటుదేలి ఉన్నట్లున్నారు. ఒక్కొక్కరికీ తమవంటిమీద దుస్తుల గురించి శ్రద్ధలేదు. ముఖంలో సిగ్గు లేదు.

వారిలో యిద్దరమ్మాయిలు మాత్రం బాగా లేతగా అగుపిస్తున్నారు. వారి ముఖాల్లో రవంత సిగ్గుకూడా తొంగిచూస్తోంది.

ఆయన ఆ యిద్దర్నీ ఎన్నుకున్నాడు.

"ఇద్దరా?" అంది మంగాయమ్మ.

"అవును. అడ్వాన్సెంతో చెప్పు.." అన్నాడాయన.

"ఇద్దరికీ యాభై అవుతుంది...."

ఆమె నోటిమాట బయటకు రాకుండానే ఆయన వందరూపాయల నోటొకటి ఆమె కందించి — "నా మనసుకు తృప్తి కలిగితే — వందలు కాదు.... వేలిస్తాను...." అన్నాడాయన.

ఆయనకు తృప్తి కలగాలని మంగాయమ్మ దేవుణ్ని ప్రార్థించుకుంది.

## 4

గదిలో ఆయన వాళ్ళిద్దర్నీ ఎన్నో ప్రశ్నలు వేశాడు. కంపెనీలో యితర స్త్రీల గురించి అడిగాడు. వాళ్ళ అందాన్ని సున్నితంగా మెచ్చుకున్నాడు.

ఆ యిద్దరమ్మాయిలకూ తమ గతం తిన్నగా తెలియదు. జ్ఞానం తెలిసినప్పట్నుంచీ మంగాయమ్మ సంరక్షణలోనే పెరిగారు. చిన్నతనంనుంచీ ఆమె వాళ్ళలో వ్యభిచార భావాలు నాటింది. అదే ప్రపంచమని వాళ్ళనుకున్నారు.

"ఈ జీవితం మీకు బాగుందా?" అనడిగాడాయన.

"ఆరంభంలో బాగుండేది. ఇప్పుడు నచ్చడంలేదు.."

"ఎందుకని?"

"బయట ప్రపంచం ఎలాగుంటుందో చూడాలనుంది."

"చూడొచ్చుగా...."

"ఈ వీధి దాటి మేము బయటకు వెళ్ళలేము...."

వాళ్ళ కదలికలపై ఎన్నో ఆంక్షలున్నాయి. తప్పించుకునే ప్రయత్నం చేస్తే క్రూరంగా శిక్షించబడతారు.

"మిమ్మల్నెవరు శిక్షిస్తారు?"

"శ్రీరామ్!"

"అతడెవరు?"

"కండలు తిరిగిన వస్తాదు. వాడు చేత్తో కొడితేనే కొరడాతో కొట్టినట్లుంటుంది. కానీ వాడెప్పుడూ కొరడాతోనే కొడతాడు...."

"ఎప్పుడూ కొరడాతోనే కొడితే చేతి దెబ్బ గురించి యెలా తెలిసింది?"

"రోజూ యేదో సమయంలో వాడందర్నీ అభిమానంగా పలకరించి నడ్డిమీద చరుస్తాడు. ఆ దెబ్బకే కళ్ళు తిరుగుతాయి...."

ప్రేమతో చేతితో చరిస్తే కళ్ళు తిరిగాయంటే— వాడి కొరడా దెబ్బ ఎలా వుంటుంది?

ఆయన ముఖం అదోలాగైపోయింది—"మిమ్మల్నెప్పుడైనా కొట్టాడా?" అన్నాడాత్రంగా.

"లేదు. మేము తప్పించుకునే ప్రయత్నమెప్పుడూ చేయలేదుగా!"

"అయితే వాడి కొరడా దెబ్బల గురించి మీకెలా తెలుసు?"

"తప్పు చేసిన వాళ్ళని మా ఎదురుగానే శిక్షిస్తారు. ఆ శిక్ష చూసి మేము మళ్ళీ తప్పులు చేయకూడదని...."

"తప్పంటే ఏమిటి?"

"మంగాయమ్మ చెప్పినట్లు వినకపోవడం, తప్పించుకోవాలని ప్రయత్నించడం...."

"స్త్రీ పురుషులొకరికోసం ఒకరు పుట్టారు. ఒకరి సాంగత్యంలో ఒకరానందం పొందుతారు. అలాంటి అనుభవం నిత్యం పొందే మీరు మీ అదృష్టానికి సంతోషించాలి కానీ—తప్పించుకుని పారిపోవడమెందుకు?"

"మొదట్లో మేమూ అలాగే అనుకున్నాం. కానీ క్రమంగా మా అభిప్రాయాలు మారాయి. అందరు మగాళ్ళూ మాకు నచ్చరు. అయినా మేము ఒప్పుకోవాలి. కొందరి దగ్గర బ్రాందీ వాసన. మరి కొందరి దగ్గర సిగరెట్ వాసన. కొందరివి ఎత్తు పళ్ళు. కొందరివి కురూపి ముఖాలు. మా యిష్టప్రకారం — మాకిష్టమైన వాళ్ళతో అయితే సంతోషంగా ఉండేదేమో! అదీకాక మాకు విశ్రాంతి కావాలనుకున్నప్పుడది లభించదు. ఒకో సారి మగాడి పేరు చెబితే అసహ్యం వేస్తుంది. అయినా మేమొప్పుకోవాలి. మాలో అందరికీ యిక్కణ్ణించి తప్పించుకొని పారిపోవాలనే ఉంటుంది—"

"నిజానికి శిక్ష మీరనుకున్నంత క్రూరంగా ఉండదు. కొరడాతో కొట్టినప్పుడు దెబ్బలు గట్టిగా తగలకుండా బట్టలడుగున మెత్తటి వస్తువు నుంచుతారు. శిక్ష చూసి మీరు భయపడతారు. శిక్షించబడిన వాళ్ళకు బాధ ఉండదు...."

"అలాంటి అవకాశంలేదు. శిక్ష పొందేవాళ్ళకు వంటి మీద బట్టలుండవు. కదలడానికి వీల్లేకుండా కాళ్ళూ చేతులూ కట్టి, అరవడానికి వీల్లేకుండా నోట్లో గుడ్డలు కుక్కి — శ్రీరామ్ తన బలమంతా ఉపయోగించి అయిదంటే అయిదు కొరడా దెబ్బలు.... ఆ దెబ్బలకే — స్పృహ తప్పిపోతుంది. ఒకసారి తప్పించుకుందుకు ప్రయత్నించినవాళ్ళింకో ప్రయత్నంచేస్తే — వాళ్ళకు పది కొరడా దెబ్బలు .... అంతేకాదు .... పారిపోదల్చుకున్న వాళ్ళకు సాయంచేసిన వాళ్ళందరికీ ఒకో కొరడా దెబ్బ. అందుకే మేము ఒకరితో ఒకరం మాట్లాడుకోము.... లేనిపోని అనుమానాలు వస్తాయని యెవరి ప్రపంచం

వారిదిగా జీవిస్తాం...."

ఆయన నిట్టూర్చి—"మీ జీవితం గురించి బయటి ప్రపంచానికి తెలియదు. మీ దగ్గర సుఖం దొరుకుతుందనీ, మీరూ సుఖపడతారనీ వాళ్ళనుకుంటారు...." అన్నాడు.

"మీరు వచ్చింది బయటి ప్రపంచం నించే కదా!"

ఆయన తడబడి—"అవును. మీ కథలతో, మీ యిబ్బందులతో నాకు నిమిత్తంలేదు. నా అవసరంకోసం నేను వచ్చాను. మీరిద్దరూ బట్టలు విప్పి అక్కడ పెట్టి—ఒకరిపక్క ఒకరు నిలబడండి...." అన్నాడు.

వాళ్ళిద్దరూ ఆయన మాట పాటించారు.

వారి నగ్న శరీరాలవంక దృష్టిసారించిన ఆయన కనులలో సంతోషం, సంతృప్తిలేదు. ఆ స్థానంలో దిగులు, నిరాశ, విచారం కనబడ్డాయి.

వారి శరీరాలనిండా రక్కులు, పంటిగాట్లు....

వారెటువంటి క్రూరహింసకు గురవుతున్నారో ఆయన కర్థమయింది.

"బట్టలు వేసుకోండి...." అన్నాడాయన మళ్ళీ.

వాళ్ళిద్దరూ ఆశ్చర్యపడుతూ బట్టలు వేసుకున్నారు.

"థాంక్స్!" అన్నాడాయన.

"మీరెవరు?" అన్నారిద్దరూ ఏక కంఠంతో ఆశ్చర్యంగా.

"నా వివరాలు మీకెందుకు?" అన్నాడాయన.

"మీ ప్రవర్తన మాకాశ్చర్యంగా ఉంది..."

ఆయన నిట్టూర్చి—"నన్నే ఆశ్చర్యపరుస్తుంది నా ప్రవర్తన...." అని—"మీరిక వెళ్ళవచ్చు.." అన్నాడు.

ఒకామె ఆశగా అతడివంక చూసి—"మీరు నన్నిక్కణ్ణించి తప్పించగలరా? జీవితాంతం మీ యింట్లో

బానిసలా పడివుంటాను....” అంది.

“నేనుకూడా—” అంది రెండో ఆమె.

“నేను మిమ్మల్ని తప్పిస్తానని యెందు కనుకుంటు న్నారు?” అన్నాడాయన.

“బయటి ప్రపంచంలో కొందరు సంఘసేవకు లున్నారనీ—వాళ్ళు మా బోంట్లకు విముక్తి కలిగించే ప్రయత్నాలు చేస్తున్నారనీ విన్నాం. మిమ్మల్ని చూస్తే మీరూ అలాంటివారేననిపించింది....”

“మీరు పొరబడ్డారు. నేనలాంటివాణ్ణి కాదు. ఇది నేను ఆనందించే పద్ధతి. ఇప్పుడు నేను పంకజం కంపెనీకి వెడుతున్నాను. అక్కడా యిలాగే మీవంటి వాళ్ళను వెతుక్కుని వీరామణి కంపెనీకి వెడతాను....మీ వయసు పిల్లలిక్కడ ఇంకా ఏ యిళ్ళలో దొరుకుతారో చెప్ప గలరా?” అన్నాడాయన.

“ఈ మూడు కంపెనీలే ఈ వీధికి పెద్దవి. ఈ మిగతా వన్నీ చిన్న కంపెనీలు. అక్కడ మీకు పాతికేళ్ళలోపు పిల్లలు తప్ప దొరకరు. పెద్ద కంపెనీలవాళ్ళు-ఓ వయసు దాటిన వాళ్ళను చిన్న కంపెనీలకు అమ్మేస్తారు. కొన్నేళ్ళు పోయేకవస్తే బహుశా నేనూ మీకు ఏదో ఒక చిన్న కంపెనీలో ఈ వీధిలో కనబడవచ్చు—” అందొకామె.

“నేనుకూడా....” అంది రెండో యువతి.

ఆయన వాళ్ళిద్దరి ముఖాలూ మరోసారి చూశాడు.

“మమ్మల్ని రక్షించరూ!” అంటున్నాయి వారి కళ్ళు.

ఆయన నిట్టూర్చి — “నేను వెడుతున్నాను—” అన్నాడు.

“వందరూపాయలిచ్చారు. మరి కాసేపుండలేరా?” అన్నదామె.

"ఎందుకు?"

"మావు కనీసం కాసేపు విశ్రాంతి...."

ఆయనకు వాళ్ళ పరిస్థితి అర్థమయింది.

కానీ ఆగ లేదు.

## 5

హోటల్లో తన గదిలో కూర్చున్నాడాయన.

ఆయన యెదురుగా ఓ నోట్ బుక్కుంది. అందులో పెన్సిలుతో రాస్తున్నాడాయన.

శ్రీరామ్—మంగాయమ్మ యిల్లు....

మహమ్మద్—పంకజం యిల్లు....

జీసస్—వీరామణి యిల్లు....

అంతే రాశాడాయన నోట్ బుక్ లో!

ముఖంలో ఏదో తెలియని బాధ. కళ్ళలో కోపం....

ఆయన అక్కణ్ణించి లేచి ఒక మూలకు వెళ్ళాడు. అక్కడ టెలిఫోనుంది. ఓ నంబరు తిప్పాడాయన.

"హాలో! డీయస్పీ ఇందుభూషణ్ స్పీకింగ్!" అంది అవతలి గొంతు.

"ఇందుభూషణేనా—నేను మాట్లాడుతున్నాను...."

"నేనంటే?"

"గుర్తుపట్టలేదా?"

"పేరు చెప్పందే ఎలా తెలుస్తుంది?" విసుగ్గా ధ్వనించిందవతలి గొంతు.

"ఫోన్ లో గొంతు విని నన్ను గుర్తుపట్టకపోతే—నువ్వు డిపార్టుమెంటుకేం పనికొస్తావురా ఫూల్ ప్లస్ రాస్కెల్...." అన్నాడాయన.

"ఏమన్నావ్?"

"ఫూల్ ప్లస్ రాస్కెల్...."

"ఒరేయ్— చెంగల్రావ్ ...." అందవతలి గొంతు.

"అదేనా—నన్ను పిలిచే పద్ధతి ...?"

"సారీరా—ఇడియట్!"

"దట్స్ గుడ్!" అని మెచ్చుకున్నాడు చెంగల్రావు.

"ఈ ఊరెప్పుడొచ్చావు? ఇప్పుడెక్కడ్నుంచి ఫోన్ చేస్తున్నావు?"

"నిన్న వచ్చాను. హోటల్ శ్రీ దుర్గ నుంచి ఫోన్ చేస్తున్నాను...."

"ఈ ఊరొచ్చి హోటల్లో మకాం పెడతావా— నిన్ను ఇడియట్టంటే చాలదు. ఇంకా....ఇంకా...."

"తర్వాత ఆలోచించి చెబుదువుగానిలే కానీ—నాకు నీ సాయం కావాలి. నువ్వు నాకు సాయపడాలంటే మన స్నేహం గురించి ఎవ్వరికీ తెలియకూడదు...."

"ఏమిటి నీకొక్క—కలసిన సాయం?"

"ఫోన్‌లో చెప్పొచ్చా—యెవరైనా టాప్ చేస్తారంటావా?"

"అంత రహస్యమా అది!"

"అవును...."

"అయితే నేనే వస్తాను...."

"ఫూల్ ప్లన్ రాస్కెల్! మన స్నేహం గురించి ఇక్కడందరికీ తెలియకూడదన్నానా?"

"సరేరా ఇడియట్! ఊ తర్వం పంపించు...."

"దట్స్ గుడ్!" అన్నాడు చెంగల్రావు.

"మరి మనం కలుసుకునేదెప్పుడు?"

"నిన్ను కలుసుకోకుండా, వదినగారిని పలకరించకుండా యిక్కడ్నుంచి వెళ్ళను. సరా?" అన్నాడు చెంగల్రావు.

"థాంక్స్‌రా ఇడియట్!" అంది అవతలి గొంతు.

చెంగల్రావు ఫోన్ పెట్టేసి కాగితంమీద వ్రాయడం మొదలు పెట్టాడు.

"మందిరం వీధిలో ముగ్గురు మహనీయులున్నారు. శ్రీరామ్, మహమ్మద్, జీసస్. వాళ్ళు ముగ్గుర్నీ అరెస్టు చేసి కనీసం నెల రోజులపాటు జైల్లోంచి బయటకు రాకుండా చూడాలి. వాళ్ళ మతాని కొన్నాళ్ళపాటు ఆ వీధిలో లేకుండా చేయాలి. ఇదే ప్రస్తుతానికి నువ్వు నాకు చేయగల సాయం...."

చెంగల్రావు ఉత్తరం చివర సంతకం పెట్టలేదు. కాగితం చింపి ఓ కవర్లో పెట్టి—"రేపుదయమే ఇది ఓ పోలీస్ స్టేషన్‌లో యిచ్చి డీయస్పీ కందజేయమనాలి—" అనుకున్నాడు.

# 6

ఎలక్ట్రానిక్ హావుస్ ముందు టాక్సీ దిగాడు చెంగల్రావు. గంభీరంగా అందులో ప్రవేశించాడు.

ముందుగా రిసెప్షన్ హాలుంది. అక్కడ సుమారు పాతికేళ్ళ యువకుడు రిసెప్షనిస్టుగా ఉన్నాడు. చెంగల్రావు అతన్ని సమీపించి—"నేనీ ఊరికి కొత్త. ఈ బిల్డింగ్ గురించి చాలా విని యెంతో ఆశతో వచ్చాను. ఇక్కడి విశేషాలేమిటి?" అన్నాడు.

రిసెప్షనిస్టు మృదువుగా నవ్వి—"గ్రాండ్ ఫ్లోర్లో ఆధునిక పరికరాలు, పై ఫ్లోర్లలో ఆధునిక యువతులు" అన్నాడు.

"యువతులేం చేస్తారు?"

"మాసేజ్...."

"మీ వద్ద ఆ యువతుల హిస్టరీ వుంటుందా?"

"ష్యూ యస్....ఇక్కడెప్పుడూ యాభైమందికి తక్కువ కాకుండా అమ్మాయిలుంటారు కానీ మా వద్ద రెండు వేలకు తక్కువకాకుండా యువతుల గురించిన సమాచార ముంటుంది...."

"ఎవరు వాళ్ళు?"

"వాళ్ళలో పెద్దింటివాళ్ళుంటారు. కాలేజీ విద్యార్థినులుంటారు. వివాహితులుంటారు...."

"వీళ్ళంతా మా సేజ్ నేర్చుకున్నారా?"

"అవును. మా సేసింగ్ ఇక్కడైనా చేస్తారు. కావాలంటే ఇంటికీ రప్పించుకోవచ్చు. మా సేజింగ్ అంటే ఇష్టమున్న యువతులు మావద్ద పేర్లు రిజిష్టర్ చేయించుకుంటారు. వారికిక్కడ శిక్షణ యివ్వడుతుంది...."

"వారి వారి చిరునామాలుకూడా దొరుకుతాయా?"

రిసెప్షనిస్టు నవ్వి-"వారి వారి వయసులు, హోదాలు తెలియబర్చబడతాయి. ఎలా పెరిగినదీ, పెంచబడినదీ కూడా వివరముంటుంది. చిరునామా వుండదు. ఇక్కడ ఫోటోలో చూసిన యువతిని మీరెక్కడైనా చూస్తే డైరెక్టుగా అప్రోచ్ కాలేరు. ఆమె మా సేజింగ్ ను అంగీకరించదు. అంతా మా సంస్థ ద్వారానే జరగాలి" అన్నాడు.

చెంగల్రావు రిసెప్షనిస్టిచ్చిన ఆల్బమ్స్ తీసుకున్నాడు. ఒకో ఆల్బమ్‌లో వందఫోటోలు....ఫోటోకింద వివరాలు. ఫోటోలోని యువతులందరూ కళ్ళు చెదిరే అందంలో మిలమిల మెరిసిపోతున్నారు.

అక్కడ చాలా ఆల్బమ్సున్నాయి. చెంగల్రావు మాత్రం మూడు ఆల్బమ్స్ చూశాక నాలుగో ఆల్బమ్

చూస్తూ ఓ ఫోటోవద్ద ఆగిపోయాడు.

రిసెప్షనిస్టుకాయన ఆ ఫోటో చూపించి—"నేనీమెను చూడాలి...." అన్నాడు.

రిసెప్షనిస్టు ఫోటో కింద నంబరు చూశాడు. 1367. అప్పుడతడు ఫోన్‌లో ఓ నంబరు తిప్పి—"హాలో—కంప్యూటర్ సెక్షన్—నం-1367—వాటీజ్ ది పొజిషన్!" అనడిగాడు. వివరాలన్నీ విని—"సారీ సర్! ఆమె నాలుగు రోజులవరకూ బుక్కైపోయింది...." అన్నాడు.

"ఆమె ఎక్కడుందో చెప్పగలరా?"

"సారీ...."

"ఆమెను నేనర్జంటుగా కలుసుకోవాలి...."

రిసెప్షనిస్టు నెమ్మదిగా—"సర్! ఇంకా ఎన్నో అల్బమ్సున్నాయి...." అని ఏదో చెప్పబోయాడు.

"నాకింకెవ్వరూ వద్దు...."

"ఆమెలోని ప్రత్యేకత ఏమిటో చెప్పండి....అలాంటి ప్రత్యేకత వున్న వారిని మరికొందరిని నేను సూచించగలను..."

"ఆ ఫోటోకింద వివరాలు చూశారుగదా! అలాంటి యువతులంటే నాకెంతో ఆకర్షణ...."

"జస్టేమినిట్..." అంటూ అతడు మళ్ళీ కంప్యూటర్ సెక్షన్‌కి ఫోన్ చేసి ఆ వివరాలు చెప్పి—"అచ్చం యిలాంటి వివరాలే వున్న నంబర్లు కొన్ని చెప్పాలి" అన్నాడు.

అవతలినుంచి వివరాలు లభించేక—అతడు నంబర్లు నోట్ చేసుకొని—"సారీ సర్—అలాంటి యువతులు మరో నలుగురు మాత్రం వున్నారు. అందరూ వారం

రోజులవరకూ బుక్కైపోయారు. అయితే వారిలో ఒక యువతి ఇప్పుడెక్కడున్నదీ చిరునామా యివ్వగలను.." అన్నాడు.

"ఆ ఒక్క యువతి విషయంలోనూ మాత్రమే అదెలా సాధ్యం?"

"మాకు ఫుల్ మెంబర్సూ, హాఫ్ మెంబర్సూ వుంటారు. హాఫ్ మెంబర్సువి ఫోటోలుండవు. వారి విషయంలో రహస్యం దాచే బాధ్యత మాకు లేదు. మీరు స్పెషల్ సర్వీస్ చార్జెస్ కింద వందరూపాయలు చెల్లిస్తే ఆమె అడ్రసు మీకివ్వగలను...."

చెంగల్రావు అతడికి ఎంట్రీ ఫీజు వందరూపాయలు, స్పెషల్ సర్వీస్ చార్జెస్ వందరూపాయలు చెల్లించి—ఆమె చిరునామా తీసుకున్నాడు.

ఆశ్చర్యమేమిటంటే ఆమె ఆయనున్న హోటల్లోనే ఆయనకు పక్క గదిలోనే వుంటోంది.

హోటల్లో తన పరిసరాలు పట్టించుకోనందుకాయన తన్ను తానే నిందించుకున్నాడు — "అయినా పట్టించుకుంటే మాత్రం ఏం తెలుస్తుందిలే!" అనుకున్నాడు.

## 7

బెల్ విని పరుగున వచ్చి తలుపు తీసింది అరుణ. ఎదురుగా కనబడిన చెంగల్రావామెకు అపరిచితుడు.

"లోపలకు రావచ్చా?" అన్నాడు చెంగల్రావు.

"మీరెవరో నాకు తెలియదు...." అందామె.

చెంగల్రావు చటుక్కున లోపల అడుగుపెట్టి తలుపు వేసి—"కంగారుపడకు. నేను చెడ్డవాణ్ని కాదు—" అన్నాడు.

"ఆయన బయటకు వెళ్లారు. రావడానికి గంటపైగా

పడుతుంది —" అందామె తడబడుతూ.

అరుణవంకే చూస్తున్నాడాయన.

లేత గులాబీ రంగు ఛాయ. ఆమె కట్టుకున్న చీర, బ్లవుజూ—ఒంటి రంగులో కలిసిపోయాయి. పెద్ద పెద్ద కళ్ళు, కొనదేరిన ముక్కు, ఎక్కడలేని అమాయకత్వం— ఆమెకు ప్రత్యేకమైన అందాన్ని తెచ్చిపెట్టాయి.

ఆయన చూపులకు భయపడుతూ—"ఎవరు మీరు?" అందామె.

"నీ శ్రేయోభిలాషిని...."

"ఎందుకొచ్చారు?"

"నీ క్షేమం కోరి...."

"నాకిప్పుడేమయింది?"

"అది తెలుసుకోవాలనే వచ్చాను...."

"రెండు నెలల క్రితం మాకు పెళ్ళయింది. హనీ మూన్ కీ ఊరు వచ్చాం. నాదెంతో సుఖమైన జీవితం...."

ఆమె అబద్ధం చెబుతోందని చెంగల్రావు గ్రహించాడు. ఆమెకు అర్థం కావాలనే—"నాకు నీ గురించిన వివరాలు ఎలక్ట్రానిక్ హౌస్ లో లభించాయి...." అన్నాడు.

"ఎలక్ట్రానిక్ హావుస్ అంటే?"

చెంగల్రావు నవ్వి— "నేను నీ శ్రేయోభిలాషినని తెలియక బాగా నటిస్తున్నావు కానీ—ముందు నన్ను నీ శరీరాన్ని పరీక్షించనీ...." అన్నాడు.

"పరీక్ష అంటే....?"

"పరీక్షంటే పరీక్షే.... నేను నిన్ను తాకనైనా తాకను...."

"పరీక్ష ఎందుకు?"

"మహిళలపట్ల మగవాడి క్రూరత్వం గురించి నేను కొన్ని పరిశోధనలు చేస్తున్నాను. నేనొక సంఘసేవ కుణ్ని. నా దగ్గ నువ్వు సిగ్గుపడనవసరంలేదు. నేనొకసారి నీ శరీరాన్ని చూసి వెళ్ళిపోతాను...."

ఆయన ఉద్దేశ్యం అరుణకర మైంది. అయినా అర్థం కానట్లు—"చూశారుగా, వెళ్ళండి!" అంది.

అప్పుడు చెంగళ్రావు తన ఉద్దేశ్యాన్ని మి కర్థ మయ్యేలా చెప్పాడు. అరుణ అంగీకరించలేదు. ఆయన మృదువుగా హెచ్చరించాడు. ఆమె వినలేను.

"మాసేజ్ పేరుతో వ్యభిచారం చేసే నువ్వు శ్రేయోభిలాషిగా వచ్చిన నావద్ద బెట్టుచేయడం తగని పని...." అన్నాడు చెంగళ్రావు.

"నీకెవ్వరో తప్పుడు సమాచారం అందజేశారు, నేను సామాన్య గృహిణిని. వ్యభిచారిణికాను. నా జోలికి రాకు...." అందామె చేతులు జోడించి.

అప్పుడు చెంగళ్రావు లాల్చీ జేబులోంచి చిన్న పిస్తోలు తీసి ఆమెకు గురిపెట్టి—"నేను చెప్పినట్లు వింటావా, చస్తావా?" అన్నాడు.

ఆమె హడలిపోయింది. మళ్ళీ మళ్ళీ బ్రతిమాలుతుంది. ఆయన చలించలేదు. చివరికి—"నన్ను తాకనని మాటి వ్వాలి...." అంది.

"ఎప్పుడో యిచ్చానామాట. నువ్వే నమ్మడంలేదు."

ప్రాణభయంకొద్దీ ఆమె అతడి మాటలనప్పుడు నమ్మింది.

చెంగళ్రావు ఆత్రంగా ఆమె వంకనే చూస్తున్నాడు. ఆమె కన్నీళ్ళకు చలించడంలేదు. ఆయన కళ్ళలో వింత వింత భావాలు....

అరుణ ఆయనముందు నగ్నంగా నిలబడింది. చెంగ్రాలావు తనా మెకిచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు.

"థాంక్యూ వెరీమచ్.... నేను వెడుతున్నాను...." అంటూ లేచాడాయన.

ఆయన ఉద్దేశ్య మేమిటో అర్థంకాక తెల్లబోయి చూస్తోంది అరుణ.

చెంగ్రాలావు సరిగ్గా తలుపులు తీయబోతూండగా బెల్ మ్రోగింది.

ఆయన తలుపు తీసేసరికి యెదురుగా ఓ యువకుడు న్నాడు. అతడు చెంగ్రాలావును చూసి తెల్లబోయి— "ఎవరు మీరు?" అన్నాడు.

ఆయన బదులివ్వలేదు.

"ఎవరు మీరు?" అన్నాడతడు మళ్ళీ.

చెంగ్రాలావు అతణ్ని తోసుకొని బయటకు వెడుతూ- "నీ పక్క గదిలోనే వుంటున్నాను. నాతో మాట్లాడాలనుకుంటే అక్కడకురా ..." అన్నాడు.

అతడు తెల్లబోయి అలాగే నిలబడిపోయాడొక్క క్షణం. తర్వాత లోపల అడుగుపెట్టి తలుపువేసి— "అరుణా!" అన్నాడు.

అరుణ అప్పుడతడికి కనపడుతూనే వుంది. ఆమె హడావుడిగా బట్టలు వేసుకుంటోంది.

"అరుణా!" అన్నాడతడు. అది పిలుపుకాదు. అరుపు.

# 8

"హలో!" అన్నాడు చెంగ్రాలావు.

"నేనురా ఇడియట్!" అన్నాడు ఇందుభూషణ్

"ఏమిటి విశేషం?"

"నువ్వు చెప్పిన ముగ్గురు మహనీయులూ అరెస్ట

య్యారు. ఏ క్షణంలోనైనా అరెస్టు చేయడానికి వాళ్ళ మీద తలకు మోపెడు నేరారోపణ లున్నాయి....”

“మరైతే ఇన్నాళ్ళూ ఏం చేస్తున్నారు మీరంతా?”

“ఇప్పుడైనా వాళ్ళ జోలికి వెళ్ళకపోదును. నీకోసం.”

“ఇది చాలా దారుణం....” అన్నాడు చెంగల్రావు.

“అందుకే కదా నేను ఫుల్ ప్లస్ రాస్కెల్నని ఒప్పుకుంటున్నాను....”

“చాలా థాంక్స్ రా....”

“ఏమిటి_ఒప్పుకున్నందుకా?”

“కాదు_నాకోసం ఈ సాయం చేసినందుకు....అది వెంటనే ఫోన్ ద్వారా చెప్పినందుకు....”

“నీకు ఫోన్ చేసింది ఈ విశేషం చెప్పడానికి కాదురా ఇడియట్....”

“మరెందుకు?”

“నువ్వెప్పుడొస్తావా అని మీ వదిన ఇంటి దగ్గర యెదురు చూస్తోంది?”

“అందుకు సమయమింకా రాలేదు. వేచి వుండాల్సిందే....” అని ఫోన్ పెట్టేశాడు చెంగల్రావు.

సరిగ్గా అప్పుడే గదిలో బెల్ మ్రోగింది.

చెంగల్రావు తనే లేచి వెళ్ళి తలుపు తీశాడు.

బయట అరుణ, ఆమె ప్రియుడు వున్నారు.

“లోపలకు రావచ్చా?” అన్నాడు అరుణ ప్రియుడు.

“ష్యూర్!” అంటూ లోపలకు దారితీశాడు చెంగల్రావు.

అరుణ లోపలకు వచ్చింది. అరుణ ప్రియుడు తలుపులు వేసి తను లోపలకు వచ్చాడు.

“కూర్చోండి_” అన్నాడు చెంగల్రావు.

సోఫాల్లో ముగ్గురూ కూర్చున్నారు.

"నా పేరు దక్షిణామూర్తి. కోపంతప్ప నీ దయాదాక్షిణ్యాలుండవని నా మిత్రులంతా అంటారు...."

"అయితే?"

"నాకిప్పుడు కోపం వచ్చింది...."

"ఎందుకు?"

"నువ్వు నా భార్య అరుణపై అత్యాచారం చేశావు"

"లేదు...." అన్నాడు చెంగల్రావు.

"అలాగని నీపై పోలీసు కేసు పెట్టబోతున్నాను.."

చెంగల్రావు నవ్వి—"అందుకు నోటిమాట చాలదు. రుజువులు కావాలి. భార్యని చెప్పుకుంటున్న నీ ప్రియురాలు అరుణను నేను తాకనైనా తాకలేదు—" అన్నాడు.

"ఆ విషయం అరుణ చెప్పింది. ఆమెను నేను నమ్ముతున్నాను. అయినా నిన్ను క్షమించలేను...." అన్నాడు దక్షిణామూర్తి.

"నా జీవితం నీ క్షమపై ఆధారపడిలేదు...."

"అదిప్పుడే తెలుసుకుంటావు...." అంటూ అతడు జేబులోంచి బటన్ నైఫ్ తీసి — "ఇదిప్పుడే నీకోసం కొని తెచ్చాను...." అన్నాడు.

"డబ్బులు వేస్టు...." అన్నాడు చెంగల్రావు నిర్లక్ష్యంగా.

"ఇప్పుడు అరుణ నీపై అత్యాచారం చేస్తుంది. నువ్వు ప్రతిఘటిస్తావు. ప్రతిఘటించవూ — కత్తి నీ కంటిని పలకరిస్తుంది...."

"ఎందుకిదంతా?"

"నువ్వు అరుణపై అత్యాచారం చేయబోయావన

దానికి ఆమె శరీరంపై నిదర్శనాలు కావాలిగా...." అన్నాడు దక్షిణామూర్తి.

"అనవసరంగా కష్టపడుతున్నావు...." అన్నాడు చెంగల్రావు.

"నీవంటివాడికి బుద్ధి చెప్పడానికి ఈమాత్రం కష్టపడక తప్పదు. ఆడది మీదకు వస్తోంది కదా అని అత్యాచారం చేయడానికి ప్రయత్నించకు. కత్తి నిన్ను క్రూరంగా పలకరిస్తుంది___" అన్నాడు దక్షిణామూర్తి.

"సరే___వన్ టూ త్రీ అనేదాకా వ్యవధియ్యి నాకు"

"ఊఁ" అన్నాడు దక్షిణామూర్తి.

చెంగల్రావు వెంటనే గట్టిగా-"వన్....టూ....త్రీ" అన్నాడు.

అంతే!

పక్క గదిలోంచి యిద్దరు కండలు తిరిగిన వస్తాదులు వచ్చారు. ఇద్దరూ సన్నగా వున్నారు. వంటిమీద చొక్కాలు లేవు..

దక్షిణామూర్తి ఏం జరుగుతున్నదీ తెలుసుకునేలోగా ఒక వస్తాదు అతడివైపు ఏదో విసిరాడు. అది గురిగా అతడి చేతికి తగిలింది. కత్తి అతడి చేతిలోంచి జారి పడింది.

"వాళ్ళు కత్తుల్లాంటి వాళ్ళు. తాము కత్తులు వాడరు. యెదుటివారి కత్తులకు భయపడరు. వంగి కత్తిని తీయడానికి ప్రయత్నించావంటే మాత్రం ముందు నువ్వు వెనక్కి పడతావు...." అన్నాడు చెంగల్రావు.

అప్పటికి వస్తాదులిద్దరూ దక్షిణామూర్తిని సమీపించారు.

దక్షిణామూర్తి ముఖంలో భయం కనపడింది.

"వారినేమీ చేయకద్దు...." అంది అరుణ కంగారుగా.

చెంగల్రావు నవ్వి—"వాళ్ళిద్దరితో నాకు వేరే పని వుంది. మీరిద్దరూ మర్యాదగా ఇక్కణ్నించి వెళ్ళిపోతే ఎవ్వరూ మీ జోలికి రారు...." అన్నాడు.

అరుణ దక్షిణామూర్తి పక్కకు వెళ్ళి-"పదండి-వెళ్ళిపోదాం-" అంది.

"నువ్వు నా భార్యను అవమానించావు. నే నిది మర్చిపోను...." అన్నాడు దక్షిణామూర్తి.

"ఆమె నీ భార్య అయుంటే నేను అవమానించి వుండేవాణ్ని కాదు. నువ్వే ఆమెను భార్య అని—ఆడదాన్నే అవమానిస్తున్నావు.... '

అరుణ కంగారుగా - "నా గురించి మీకేం తెలుసని అలాగంటున్నారు? మీర నే మాటలు నా కాపురంలో నిప్పులు పోస్తాయని తెలియదా?" అంది.

"ఇతరుల కాపురాల్లో నిప్పులు పోసే నువ్వు నీ కాపురం గురించి మాట్లాడుతున్నావా? ఈ దక్షిణామూర్తి నిజంగా నీకు భర్త కాడని నాకు తెలుసు.... అతడు ప్రస్తుతం నీ అన్యాయం గురించి మాట్లాడుతున్నా-తన భార్యకు చేసిన అన్యాయం గురించి నాకు తెలుసు" అన్నాడు చెంగల్రావు.

"అరుణా! నేను నిన్ను నమ్ముతున్నాను. నువ్వు నన్ను నమ్ముతున్నావు. ఈ ఉన్మాదుడి మాటలతో మనకు నిమిత్తంలేదు. పద - పోదాం...." అన్నాడు దక్షిణామూర్తి.

చెంగల్రావు తను వంగి క్రిందపడిన కత్తితీసి - "ఇంద-ఇదికూడా తీసుకొని వెళ్ళు. ఇక్కడ మర్చిపోయావు...."

అన్నాడు.

"ఎప్పుడో ఒక రోజున నువ్వు చేసిన తప్పులకు విచారిస్తావు. అప్పుడు నా పేరు చెప్పుకొని ఆ కత్తి తీసుకుని ఆత్మహత్య చేసుకో-" అని అరుణతో సహా అక్కణ్నించి వెళ్ళిపోయాడు దక్షిణామూర్తి.

# 9

"బాబుగారు మళ్ళీ వచ్చారు. కానీ ఈ సమయంలో వచ్చారేంటి?" అంది మంగాయమ్మ.

"ఇప్పుడైతే మొత్తం అందర్నీ చూడొచ్చుగదా అని వచ్చాను.... సాయంత్రమైతే కొందరు బుక్కైపోతారు" అన్నాడు చెంగల్రావు.

ఆయన మాటలు మంగాయమ్మకు అర్థంకాలేదు-"ఈ సమయంలో వాళ్ళనేం చూస్తారు? చాలామంది నిద్రపోతూంటారు.." అందామె.

"అందర్నీ ఉన్నవాటిలో మంచి బట్టలు వేసుకుని తయారుగా ఉండమను-" అన్నాడు చెంగల్రావు.

"ఎందుకు?"

"అంతమంది వేశ్యల నొక్కచోట చూడడం అదో అనుభవం. అలనాటి శ్రీకృష్ణుడి అనుభవాన్ని తలచన్నాలి-...." అని మంగాయమ్మ ఏదో అనబోయేలోగా అయిదువంద రూపాయలనోట్లు మెకు అందించాడు చెంగల్రావు.

"ఒక్క అయిదు నిముషాలు బాబుగారూ-తమరిక్కడ కూర్చోండి. పైన హాలుంది. అందర్నీ అక్కడ చేర్చి వస్తాను-" అంటూ మంగాయమ్మ హుషారుగా అక్కణ్నించి వెళ్ళిపోయింది.

చెంగల్రావు హుందాగా అక్కడ కుర్చీలో కూర్చు

న్నాడు.

ఓ పావు గంటలో మంగాయమ్మ అక్కడకు వచ్చి-
"రండి బాబూ—హాల్లోకి వెడదాం...." అంది.

చెంగల్రావు వీధిలోకి వెళ్ళి మళ్ళీ లోపలకు వచ్చాడు.
మంగాయమ్మ వెనుక నే నడిచాడు.

పాతకాలపు మేడ మెట్లు....

అక్కడ పాతవాసన....

ముందు మంగాయమ్మ.... వెనుక చెంగల్రావు....

ఇద్దరూ హాల్లో ప్రవేశించారు. అక్కడ సుమారు
యాభై మంది స్త్రీలున్నారు. వారిలో చాలామంది
చాకబారు మనుషుల్లాగే ఉన్నారు. వయసొక్కటే వారి
లోని ఆకర్షణ. అంగులో అంతకుముందు తానెన్నుకున్న
ఇద్దరు యువతులనుకూడా గుర్తుపట్టాడు చెంగల్రావు.
వాళ్ళాయన్ను చూసి పలకరింపుగా నవ్వారు. ఆయన
నవ్వలేదు.

హాలుకు మొత్తం నాలుగు వైపుల తలుపులున్నాయి.
వాళ్ళొచ్చిన ద్వారం తప్ప మిగతా ద్వారాలన్నీ మూసి
ఉన్నాయి.

మంగాయమ్మ, చెంగల్రావు—ఒకరికొకరు పక్కగా
నిలబడ్డారు.

వాళ్ళ కెదురుగా వేశ్యలు....

"నేను సరిగ్గా పది అంకెలు లెక్కపెడతాను.
అప్పుడు మీరందరూ నృత్యం ప్రారంభించాలి-" అన్నాడు
చెంగల్రావు.

"నేను వెడతాను బాబూ—" అంది మంగాయమ్మ.

"వద్దు. నీతో కలిసి నృత్యం చూడడమే నాకు
వినోదం — నువ్వూ ఇక్కడే వుండు...." అన్నాడు

చెంగల్రావు.

"ఇతగాడి వ్యవహారం తమాషాగా వుంది-" అనుకుంది మంగాయమ్మ.

చెంగల్రావు అంకెలు లెక్కపెట్టడం ప్రారంభించాడు.

ఒకటి.... రెండు......ఏడు....ఎనిమిది....తొమ్మిది....

"పది!" అన్నాడాయన గట్టిగా.

వెంటనే వేశ్యలు నాట్యం ప్రారంభించబోయి ఆగిపోయారు.

అప్పుడే తెరిచి ఉన్న ఆ ఒక్క ద్వారంలోంచీ ఇద్దరు వస్తాదులక్కడ ప్రవేశించారు.

ఇద్దరూ కండలుతిరిగి వున్నారు. వంటిమీద చొక్కాలు లేవు. అన్నిటికీ మించి ఇద్దరి చేతుల్లోనూ కొరడాలున్నాయి.

"ఏమిటిది?" అంది మంగాయమ్మ కంగారుగా.

వస్తాదులు తలుపులు మూశారు.

"ఏమిటిది?" అంది మంగాయమ్మ.

"ఎవ్వరూ కదలకండి. కదిలితే కొరడా దెబ్బలే!" అన్నాడు చెంగల్రావు కరుకుగా.

వేశ్యలెవ్వరూ కదలలేదు. అందరి కళ్ళలోనూ చెప్పలేనంత భయం తొంగిచూస్తోంది. శ్రీరామ్‌ను మించిన క్రూర శిక్ష తమపై అమలు జరుగబోతున్నదన్న అనుమానం వారిలో ప్రతి ఒక్కరికీ కలిగింది.

"ఏమిటిది?" అంది మంగాయమ్మ యింకోసారి.

అదే ఆమె ఆఖరు మాట.

ఇద్దరు వస్తాదులూ ఆమెను సమీపించారు. నోట్లో గుడ్డలు కుక్కారు. బట్టలు విప్పారు. చేతులూ కాళ్ళూ

కట్టేశారు. చెరో పక్కనా కొరడా ఎత్తి నిలబడ్డారు. వేశ్యలంతా తెల్లబోయి చూస్తున్నారు.

"ఈ రోజు మీకు విముక్తి దినం. ఇనప్పెట్టెలో డబ్బుంది. మీరందరూ సమంగా పంచుకుని ఇక్కణ్నించి వెళ్ళిపోండి. మిమ్మల్నెవ్వరూ అడ్డగించలేరు. శ్రీరామ్ ప్రస్తుతం జైల్లో వున్నాడు. అతడి అనుచరులెవ్వరూ కొద్ది రోజులవరకూ ఈ దరిదాపుల్లోకూడా అడుగు పెట్టారు. మీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళి—స్వతంత్రంగా, గౌరవంగా బ్రతకండి. నాలుగిళ్ళలో పాచిపనులు చేసుకున్నా తప్పులేదు. తిరిగి వ్యభిచారానికి మాత్రం పాల్పడకండి-" అన్నాడు చెంగల్రావు.

వేశ్యలందరూ తెల్లముఖాలు వేశారు. జరుగుతున్నది కలో, నిజమో వారికి తెలియడంలేదు.

చెంగల్రావు కొనసాగించాడు—"ఎవరు పాపానికైనా శిక్ష తప్పదు. గతంలో మిమ్మల్ని మంగాయమ్మ క్రూరంగా హింసించింది. ఆ హింస ఎలా వుంటుందో ఆమెకూ తెలియాలి. ఇప్పుడు భగవంతుడి తరఫున నేనమలు జరిపే శిక్షను మీరందరూ కళ్ళారా చూసి వినోదించి అప్పుడే బయటకు వెళ్ళవచ్చు ఏమీ తొందరలేదు...." అని మంగాయమ్మవైపు తిరిగి—"ఈ కంపెనీ పోతే నువ్వు కొత్త కంపెనీ పెడతావని నాకు తెలుసు. కానీ ఎప్పుడైనా యెవరినైనా క్రూరంగా హింసించావంటే నా ప్రతినిధి వచ్చి మళ్ళీ శిక్ష అమలుజరిపి వెడతాడు—" అన్నాడు.

చెంగల్రావు పక్కకు తప్పుకోగానే వస్తాదులిద్దరూ కొరడాతో మంగాయమ్మను చెరో పది దెబ్బలూ కొదారు. ఆమె స్పృహతప్పి పడిపోయింది.

2

"పదండి-మనం పంకజం యింటికి వెడదాం!" అన్నాడాయన వస్తాదులతో.

## 10

తలుపు తీసిన అరుణ కంగారుపడి తలుపు వేసేయబోయింది. చెంగల్రావు బలవంతాన లోపలకు దూసుకుని వెళ్ళి-తలుపు మూసి - "కంగారుపడకు. నేను నిన్నేమీ చేయను. ఒక విషయంలో నీ సాయంకోరి వచ్చాను...." అన్నాడు.

"ఏమిటది?

"ఈ ఊళ్ళో నా కింకా నాలుగు రోజుల పని ఉంది. ఇప్పుడు అనుకోకుండా నాకో పని తగిలి ఊరు వదిలి వెళ్ళాల్సొస్తోంది. రేపటికి వచ్చేస్తాను...."

"అయితే?"

"పక్క గదిలో నా భార్య ఉంది. నా మీద కోపం కొద్దీ నీ దక్షిణామూర్తి ఆమె నేమైనా చేయవచ్చు. అందుకే నిన్ను వేడుకుంటున్నాను. నా వస్తాదులిద్దర్నీ నాతో తీసుకుని వెడుతున్నాను. ఆమెకు వేరే రక్షణ లేదు...."

"హోటలు వాళ్ళకు చెప్పి వెళ్ళకపోయావా?"

"మన కథ వాళ్ళందరికీ తెలియడం నాకిష్టంలేదు...."

"డబ్బు, బలగం-రెండూ ఉన్నవాడికిలా ఉన్నావు. నీ భార్యకామాత్రం రక్షణ ఏర్పాట్లు చేసుకోలేవా?" అందామె.

"చేసుకోగలను. కానీ నీ విషయంలో నిజంకూడా తెలుసుకోవాలనుంది. నీవు నిజంగా దక్షిణామూర్తి భార్యవే అయితే నిన్నుమించి అతడినుంచి నా భార్యను రక్షించగలవారెవ్వరూ లేరు..." అన్నాడు చెంగల్రావు.

అరుణ నవ్వి — "నా భర్త ముసలివాళ్ళ జోలికి వెళ్ళడు...." అంది.

"పడుచువాళ్ళ జోలికి వెళతాడా?" అన్నాడు చెంగల్రావు.

అరుణ తడబడి-"ఏమో నాకు తెలియదు ..." అంది.

"తెలుసుకోవడం నీకు మంచిది. నా భార్య వయసులో నీకంటే చిన్నదనుకుంటాను...." అన్నాడు చెంగల్రావు.

"నువ్వు....నువ్వు....నాకంటే చిన్నదాన్ని పెళ్ళిచేసుకున్నావా—అసలా పిల్ల యెలా ఒప్పుకుంది?"

"నాకు డబ్బు బలగం ఉందిలే!" అన్నాడు చెంగల్రావు. తర్వాత ఆయన అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

## 11

"ఇది మళ్ళీ ఏదో ట్రాప్ అయుంటుంది-" అన్నాడు దక్షిణామూర్తి.

"ఆయన వ్యవహారమంతా తమాషాగా ఉంది. పని గట్టుకుని వచ్చి తన భార్య సంగతి ఎందుకు చెప్పాడో నాకు తెలియడం లేదు...." అంది అరుణ.

"గదిలోకి నిన్నూ, నన్నూ రప్పించడానికిదో ప్రయత్నమనుకుంటాను. మనమొక పని చేద్దాం. ముందు నేనక్కడకు వెడతాను. పావుగంటలోగా నేను బయటకు రాకపోతే నువ్వే బయటివాళ్ళ సాయంతో వచ్చి తలుపులు తట్టు...." అన్నాడు.

"ఈ అయిడియా బాగుంది...." అందామె.

"జాగ్రత్తగా తలుపులు వేసుకో. పావుగంటలోగా నేను తప్ప ఎవరొచ్చినా తలుపులు తీయకు" అన్నాడు

దక్షిణామూర్తి.

"ఎందుకైనా మంచిది. ఆత్మరక్షణకేదైనా తీసుకొని వెళ్ళరూ?" అంది అరుణ.

దక్షిణామూర్తి ఒక్క క్షణం ఆలోచించి-"నీ చిన్న తమ్ముడికోసం మనం కొన్న టాయ్ పిస్టలుంది కదా—అదిలాగివ్వు...." అన్నాడు.

ఆమె పెట్టె తెరచి టాయ్ పిస్టల్ తీసి అతడికిచ్చింది.

దక్షిణామూర్తి పిస్టల్ జేబులో వేసుకొని కదిలొంచి బయటపడ్డాడు. అరుణ తలుపు వేసుకుంది.

## 12

"ఎవరూ?" అన్న కోమల స్వరం ముందు విని పించింది. ఆ వెనకనే తలుపులు తెరుచుకున్నాయి.

"నా పేరు దక్షిణామూర్తి. మీ శ్రేయోభిలాషిని. అర్జంటుగా మీతో మాట్లాడాలి-" అన్నాడతడు.

ఆమె పక్కకు తొలగి చోటిచ్చింది.

అతడు తలుపులు వేశాడు.

"రండి-కూర్చోండి-" అందామె మృదువుగా.

"మీరు చాలా అందంగా ఉన్నారు. ఇంత అందమైన భార్య ఉండగా చెంగల్రావుగారికి కదేంబుద్ధో?" అన్నాడతడు.

"ఏం జరిగింది?"

అతడు చెప్పాడు.

"నేను నమ్మను...." అందామె.

"ఎందుకని?"

"వారికి స్త్రీలంటే గౌరవం...."

"నా భార్యా నా గురించి అలాగే అనుకుంటుంది.."

"మీ భార్య ఎక్కడుంది?"

"పక్క గదిలో...."

"అయితే నాకోసారి పరిచయం చేయండి. తప్పా మెదే అయుంటుందని నా నమ్మకం. మా వారిని చూసి ఎందరో ఆడవాళ్ళు వెంటబడుతూంటారు - ఆయన్నాక్షించి డబ్బు సంపాదించాలని...." అందామె.

"ఆ సంగతి తర్వాత....ముందు నేను వచ్చిన పని చెబుతాను. నీమీద ప్రతీకారం తీర్చుకోవాలని వచ్చాను" అన్నాడతడు కటువుగా-అప్పుడే టాయ్ పిస్టల్ని చేతిలోకి తీసుకున్నాడతడు.

ఆమె భయపడింది. వణికిపోయింది.

అతడామె నోట్లో గుడ్డలు కుక్కాడు. చేతులు వెనక్కు విరిచి కట్టేశాడు. కాళ్ళుకూడా పాదాలవద్ద దగ్గర్లో ఉన్న తువ్వాలుతో కట్టేశాడు.

ఆమె అతడి వంక భయంగా చూసింది.

దక్షిణామూర్తి పక్కగదిలోనూ, బాత్రూంలోనూ యెవరైనా ఉన్నారేమోనని చూశాడు. ఎక్కడా యే విధమైన ప్రమాదమూ లేదని రూఢిపర్చుకొని అతడు బయటకు వచ్చి బయటిన్నుంచి తలుపులు వేశాడు.

మాడావుడిగా పక్క గది తలుపు కొట్టి - "అరుణా-నేను!" అన్నాడు.

అరుణ వచ్చి తలుపు తీసింది.

అతడు లోపలకు రాకుండా - "లోపల నాకోసం ట్రాప్ ఉంది. ఓ వస్తాదున్నాడు. టాయ్ పిస్టల్ చూసి వాడు దడుసుకున్నాడు. వాణ్ణి లాంగదీసేశాను. నేను వెళ్ళి పోలీసుల్ని పిల్చుకొని వస్తాను. చెంగల్రావు ఆట ఈ దెబ్బతో కట్టవుతుంది. ఈలోగా యెవరొచ్చినా నువ్వు తలుపు తీయకు...." అన్నాడు.

"అనవసరంగా ప్రమాదంలో చెలగాటమాడుతున్నా వేమో...." అంది అరుణ కంగారుగా.

"చెలగాటమాడింది నేను కాదు-చెంగల్రావు. అరుణా కంగారుపడకు. నీకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకుంటాను...."

ఆమె తలుపులు వేసుకు వేవరకూ అతడక్కడే ఆగాడు. ఆ వెను వెంటనే పక్క గది తలుపు తీసుకుని లోపలకు వెళ్ళాడు.

అక్కడ బంధించబడిన యువతి నిస్సహాయంగా, దీనంగా ద్వారంవైపే చూస్తోంది.

అతడు తలుపు వేశాడు.

## 13

"ఏరా__ఇడియట్-మొత్తంమీద నీ దర్శనమయింది నాకు...." అన్నాడు డీయస్పీ ఇందుభూషన్ ఉత్సాహంగా.

"వచ్చిన పని కాలేదు కానీ-ఓ మంచి పని చేసి వెడుతున్నానని తృప్తిగా వుంది నాకు...." అన్నాడు చెంకల్రావు.

"నువ్వు మంచి పనులు చేయనిదెప్పుడు?" అన్నాడు ఇందుభూషణ్.

"ఒకే ఒక్క చెడ్డపని చేశాను. అదే కదా నాకు శాపమైంది...."

"ఆ విషయం మర్చిపో...."

"ఎలా మర్చిపోనురా? మర్చిపోయే అవకాశంలేకుండా చేశాడా మాధవ్ నాకు. అలాగని మాధవ్‌నూ నేను తప్పుపట్టలేను...."

ఇందుభూషణ్ నిట్టూర్చాడు. ఆయనకు చెంగల్రావు

కథ తెలుసు.

చెంగల్రావు దగ్గర — ఆయన వ్యాపార వ్యవహారాలు చూసేవాడు మాధవ్. అతడి భార్యది కళ్ళు చెదిరే అందం.

ఓ ఆడపిల్లను కని చెంగల్రావు భార్య కన్నుమూసింది. తన భార్య ప్రతిరూపాన్ని కూతుర్లో చూసుకుంటూ యెంతో అభిమానించాడాయన చెంగల్రావు. కూతురికి సవతి తల్లిని తేవడం ఇష్టంలేక మళ్ళీ పెళ్ళిచేసుకో లేదాయన. ఫలితంగా మాధవ్ మకాం చెంగల్రావింటికి మారిపోయింది.

మాధవ్ భార్య ఆ ఇంట్లో స్వంతింట్లోలా మసిలింది. అప్పుడు చెంగల్రావు కూతురికి రెండేళ్ళు.

ఒకరోజున అనుకోని ఏకాంతంలో — చెంగల్రావు మనసు చలించింది. ఆయన మాధవ్ భార్యను బలవంతం చేశాడు. తన శాయశక్తులా ప్రతిఘటించి ఆయన పశు బలానికి లొంగిపోయిందామె.

తర్వాత విషయం మాధవ్‌కి తెలిసిపోయింది. ఆ తర్వాత ఒకరోజున మాధవ్ కుటుంబం - చెంగల్రావు కూతురితోసహా మాయమయింది. చెంగల్రావు ధనబలం పలుకుబడి - ఆయన కూతుర్ని వెతికిపెట్టలేక పోయాయి. అయితే ఆర్నెల్లకోసారి ఆయనకు ఉత్తరం వస్తూం డేది.

"చెంగల్రావ్! నీ కూతురు నా వద్ద క్షేమంగా వుంది. ఆర్నెల్లకోసారి నేనామె యోగక్షేమాలు తెలియబరు స్తూంటాను. నువ్వు నా భార్యకు చేసిన అన్యాయానికి ప్రతిఫలంగా నీకు నేను విధించే శిక్ష ఏమిటో తెలుసా? నీకిక స్త్రీ సుఖముండదు. నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకున్నా ఏ వేశ్యావాటికైనా వెళ్ళినా, ఇంటికి కాల్‌గర్ల్‌ని

రప్పించుకున్నా - నీ కూతురు ప్రాణాలకే ప్రమాదం— గుర్తుంచుకో!"

ఈ ఉత్తరం ఒకసారి బొంబాయినుంచి, ఒకసారి కలకత్తా నుంచి, మరోసారి ఢిల్లీనుంచి-ఇలా రకరకాల ప్రాంతాల నుండి వస్తూండేది.

"మర్చిపోక తప్పదు. ఆ మాధవ్ గాడు కనీసం నీ కూతురి యోగక్షేమాలు తెలియజేస్తున్నాడు. ఏదో ఒక రోజున నువ్వూ నీ కూతురూ తప్పక కలుసుకుంటారు..." అన్నాడు ఇందుభూషణ్.

సరిగ్గా అప్పుడే కాఫీలు తీసుకుని వచ్చింది ఇందుభూషణ్ భార్య కాంత — "కారణమేదైనా మీరు హోటల్లో మకాం పెట్టడం బాగోలేదు—" అందామె.

"మరోసారి వచ్చినపుడిలా చేయను-" అని హామీ ఇచ్చుకున్నాడు రెంగ్రావు అయితే అతడికి ఇందుభూషణ్ తో యేదో చెప్పాలని ఉంది. ఇందుభూషణ్ అది గమనించి—"కాంతా! నా మిత్రుడికి కాఫీలో సరిపెట్టేయకు-ఇడ్లీ-కారప్పొడి-కొబ్బరి చట్నీ...వాడికెంతో యిష్టం-" అన్నాడు.

"మీరు టిఫిన్ తో సరిపెట్టేద్దామనుకుంటున్నారేమో ఈ పూటకు మరిదిగారి భోజనంకూడా యిక్కడే! అనుకోకుండా ఈ రోజు మంచి వంకాయలు దొరికాయి. గుత్తివంకాయ కూర మరిదిగారికిష్టమని నాకు తెలుసు.." అని అక్కణ్ణించి వెళ్ళిపోయింది కాంత.

"ఏమిటో—ఇప్పుడు చెప్పరా?" అన్నాడు ఇందుభూషణ్.

"మాధవ్ నామీద గొప్పగా పగ తీర్చుకుంటున్నాడు. ఇది చూడు...." అంటూ ఓ ఉత్తరం అందిం

చాడు వెంకట్రావు. ఇందుభూషణ్ ఉత్తరం చదివాడు.

"డియర్ వెంకట్రావ్!

నీ కూతురిప్పుడు నవయవ్వనంలో ఉంది. నువ్వు చేసిన ఒక తప్పుకు నీ యవ్వనం వృధా చేశాను. అయితే అంతటితో నా పగ తీరదు. నవయవ్వనంలో ఉన్న నీ కూతుర్ని నీ స్నేహితుడు డియస్పీ ఇందుభూషణ్ ఉంటున్న ఊళ్ళో వ్యభిచారం కొంపలకమ్మేశాను. ఒక్కసారి నా భార్యను పాడుచేసినందుకు ప్రతిఫలంగా యెన్నోసార్లు పాడవుతోంది నీ కూతురు. చేతనైతే వెళ్ళి నీ కూతుర్ని తెచ్చుకో. అక్కడ ఆమెకోసం నువ్వు వెతకాల్సిన ప్రదేశాలు రెండే రెండు. మందిరం వీధి, ఎలక్ట్రానిక్ హౌస్.

ఎన్నో ఏళ్లుగా దగ్గర లేకపోయినా నీ కూతుర్ని నువ్వు గుర్తుపట్టగలవనే అనుకుంటున్నాను.

—విస్ యూ బెస్టాఫ్ లక్...."

ఉత్తరం ఇందుభూషణ్ చేతుల్లో నలిగింది. ఆయన పళ్ళు పటపట కొరుకుతూ — "రాస్కెల్ — వీడికెంత ధైర్యం?" అన్నాడు.

"ఏది ఏమైనా నా కూతురుకోసమే నేనిక్కడకు వచ్చాను. నా ప్రయత్నం ఫలించలేదు. కానీ ఆ ప్రయత్నంలో మందిరం వీధిలోని యువతుల పాట్లు చూశాను. వాళ్ళందరిలో నా కూతురినే చూడగలిగాను. నా హృదయం ద్రవించిపోయింది. వాళ్ళందర్నీ ఆక్రమించి రక్షించాలనుకున్నాను. అందుకే మన పరిచయం రహస్యంగా ఉంచాను. మందిరం వీధి గూండాలకు చాలా పెద్ద పరిచయాలున్నాయి. వాళ్ళను జైల్లోకి తోయా

లంటే హఠాత్తుగా పోలీసుదాడి జరగాలి. నువ్వు సాయ
పడ్డావు...." అన్నాడు చెంగల్రావు.

"ఇంతకూ నీ కూతుర్నెలా గుర్తుపట్టాలనుకుంటు
న్నావు?"

"దానికి గుండెలపైన చాటన్నరవేలంత-కుడి మోకా
లుకు బాగా పైగా చిటికెన వేలంత రెండు మచ్చ
లున్నాయి. అవే దానికి గుర్తు...."

"అయితే మీ అమ్మాయి గుర్తులు మామూలుగా
తెలుసుకోవడం కష్టం...." అన్నాడు ఇందుభూషణ్
సాలోచనగా.

"అయినా నా ప్రయత్నాలు నేను చేస్తూనే
ఉన్నాను. అనుమానం తగిలిన ఏ యువతినీ వదల్లేను.
చాలామంది ఆడవాళ్ళకు నేనంటే దురభిప్రాయంకూడా
యేర్పడింది. అయినా నేను వాళ్ళకు అసలు కథ చెప్ప
లేదు. అది వింటే యెవరూ నమ్మరు. కొబ్బరిచెట్టు మీద
గడ్డికోసం యెక్కానన్నట్లుంటుంది__కదూ?"

ఇందుభూషణ్ నిట్టూర్చి—"పోలీసు డిపార్టుమెంట్లో
ఉండికూడా నేనేమీ సాయం చేయలేకపోయాను నీకు"
అన్నాడు.

"విచారించకు. నా కూతురు నాకింక దొరకదు.
మందిరం వీధిలోని యువతులకు విముక్తి కలిగించేక నా
మనసుకెంతో తృప్తి కలిగింది. ఆ పుణ్యమే నా కూతుర్ని
కాపాడుతుంది. నేనింక దానికోసం అన్వేషించను. ఈ
అన్వేషణ పేరు చెప్పి నేను కొందరు సంసార స్త్రీల
నిబ్బందికి గురిచేస్తున్నాను...." అంటూ అరుణ విషయం
చెప్పి—"ఎలక్ట్రానిక్ హవుస్ లో వాకబు చేశాను.
అరుణ ఆ సంస్థకు సంబంధించిన యువతి కాదు. నాకు

చెప్పబడిన యువతి యిచ్చిన అడ్రసును నేను తప్పుగా అర్థం చేసుకున్నాను. ఆమె ఉంటున్నది శ్రీ శ్రీ దుర్గా లాడ్జిలోనట. శ్రీ దుర్గాలో కాదు.... ఈ విషయం తెలిసి నేను చాలా సిగ్గుపడ్డాను...." అన్నాడు చెంగల్రావు.

జరిగినదంతా విని—"నీ కథ చాలా తమాషాగా వుంది. నీ పద్ధతినిబట్టి నీవు నీ కూతురి నన్వేషిస్తున్నావని యెవరూ అనుకోరు. ఇంకేదైనా పద్ధతి ఎన్నుకోవలసిందేమో...." అన్నాడు ఇందుభూషణ్.

"ఇంక ఏ పద్ధతి గురించీ ఆలోచించను. జరిగింది చాలు...." అన్నాడు చెంగల్రావు బాధగా.

ఇందుభూషణ్ యేదో అనబోయి ఆగిపోయాడు. మూడు ప్లేట్లలో ఇడ్లీ తీసుకుని అప్పుడే ఆయన భార్య కాంత అక్కడికి వచ్చింది.

## 14

చెంగల్రావు నెమ్మదిగా నడుస్తూ తన గది ముందుకు వచ్చి ఆగిపోయాడు. ఆలోచిస్తూ కాలింగ్ బెల్ మ్రోగించాడు.

గది తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా కనపడ్డ వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు చెంగల్రావు—"ఎవరు మీరు?" అన్నాడాయన.

"గుర్తుపట్టలేదా—నేను—మాధవ్‌ని...."

"మాధవ్!" అన్నాడు చెంగల్రావు. ఆయన గొంతులో భయం, కంగారు, ఆవేదన అన్నీ ఒక్కసారి ధ్వనించాయి.

"లోపలకు రండి...." అన్నాడు మాధవ్.

చెంగల్రావు తలుపువేసి చటుక్కున మాధవ్ కాళ్ళ మీద పడిపోయి—"నా కూతుర్ని నాకిప్పించు. నా

యాచదా స్త్రీ నీకిచ్చేస్తాను. నన్నిక వేధించకు...."
అన్నాడు.

మాధవ్ అయన్ను లేవనెత్తి—"బాబూ! మీ మంచి తనాన్నర్థం చేసుకోలేక చాలా హింసపెట్టాను మిమ్మల్ని. మీరే నన్ను మన్నించాలి...." అన్నాడు.

చెంగల్రావు తెల్లపోయాడు.

మాధవ్ చెప్పసాగాడు.

ఏ పురాణాలలో చూసినా అనాదిగా పురుషుడు స్త్రీ ఆకర్షణకులోనై అవస్థలు పడుతున్నాడు. చెంగల్రావు భార్య పోయి బ్రహ్మచర్యం పాటిస్తూ ఏకాంతంలో మాధవ్ భార్యను చూసి ఉద్రేకం చెంది తప్పు చేశాడు. అప్పుడు తానజాగ్రత్తగా వుండడంలో కొంత మాధవ్ భార్య తప్పూ వుంది. ఆమె తన పరిమితులు మించి ఆ యింట్లో పరాయి పురుషుడున్నాడని మరిచింది. చెంగల్రావు తన్ను తానదుపు చేసుకోలేకపోయాడు. ఆ తప్పును మాధవ్ క్షమించలేకపోయాడు. అంతవరకూ అంతా మానవ సహజం.

అయితే కన్న కూతురికోసం తన కోరికలన్నీ చంపుకుని ఇంతకాలం జీవించిన చెంగల్రావులో అపూర్వమైన ప్రేమమూర్తి వున్నాడు. కూతురికోసం అన్వేషిస్తూ తన యెదుట కనబడిన నగ్న యువతిలో తనకావలసిన గుర్తులు మాత్రమే వెతకగలిగిన-మహా యోగి ఉన్నాడు. ఆయనను అనుమానించి మానసికంగా హింసించిన మాధవ్-ఇప్పుడెంతో పశ్చాత్తాప పడుతున్నాడు.

"హఠాత్తుగా నీలో యింత మార్పెలా వచ్చింది?"

"ఈ రోజు మీరు ఎలక్ట్రానిక్ హావుస్ నుంచి ఓ యువతిని రప్పించుకున్నారు. మీ పక్క గదిలోని

దక్షిణామూర్తికి ప్రతీకారం అవకాశమివ్వాలని మీరా పని చేశారు. ఆతడికి యెంతో కొంత మానసిక తృప్తి నివ్వాలన్నది మీ ఆశయం. అయితే దక్షిణామూర్తిలో మీకున్న ఉదాత్తత లేదు. భార్యకు అబద్ధంకూడా చెప్పి తనామెను బలవంతంగా అనుభవించబోయాడు. సమయానికి నేనామెను రక్షించగలిగానంటే వేరే సంగతి. ఇది జరిగేక — మీరెంత ఉదాత్తులో ఇంకా బాగా నాకర్థమయింది. అటుపైన మీరు మందిరం వీధి వేశ్యలకు విముక్తి కలిగించిన విధానం మీ గొప్పతనాన్ని చాటి చెప్పింది...." అన్నాడు మాధవ్.

"నా కూతురెక్కడ?" అన్నాడు చెంగల్రావు.

"బాబూ! నేను తండ్రీకూతుళ్ళను మరీ యింతకాలం విడదీసేటంత దుర్మార్గుణ్ణి కాదు. మీ అమ్మాయికి ఆరేళ్ళ వయసప్పుడే మీ యింటికి పంపించేశాను. గుర్తుచేసుకోండి. సుమారు పది సంవత్సరాల క్రితం మీ యింటికి ఆరేళ్ళ పాపతో వంటమనిషిగా వచ్చింది నారాయణమ్మ. ఆ పాప నారాయణమ్మ కూతురుకాదు. మీ అమ్మాయి."

"నిజం!" అన్నాడు చెంగల్రావు ఆశ్చర్యంగా.

"అవును. వంటమనిషి కూతురనుకుంటూనే ఆమెను మీరు కన్న కూతురిలా ఆదరించారు. ఆ మీ మంచితనమే మీ కూతురు సుఖంగా జీవించడానికి దారితీసింది...."

"మాధవ్ — నీకు నేను కృతజ్ఞుణ్ణి...." అన్నాడు చెంగల్రావు.

"బాబూ-నా ఆవేశాన్నీ, అవివేకాన్నీ మన్నించండి. మీరు ఆవేశంలో చేసిన తప్పుకంటే నా ఆవేదపు తప్పు క్షమించరానిదనిపిస్తోంది...."

"అయితే వెంటనే మనం బయలుదేరాలి. అంతకు

ముందు ఒక్కసారి పక్క గదికి వెళ్ళి అరుణను నా తప్పు క్షమించమని చెప్పాలి-" అన్నాడు చెంగల్రావు.

"వాళ్ళను మీరేమీ చెప్పక్కర్లేదు. వాళ్ళు నేను నియమించిన మనుషులే....ప్రస్తుతం వాళ్ళు గది ఖాళీచేసి వాళ్ళూరు వెళ్ళిపోయారు...."

చెంగల్రావు చటుక్కున ఫోన్ దగ్గరకు వెళ్ళి ఓ నంబరు డయల్ చేసి-"ఒరేయ్-ఫూల్ ప్లస్ రాస్కెల్!" అన్నాడు.

"హమ్మయ్య! రోజంతా మా యింట్లో వుండి ఈ మాటనలేదు నువ్వు. నాకిప్పుడెంతో సంతోషంగా వుంది. ఏమిటో ఆ శుభవార్త చెప్పు " అన్నాడు ఇందు భూషణ్ అవతలినుంచి.

"నా కూతురు దొరికింది__మా ఊరు రా__చూపిస్తాను...." అని ఫోన్ పెట్టేశాడు చెంగల్రావు.

__:అ యి పో యి ం ది:__

# రుద్రసింహం

వి.ఎస్. రావ్

తలుపు తోసుకుని అతను గదిలోకి ప్రవేశించి, వీపుతో తలుపు మూసి అలాగే నిలబడ్డాడు.

గదంతా సిగరెట్ పొగ పొగమంచులా వ్యాపించింది.

టేబుల్ చుట్టూ కుర్చీల్లో కూచున్న అయిదుగురు వ్యక్తులూ అతని వేపు చూశారు.

బ్రౌన్ కలర్ పాంటు స్నఫ్ కలర్ ఫుల్ స్వెట్టర్. అంగుళం పొడవు పెరిగిన గడ్డం. నల్ల కళ్ళద్దాలు. సగం కాలిన కరోనా సిగార్ అతని పళ్ళ మధ్యనుంచీ ఏటవాలుగా వేలాడుతోంది. సన్నగా, పొడుగ్గా వున్న కాళీప్రసాద్ తన అనుచరుల్ని చిరునవ్వుతో చూస్తూ ఖాళీ కుర్చీవేపు అడుగులేశాడు.

అయిదుగురూ వినయంగా లేచి నిలబడ్డారు.

చేతిలోని బ్రీఫ్‌కేస్‌ని టేబుల్‌మీద వుంచి, కాళీప్రసాద్ కుర్చీలో నిటారుగా కూచున్నాడు. నల్ల

కళ్ళద్దాల్ని తీసి, టేబుల్ మీద పెట్టాడు. అతని కళ్ళు ఎర్రగా వాళ్ళని పరీక్షిస్తున్నాయి. అందరూ నెలరోజులుగా గెడ్డాలు గీసుకోడం మానేశారు; అతని సలహా ప్రకారం. తిరపతి వెళ్ళబోయే యాత్రికుల్లా వున్నారందరు.

“డియర్ ఫ్రెండ్స్, ఎదురుచూసిన ముహూర్తం వచ్చేసింది! సిద్ధంగా వున్నారా?” కాళీప్రసాద్ కంఠం అతని ఆకారంతో పొత్తులేకుండా బిగ్గరగా, బొంగురుగా ధ్వనించింది. జవాబుగా అయిదు తలలూ పొలంలో గాలికి వూగే దిష్టిబొమ్మల తలల్లా వూగేయి.

కాళీప్రసాద్ బ్రీఫ్‌కేస్ తెరిచాడు. ఐదు వాకీ—టాకీల్ని, నాలుగంగుళాల పొడవూ, రెండంగుళాల వెడల్పూ వున్న అరడజను నల్లటి బాక్సుల్ని బల్లమీద జాగ్రత్తగా పెట్టాడు.

“భైరవ్!”

లావుగా పొట్టిగా ఉన్న వ్యక్తి లేచి నిలబడ్డాడు. టెలిఫోన్ మెకానిక్ దుస్తుల్లో ఉన్నాడతను.

“ఈ బాంబుని షెడ్‌లో వున్న అతని కారుకి తగిలించు. ఈ వాకీటాకీ నీ దగ్గరుంచుకో. ఇప్పుడు పదకొండున్నరయ్యింది. సరిగ్గా అరగంటలో నువ్వు పని పూర్తి చేస్తావ్. గోపీని నీతో తీసుకెళ్ళు. పని పూర్తి అయిన మరుక్షణం నాకు వాకీటాకీ ద్వారా రిపోర్ట్ చెయ్. ఆ తరవాత ప్రతి పదిహేను నిమిషాలకీ, అవసరమైన ప్రతి క్షణమూ—నువ్వు నాకు రిపోర్టు చేస్తూ వుంటావ్. ఆ ఇల్లూ, ఇంట్లోకి బైటికి వెళ్ళి, వచ్చే మనుషులూ నీ కళ్ళ నుంచి తప్పించుకోకూడదు. మాగ్నెటో ఫోన్, తతిమ్మా పరికరాలూ రెడీగా వున్నాయా?” కాళీప్రసాద్

ప్రశ్నించాడు.

"అన్నీ సిద్ధంగా వున్నాయి బాస్" భైరవ్ జవాబిచ్చాడు, వాకీటాకీనీ, బాంబునీ దాచుకుంటూ.

కాళీప్రసాద్ వాకీటాకీల్నీ బాంబుల్నీ మిగిలిన నలుగురికీ పంచాడు.

"మనం అయిదుగురం రంగస్థలానికి వెళ్తున్నాం. ఈ టపాకాయల్ని యెక్కడెక్కడ పెట్టాలో, యెవరెవరు ఏయే పని చేయాలో అక్కడ వివరిస్తాను. మనం అనుకున్న దానికన్నా అక్కడ మంద ఎక్కువగా వుండొచ్చు. ఏం జరిగిందో వాళ్ళు తెలుసుకునేలోగా పని జరిగిపోవాలి. మీకిచ్చిన జాబితాల ప్రకారం అన్నీ తెచ్చుకున్నారా?"

జవాబుగా అన్ని తలలూ పాముపడగల్లా ఆడేయి. ఎంత తక్కువగా మాట్లాడితే తాము నాయకుడికి అంత ఇష్టమని వాళ్ళకి తెలుసు'

"వెరీగుడ్ ....బాంబుల్ని పేల్చే ఎలెక్ట్రానిక్ డిటొనేటర్ నా దగ్గరుంది. నేను యింతకాలం ఇచ్చిన థీరిటికల్, ప్రాక్టికల్ ట్రెయినింగ్ ని పరీక్ష రానే విద్యార్థుల్లా-తెలివైన విద్యార్థుల్లా-గుర్తుంచుకుంటే నాటకం బ్రహ్మాండంగా విజయవంతమవుతుంది. మీ శక్తిసామర్థ్యాలమీద నాకు నమ్మకం వుంది. నేను మీకిచ్చిన కొత్త పేర్లకి మీరు చాలా సహజంగా రెస్పాండ్ అవుతున్నారు! కేపిటల్! .... భైరవ్, మొదట నువ్వూ, గోపీ వెళ్ళిపొండి. తరవాత అయిదు నిమిషాల్లో మేం నలుగురం మా గమ్యస్థానానికి బయల్దేరుతాం" అన్నాడు కాళీప్రసాద్.

ఆల్బర్టు చిన్నగా దగ్గి, టేబుల్ మీదున్న మూడు విస్కీ బాటిల్స్ నీ, సోడాబుడ్లనీ ఆశగా చూశాడు. అతని చూపుల్ని గ్రహించి కాళీప్రసాద్ చిన్నగా

నవ్వాడు. "హోటల్ వాళ్ళకి అనుమానం రాకుండా వుండటానికి డ్రింక్స్ తెప్పించమన్నాను. మనం పద్మ వ్యూహంలోకి వెళుతున్నాం. అక్కడికి విస్కీ తోడుగా రావడం ప్రమాదం! పనయ్యాక విస్కీలో మీరంతా స్నానాలు చేయొచ్చు. గ్లాసుల్లో కొద్దిగా విస్కీ పోసి, బుడ్డీల్ని సింకుల్లో ఖాళీచేయాలి. సోడాలు తాగేయాలి" అన్నాడతను.

రాంబాబు గోలీల్ని వేలితో కొట్టి, సోడాబుడ్లని అందరికీ అందించాడు. అల్బర్టు విచారంతో విస్కీ సీసాల్ని సింకులో వొంపేసి, గ్లాసుల్లో కొద్దికొద్దిగ పోశాడు. టేబిల్ మీద నాలుగు చుక్కలు వదిలాడు. కాళీప్రసాద్ కళ్ళు డేగకళ్ళలా అంతా గమనిస్తున్నాయి. సెట్టింగ్ చక్కగా వుంది!

గంగారామ్ చిన్నగా దగ్గాడు. అతను శబ్దం చేయడం అదే మొదటిసారి. అకారణంగా గంగారామ్ దగ్గాడు. కాళీప్రసాద్ అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు. "గంగారామ్, ఏమిటి?"

గంగారామ్ కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు. జేబులోంచి చార్మినార్ తీసి వెలిగించాడు.

"మీరందరూ, ముఖ్యంగా....గోపీ....నన్ను క్షమించాలి....చేజిక్కిన డబ్బులో గోపీ యెగిరిపోతే మనం ఏంచేస్తాం? .... ఇది .... చాలా పెద్ద మొత్తం .... ఈ రోజుల్లో నోటుని చూస్తే కుంటివాడూ గంతులేస్తూ అందకుండా పరిగెడతాడు!"

కాళీప్రసాద్ తీక్షణంగా చూశాడు. "గంగారామ్, మీ అయిదుగుర్నీ ఆర్నెల్లగా నేను రకరకాలుగా పరీక్షించి బేరీజు వేశాను. ఎన్నో విషయాల్లో నా అంచనా

తప్పినా, మనుషుల విషయంలో నా అంచనా ఇంత వరకూ తప్పలేదు! గోపీ పాత్రని నువ్వు పోషిస్తానంటే ఎవరు పోషిస్తామన్నా—నాకు అభ్యంతరం లేదు!"

"వొద్దులెండి .... నేను .... సులభంగా ఆశకు లొంగి పోతాను!" అన్నాడు గంగారామ్ చిన్నగా నవ్వుతూ.

"నిజం చెప్పినందుకు మెచ్చుకుంటున్నా. గోపీ మనల్ని మోసం చేయడు; మోసం చేయలేదు! అలా జరిగితే చట్టంతో బాటు అతని సహచరులూ అతనికోసం వేటాడతారు. ఈ హస్తాల్ని దాటి గోపీ ఎక్కడికీ పోలేడు!" అన్నాడు కాళీప్రసాద్ గోపీవైపు తీక్షణంగా చూస్తూ.

"గంగారామ్‌కి అనుమానం రావడం సహజం కాన్. నేను మనుషుల్ని మోసం చేస్తాను; స్నేహితుల్ని కాదు!" అన్నాడు గోపీ సగర్వంగా.

కాళీప్రసాద్ తృప్తికరంగా తలవూపాడు. "ఇది మన ఫస్టు ఎడ్వెంచర్. ముందు ముందు యిలాంటివెన్నో మనం చేపడతాం. నా బ్రెయిన్‌లో కోట్లవిలువ చేసే కొత్త కొత్త ప్లాన్‌లు చేపల్లా గెంతులేస్తున్నాయ్! మనం ఆరు పార్ట్సుగా, ఒక యంత్రంగా పనిచేస్తాం! పనయ్యాక మీరు అంతా మర్చిపోవాలి. ఈ ప్లానుకి సంబంధించిన బ్రెయిన్ వర్క్ పూర్తిగా నాది. ఈ క్షణందాకా, సింహలో పోసిన విస్కీతోసహా మొత్తం ఖర్చుని నేనే భరించాను. సెంట్ పర్సెంట్ రిస్క్ నేనే తీసుకుంటున్నా. అంచేత మొత్తంలో ఫిఫ్టీ పర్సెంట్ నేను తీసుకుంటాను. తతిమ్మాది మీ అందరిదీ! ఓకే?"

అందరూ సంగీతం వింటున్న వాళ్ళలా తలలు ఆడించారు. కాళీప్రసాద్ సాలోచనగా తన గెడ్డాన్ని తడువు

కున్నాడు.

"పని పూర్తవగానే మనం చేయాల్సిన మొదటి పని, గడ్డాలు గీసుకోడం! గుర్తుంచుకోండి. రంగంలో దిగిన క్షణంనుంచీ నేను గ్రీన్ సిగ్నల్ యిచ్చేదాకా అందరూ మొహాలకి మాస్కులూ, చేతులకి గ్లవ్సూ ధరించండి!

"షా లెటస్ స్టార్ట్!" అంటూ కాళీప్రసాద్ లేచాడు.

## 2

అర్ధరాత్రి దాటింది.

సిటీకి దూరంగా వున్న, 'ప్రతిధ్వని', 'ది ఎకో' దిన పత్రికల్నీ, ఇతర పత్రికల్నీ ప్రచురించే 'చక్రవర్తి ఎస్టేట్స్'లో లైట్లు వెలుగుతున్నాయి. సాధారణంగా డిస్పాచ్ శబ్దాలతో హడావిడిగా ఉండే కాంపౌండు స్మశానంలా నిశ్శబ్దంగా వుంది. తన పర్యవేక్షణలో పూర్తయిన పనిని కాళీప్రసాద్ జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు....

బిల్డింగ్ వెనక భాగంలో డిస్పాచ్ సెక్షన్ ముందు పది వ్యాన్‌లు వరసగా నిలబడ్డాయి. పత్రికలతో భర్తీ అయివుండాల్సిన వ్యాన్‌లు ఇవాళ ఖాళీగా వున్నాయి. మధ్యనున్న వ్యాన్ మీద వాకీటాకీ పట్టుకుని గంగారామ్ పద్మాసనం వేసుక్కూచున్నాడు. అతని వొళ్ళో రివాల్వర్ వుంది....

కాళీప్రసాద్ బిల్డింగ్ ఎడంవేపు నుంచీ ముందుభాగం చేరుకున్నాడు. మెయిన్ గేటు మూయబడి తాళం వేయబడింది. బిల్డింగ్ పైన రాంబాబు బురుజుమీద సిపాయిలా నిలబడ్డాడు. నల్లటి ఆకాశం బ్యాక్‌గ్రౌండ్‌లో అతను విగ్రహంలా ఉన్నాడు. అతని మెడలోంచి పవర్‌ఫుల్ బైనాక్యులర్ వేలాడుతోంది. కాళీప్రసాద్‌ను చూసి,

అతను చెయ్యొత్తాడు.

భవనాన్ని ప్రదక్షిణం చేస్తూ కాళీప్రసాద్ మళ్ళా వెనక భాగం — చేరుకున్నాడు. డిస్పాచ్ డోర్ గుండా లోపల ప్రవేశించాడు. హాల్లో గుట్టగా పడివున్న పేపర్ల, పత్రికల బండిల్స్‌ని తృప్తికరంగా చూశాడు. తమ చేతిలోని ఆయుధాల్ని చూసి, వర్కర్స్ అంతా వాటిని గడ్డివాములా మేటవేయడంలో పూర్తిగా సహకరించారు!

కాళీప్రసాద్ పక్కగా వున్న గదిలోకి ప్రవేశించాడు. నాటకం ఆఖరు సీనులో గ్రూప్‌ని చూసే డైరెక్టర్‌లా అందర్నీ పరీక్షగా చూశాడు. అతని కళ్ళు అందర్నీ లెక్కిస్తున్నాయి. పాతికమంది వర్కర్స్, పదిమంది యూనిఫామ్డ్ డ్రైవర్స్, ముగ్గురు సెక్యూరిటీ గార్డ్స్, సర్క్యులేషన్ అసిస్టెంట్స్ — అందరూ భద్రంగా ఉన్నారు!

అందరి మొహాల్లో ఆశ్చర్యం, భయం ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి. ఎదటివాడి భయం తనకి బలం! కాళీప్రసాద్ నవ్వుకున్నాడు.

సర్క్యులేషన్ మేనేజర్ కుర్చీలో కూచుని, కోపంగా చూస్తున్నాడు. ఆల్బర్టు చేతిలోని రివాల్వర్ అందర్నీ సునాయాసంగా కంట్రోల్ చేస్తోంది.

"గుడ్ వర్క్, ఆల్బర్టు! బరువులు మోసే ఈ బాండెడ్ లేబర్స్‌తో మనకి పనిలేదు. ఈ మందనంతా ఒక గదిలోకి తోలి బైట తాళం వేసెయ్. ఆ గదిలో టెలిఫోనుంటే లాగిపారేయ్. కిక్కురుమనకుండా కూచోమను. ఎవరేనా నీకు ఇబ్బంది కలిగించారా?" కాళీప్రసాద్ అడిగాడు.

ఆల్బర్టు సగర్వంగా నవ్వాడు. "పాపం.... అందరూ

గంగిగోవుల్లా ప్రవర్తిస్తున్నారు బాస్. గొడవ చెయ్యొద్దని మనం నోటితో చెప్పక్కర్లేదు!" అంటూ అల్బర్టు బైటికి నడవమని రివాల్వర్‌తో సైగ చేశాడు.

సర్క్యులేషన్ మేనేజర్ జంబులింగం కోపంగా కుర్చీలోంచి లేచాడు. కాళీప్రసాద్ అతన్ని చిరునవ్వుతో చూశాడు.

"ఎవర్నువ్వు? ఏమిటిదంతా? మర్యాదగా వెళ్ళి పొండి!" జంబులింగం అరిచాడు.

"బుద్ధిగా నీ మందీమార్బలంతో వెళ్ళి ఆ గదిలో కూచో" కాళీప్రసాద్ సలహా యిచ్చాడు.

"గదిలోకి వెళ్ళడంకాదు; నిన్నూ నీ గూండాల్నీ జైల్లోకి పంపిస్తాను!" జంబులింగం ఉద్రేకంతో అరిచాడు. కాళీప్రసాద్ అతన్ని తీక్షణంగా చూస్తూ, అల్బర్టుతో అన్నాడు.

"అల్బర్టు! సర్క్యులేషన్ మేనేజరుగారు ఆవేశపడుతున్నారు. ఆ మెత్తటి సింహాసనానికి అతన్ని కట్టెయ్!"

అల్బర్టు జేబులోంచి సన్నటి ప్లాస్టిక్ దారాన్ని లాగి, జంబులింగంవైపు నడిచాడు. క్షణంలో లావుగా పొట్టిగా వున్న జంబులింగం కాళీప్రసాద్‌వైపు దూసుకొచ్చాడు. కాళీప్రసాద్ ఎడంచెయ్యి అతని కాలర్ని పట్టుకొని, దూరంగా ఆపింది. అతను జంబులింగం కళ్ళల్లో తీక్షణంగా చూశాడు.

"వెళ్ళి నీ కుర్చీలో కూచో!"

జంబులింగం రౌద్రంగా చూశాడు. "షటప్! యూ స్కౌండ్రల్ ....యూ...." ఆ తరవాత జంబులింగం నోటమ్మట మాట రాలేదు.

పాంటుజేబులో వున్న కాళీప్రసాద్ కుడిచెయ్యి

రెప్పపాటులో దూసుకెళ్ళి కాటేస్తున్న కోడెత్రాచు పడగలా జంబులింగం మొహాన్ని తాకింది. ఫట్ మన్న చప్పుడు గాల్లో వ్యాపించింది.

జంబులింగం తటాలున రెండు చేతుల్తో తన మొహాన్ని కప్పేసుకున్నాడు. నోట్లోంచీ, ముక్కులోంచీ బైటికి ఉబుకుతున్న రక్తం అతని వేళ్ళసందులమ్మట కారసాగింది. అతని కళ్ళు కాళీప్రసాద్ గ్లవ్సుని చుట్టివున్న సైకిల్ చైనుని భయంగా చూస్తున్నాయి.

“ఆల్బర్టు, ఆ తాడుని అతని మెడకి తగిలించు. పొట్లగిత్తని లాక్కెళ్ళి కట్టేయ్!” కాళీప్రసాద్ కంఠం పిస్టల్ షాట్‌లా పేలింది.

జంబులింగం గాబరాగా చూశాడు. ఆల్బర్టు రెండు చేతుల్తో ప్లాస్టిక్ తాడుని పట్టుకొని పొగరుమోతు ఎద్దుని సమీపించేవాడులా వస్తున్నాడు.

జంబులింగం గబగబా తన కుర్చీవైపు నడిచి, కూచుని కట్టేయమన్నట్టు ఆల్బర్టువైపు చూశాడు. ఆల్బర్టు నవ్వుతూ అతని చేతుల్ని కుర్చీ వెనక్కిలాగి తాడు కొసతో రెండింటినీ కలిపి కట్టేశాడు. కుర్చీ కిందనుంచీ అతని రెండు కాళ్ళనీ వెనక్కి బిగుతుగా లాగి, కాళ్ళు గాల్లో వేళ్ళాడేలా బంధించాడు. ముందుకువచ్చి కార్టూన్ని చూస్తున్న వాడిలా తమాషాగా జంబులింగాన్ని చూస్తూ నిలబడ్డాడు.

“ఆల్బర్టు, వాళ్ళందర్నీ విడిదిలో దించిరా” అన్నాడు కాళీప్రసాద్. ఆల్బర్టు చేతిలోని రివాల్వర్ అందర్నీ బైటికి తీసుకెళ్ళింది. కాసేపట్లో నవ్వుతూ ఆల్బర్టు ప్రవేశించాడు.

కాళీప్రసాద్, జంబులింగం యెదురుగా కుర్చీలో కూచుని కాళ్ళని ముందున్న టేబుల్ గ్లాస్‌టాప్ మీద

వుంచి, వెనక్కి వాలాడు. బూట్ల మధ్యనుంచి జంబులింగాన్ని చూశాడు. అతని ముక్కులోంచీ రెండు కాలువలుగా కారుతున్న రక్తం, నోటిలోంచీ కారుతున్న రక్తంతో కలుస్తోంది.

"ఆల్బర్టు, గురుడు రక్తం కారి చచ్చేలా వున్నాడు. కొంచెం రిపేరు చెయ్!" అన్నాడు నవ్వుతూ.

ఆల్బర్టు జంబులింగం దగ్గరగా నడిచి, పాంటులో దోపుకున్న అతని షర్టుని బైటికిలాగి అతని మొహాన్ని కిందికి వంచి, రక్తాన్ని నిర్లక్ష్యంగా తుడిచాడు. టేబుల్ మీద ప్లాస్టిక్ కప్పులో వున్న స్పాంజిని అతని ముక్కుకి అదిమిపట్టాడు క్షణం సేపు.

"ఇంతకన్నా ఫస్టుఎయిడ్ ఇవ్వలేం బాస్!" అన్నాడు నవ్వుతూ. కాళీప్రసాద్ చిన్నగా నవ్వాడు.

"దటీస్ మోర్ దెన్ ఎనఫ్!" అంటూ టైం చూసుకున్నాడు. జేబులోంచీ వాకీటాకీ తీశాడు. కాసేపట్లో భైరవ్ అతన్ని పిలిచాడు.

భైరవ్ చెప్పింది విని, వాకీటాకీని బల్లమీద పెట్టాడు. స్వెటర్ చేతుల్ని మోచేతుల్దాకా పైకి తోశాడు. ఆల్బర్టు అతని వెనుక అలర్టుగా నిలబడ్డాడు.

మాస్కుల్లో భయంకరంగా వున్న ఆ ఇద్దర్నీ గాబరాగా చూస్తున్నాడు జంబులింగం.

కాళీప్రసాద్ ఎర్రటి టెలిఫోన్ని దగ్గరకు లాక్కున్నాడు. ఎడమ ముంజేతిమీద బాల్ పాయింట్ పెన్ తో రాసుకున్న నెంబర్ని డయల్ చేశాడు. అటువేపు ఫోను రింగవుతూనే వుంది. అతను ఓపిగ్గా వింటూ కూచున్నాడు. రెండు నిమిషాల తర్వాత రిసీవర్ని పడేసి, జంబులింగంవైపు చూశాడు. "మీ పబ్లిషర్ నిద్ర

మాత్రలు వేసుకుంటాడా?"

జంబులింగం అర్థంకానట్టు చూశాడు. రక్తం కారడం కొంచెం తగ్గింది. పై పెదవి రబ్బరులా వాచింది. "నువ్వెవరో, నీకేం కావాలో నాకు అర్థం కావడంలేదు.... చక్రవర్తిగారి గురించి నీకు తెలీదు ...యీ పాడు పని...."

కాళీప్రసాద్ చెయ్యెత్తి అతన్ని వారించాడు. "ఫూలాన్! ఫార్ములా డైలాగ్స్ నాకు నచ్చవు. నీ యజమాని నిద్రలేస్తే, నాకేంకావాలో నీకు తెలుస్తుంది" అంటూ మళ్ళీ ఫోనెత్తి డయల్ చేశాడు.

"ఎవరు....?" అటువైపు కంఠం కోపంగా ప్రశ్నించింది.

"పబ్లిషర్ చక్రవర్తా?" కాళీప్రసాద్ అడిగాడు. అటువైపు నుంచీ కోపంగా చిన్న మూలుగు వినిపించింది.

"మిస్టర్ చక్రవర్తీ, పూర్తి మెలకువొచ్చిందా?"

"షటప్! యెవర్నువ్వు? యెవరితో మాట్లాడుతున్నావో...."

"తెలుసు. నేను చెప్పే విషయాలు నీకు బాగా వినిపించాలి. చాలా, చాలా ముఖ్యమైన విషయాలు. అందుకే అడుగుతున్నా.... పూర్తిగా మేలుకున్నావా?"

"షటప్!"

"చక్రవర్తీ, బెటర్ యూ షటప్ అండ్ హియర్! నీ 'చక్రవర్తి కాంపౌండ్' పూర్తిగా నా చేతుల్లో వుంది. నేను 'ఉఫ్' అంటే ఎగిరిపోతుంది. నీ రెండు దినపత్రికలూ, రెండు వారపత్రికలూ, పక్షపత్రికా, మాసపత్రికలూ వగైరా చెత్త అంతా వ్యాన్స్‌లో డిశ్పాచ్ కాలేదు. గడ్డిలా హాల్లో మేట వేయబడ్డాయి...."

చక్రవర్తి కంఠం కాళీప్రసాద్ చెవుల్లో కోపంగా గర్జించింది: "ఎవరున్నవు? ఇది ప్రాక్టికల్ జోకా? నీ మీద..."

"ఏ చర్యా తీసుకోలేవు! నేను చెప్పేది విన్నాక— తీసుకోవు! నీ సామ్రాజ్యం పూర్తిగా నా చేతుల్లో వుంది! నా అరచేతిలో నీ నరకం వుంది. నా మాటల్ని నువ్వు గుడ్డిగా నమ్మక్కర్లేదు. ఇదిగో, నీ సర్క్యులేషన్ మేనేజర్ జంబులింగం నీ కంతా విన్నవిస్తాడు..." అంటూ ఫోన్ని అల్బర్టుకి అందించాడు. అల్బర్టు దగ్గరగా నడిచి, రిసీవర్ని జంబులింగం చెవికి, నోటికి అడ్జస్టు చేసి పట్టుకున్నాడు.

ప్రోత్సహించే అవసరం లేకుండానే జంబులింగం ఫోన్లో బొబ్బలెట్టసాగేడు. జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అతని కంఠం బొంగురు పోతోంది.

"వాట్! ఎవరు? ఎవరు వాళ్ళు?" అటువేపు నుంచీ చక్రవర్తి అరిచాడు. జంబులింగం జవాబు చెప్తున్నాడు. కాళీప్రసాద్ సైగతో అల్బర్టు ఫోన్ని దూరంగా లాగి శాన్కి అందించాడు. కాళీప్రసాద్ మెల్లగా ప్రారంభించాడు:

"మిస్టర్ పబ్లిషర్, నీ సందేహాలకి సమాధానాలు నా దగ్గరున్నాయి. నీ అఫ్ సెట్, ఫోటో సెట్టింగ్ మెషీన్లూ, టెలిప్రింటర్లూ, మిగతా అన్నిరకాల ఆధునిక ముద్రణ యంత్రాలూ, ముడికాగితం గోడౌనూ, డిస్పాచ్కి సిద్ధంగా వున్న అన్ని వ్యాన్లూ వగైరా వాటన్నింటికీ ప్రమాదకరమైన బాంబులు అమర్చబడ్డాయి. క్షణంలో బూడిద చేయడానికి వీలుగా నీ పబ్లికేషన్స్ అన్నీ కామదహనంరోజు చెత్తా చెదారంతో గుట్టగా చేయ

బడ్డాయి...."

చక్రవర్తి కంఠం అతన్ని అడ్డుకుంది. "ఎవరున్నావ్? నీకేమన్నా పిచ్చి పట్టిందా? పోలీసు...."

"చక్రవర్తీ, బుద్ధిగా నేను చెప్పేది విను. పూర్తిగా విన్నాక నీ యిష్టమొచ్చినట్టు చెయ్....అన్నట్టు ఆ బాంబుల్ని యాక్టివేట్ చేసే సోఫిస్టికేటెడ్ ఎలెక్ట్రానిక్ డివైస్ నా చేతిలో వుంది. ఒక్కో మీట నొక్కితే ఒక్కో బాంబు పేలుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే నేను చూపుడు వేలితో నొక్కితే నీకు నరకం!

నా మాటల్ని నువ్వు వెంటనే నమ్మకపోవచ్చు. షెడ్‌లోని నీ కారుకి ఒక శాంపిల్ బాంబు అతికించబడింది. ఇప్పుడు ఒంటిగంటా పది నిమిషాలయ్యింది. సరిగ్గా ఒకటి పద్దెనిమిది నిమిషాలకి, నీ సర్క్యులేషన్ మేనేజర్ సమక్షంలో నేను బటన్ నొక్కుతాను. చిన్న శబ్దంతో నీ కారూ, షెడ్డూ అన్నీ బూడిదై పోతాయి నీ కళ్ళ ముందే.

ఈలోగా మరికొన్ని విషయాలు నువ్వు తెలుసుకోవాలి. నీకు రేపు మధ్యాహ్నం పన్నెండు గంటల దాకా టైమిస్తున్నా. నా చూపుడు వేలు మీటల్ని నొక్కి బాంబుల్ని యాక్టివేట్ చేయకుండా వుండాలంటే, నువ్వు ఇరవై లక్షల రూపాయల్ని నాకు చదివించుకోవాలి...."

"ఇరవై ....లక్షలు! నీకు నిజంగా మతిపోయింది...." చక్రవర్తి అడ్డొచ్చాడు.

"చక్రవర్తీ! నీతో చెడుగుడు ఆడ్డానికి నాకు టైం లేదు. నేను అధికంగా డిమాండ్ చేయడం లేదు. అయామే రీజనబుల్ పర్సన్! ప్రజల్ని దోచుకోడానికి

రెడీగా వున్న రెండు దినపత్రికలూ, రెండు వార పత్రికలూ, ఒక సినిమా వారపత్రికా, పక్షపత్రికా, రెండు ప్రేమ కథల 'మూస' పత్రికలూ, పెద్దలు కూడా తప్పక చదవాల్సిన పిల్లల మాసపత్రికా—వీటన్నిటి ఫేస్ వాల్యూ ప్లస్ పని వ్యాల్యూ, ప్లస్ మెషినరీ ప్లస్ బిల్డింగూ—వీటన్నింటి విలువా ఇరవై లక్షలు మాత్రమే కాదని నీకు తెలుసు. నేను యింకా ఎక్కువ అడగొచ్చు. కానీ, ఇరవైకి నా కడుపు నిండుతుంది.

తరవాత.... ఈ విషయం, నాకు తెలీకుండా నువ్వు పోలీసులకి చెప్పలేవు! నువ్వు కదిలితే నాకు కనిపిస్తుంది; నువ్వు ఊపిరి పీలుస్తే నాకు వినిపిస్తుంది. 'నీ నీడ' అను క్షణం నాకు రన్నింగ్ కామెంటరీ ఇస్తుంది. ముడుపు చెల్లించేదాకా, నేను అనుమతి ఇచ్చేదాకా నీ కార్యస్థానం ఛాయలకు ఎవరూ రాకూడదు. ఆకాశంగుండా గానీ, నేలమీద గానీ! నీ సిబ్బంది కూడా పని చేయడానికి రాకూడదు.... అన్నట్టు ఒకటీపదెనిమిది కావొస్తోంది. నీ కారుషెడ్డు.... కిటికీ గుండా చూస్తూండు...." అంటూ కాళీప్రసాద్ ఫోన్ పెట్టేశాడు.

కాళీప్రసాద్ చిరునవ్వుతో జంబులింగంవైపు చూశాడు. అతని చెయ్యి స్వెట్టర్ లోపలికెళ్ళి ఎర్రటి ఎలెక్ట్రానిక్ పరికరంతో బైటికి వచ్చింది. దాన్ని జాగ్రత్తగా బల్లమీద పెట్టి 'C' అని గుర్తు పెట్టబడిన బటన్‌మీద మాపుడువేలిని వుంచాడు. అతని చూపులు గడియారంమీద నిలిచాయి.

బొటనవేలు బాక్స్ పక్కనవున్న కంట్రోల్‌ని రిలీజ్ చేసింది. క్లిక్‌మన్న చప్పుడు విని జంబులింగం గాబరాగా చూశాడు. ఒకటీ పద్దెనిమిది అయ్యింది.

కాళీప్రసాద్ చూపుడు వేలు బటన్ని సున్నితంగా నొక్కింది....

# 3

చక్రవర్తి తన చెవుల్నీ, కళ్ళనీ నమ్మలేకుండా వున్నాడు. వంద టపాకాయలు ఒకేసారి పేల్చిన చప్పుడైంది. కారుషెడ్డు మంటల్లో చిక్కుకుంది. కాస్సేపట్లో కారూ, షెడ్డూ అతని కళ్ళ ముందే కాలి బూడిద అయ్యాయి.

చక్రవర్తి కాళ్ళు వణుకుతున్నాయి. మెల్లగా నడిచి సోఫాలో కూలబడ్డాడు. ఇది కలా? నిజమా? అతను రెండు చేతుల్తో బుర్రని పట్టుకున్నాడు.

శబ్దం విని కేకపెడ్తూ లేచిన అతని భార్య లలిత అతన్ని గాబరాగా చూసింది. ఆమె వణికే కంఠంతో యేదో అడుగుతోంది. అతను యాంత్రికంగా కారుషెడ్డు వైపు చెయ్యి చూపించాడు. లలిత చిన్న చిన్న మంటల్ని ఆశ్చర్యంతో చూస్తోంది.

చుట్టుప్రక్కల యిళ్ళు యేవీ లేవు. ఇంటిలో వున్న యిద్దరు నౌకర్లు గోలగా అరుస్తూ పరుగెత్తుకు వచ్చారు. చక్రవర్తి వాళ్ళకు యేదో చెప్పిపంపాడు.

చక్రవర్తి గ్లాసెడు మంచినీళ్ళు తాగాడు. టెలిఫోన్ దగ్గరగా లాగి, ఎడిటర్ నెంబరు తిప్పాడు. నిమిషం తరవాత ఎడిటర్ కంఠం పలికింది.

"పరాంకుశం....చక్రవర్తి .... వెంటనే యిక్కడికి రా!" అన్నాడు వణికే గొంతుతో. పరాంకుశం యేదో ప్రశ్నించాడు.

"డోంట్ టాక్! ఎమర్జెన్సీ....క్షణంలో ఇక్కడుండాలి!" అంటూ రిసీవర్ని పడేసి, సోఫాలో వెనక్కి

వాలాడు.

"ఏం జరిగిందండీ....?" లలిత గాబరాగా ప్రశ్నించింది.

"లలితా! ప్రశ్నలు అడక్కు. కారు షెడ్డువైపు చూస్తూ కూచో!" అన్నాడతను అసహనంగా.

• • •

"ఫైరవ్ రిపోర్టింగ్ ...."

"యస్ ....గో ఆన్!" అన్నాడు కాళీప్రసాద్.

"కారూ, షెడ్డూ కాలి బూడిదయ్యాయి. తను పరాంకుశం అనే వ్యక్తిని అర్జెంటుగా రమ్మని ఫోన్ చేశాడు బాస్...."

"పరాంకుశం ఎడిటర్ .... ఎడిటర్ .... ఓకే .... ఫైరవ్ ....కళ్ళూ, చెవులూ బాగా తెరుచుకుని కూచో. ఏది చూసినా, యేది విన్నా నాకు రిపోర్టు చెయ్. ఓవర్!" అన్నాడు కాళీప్రసాద్.

# 4

ఎడిటర్ పరాంకుశం నమ్మలేనట్టు వింటున్నాడు. అతని మొహం రంగులు మారుతోంది. కూచున్న చోటన్నించీ లేచి పచార్లు చేయసాగేడు. కిటికీ ముందు నిలబడి కారు షెడ్డు శిథిలాన్ని చూసి వెనక్కి తిరిగాడు.

"సార్, ఇది ఘోరం! అక్రమం! మనం ఉపేక్షించ రాదు. వెంటనే పోలీసులకి రిపోర్టివ్వండి!"

"పరాంకుశం....ఆ పని మనం చేయలేం...."

"సార్! మామూలు మనిషిలా మాట్లాడుతున్నారు! ఇలాంటి సందర్భాల్లో మనలాంటివాళ్ళు పూర్తిగా పోలీసులతో సహకరించాలి. బ్లాక్ మెయిలర్స్‌కి మనం లొంగకూడదు. నేరస్థుల్ని పరోక్షంగా మనం ప్రోత్స

హించకూడదు...."

చక్రవర్తి బలహీనంగా తల అడ్డంగా ఆడించాడు.

"సార్, డబ్బూ, పలుకుబడీ అన్నీ వున్న మీరు జులాయిగాళ్ళ బెదిరింపులకి లొంగకూడదు! ప్రాక్టికల్‌గా వ్యవహరించండి...."

"పరాంకుశం, నీ ఉపన్యాసం సంపాదకీయానికి బాగుంటుంది! కోటీ అరవై లక్షల ఆస్తి పణంగా వుంటే నువ్వంత ధైర్యంగా మాట్లాడవు....ఎంతో కొంత వాడికి పారేస్తాం...."

"సార్...."

టెలిఫోన్ రింగ్ చక్రవర్తికి మాట్లాడే అవకాశం ఇవ్వలేదు. రిసీవర్ని అందుకుంటూ పక్కనే వున్న మరో ఫోన్ని తీసుకొమ్మని పరాంకుశానికి సైగ చేశాడు.

"చక్రవర్తీ, నేను ప్రాక్టికల్ జోకర్ని కాననీ, ప్రాక్టికల్ మనిషిననీ నువ్వు ఈపాటికి గ్రహించి వుంటావు....అన్నట్టు నీ ఎడిటర్....నీ చేతిలో కత్తి.... యిప్పుడు నీ దగ్గరున్నాడు! అతన్నీ వినమను! నీ యింటి సమీపంలో, నీ ప్రెస్ కాంపౌండు బిల్డింగ్ పైనా, వెలుపలా, లోపలా నా మనుషు లున్నారు. ప్రతి అయిదు నిమిషాలకీ వాళ్ళు వైర్‌లెస్‌లో నాతో మాట్లాడతారు. వాళ్ళలో యెవరికి ప్రమాదం జరిగినా, నీకు ప్రమాదం జరుగుతుంది. వాళ్ళు క్షేమంగా వుంటే నువ్వూ క్షేమంగా వుంటావ్, నిర్ణీత సమయానికి నిర్ణీతమైన కోడ్‌లో వాళ్లు నాకు రిపోర్టు చేయకపోతే బటన్స్ నొక్కబడతాయ్; బాంబ్స్ పేలుతాయ్! అర్థమైందా?" కాళీప్రసాద్ ప్రశ్నించాడు.

చక్రవర్తి పరాంకుశం వైపు చూశాడు. అతని నుదురు

మీద చెమటలు కమ్ముతున్నాయి. "అర్థమైంది .... నువ్వెవరో నాకు తెలీదు....లక్ష రూపాయలిస్తాను.... నన్నొదిలేయ్...." చక్రవర్తి ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

అటువైపున కాళీప్రసాద్ బిగ్గరగా నవ్వాడు. "చక్రవర్తీ, పేరుకు తగ్గట్టు ప్రవర్తించు. బిచ్చగాడిలా బతిమిలాడకు! నీ పత్రికల సర్క్యులేషన్, వాటి ధరలూ నాకు తెలుసు. ఇరవైకి తగ్గదు. ఆ మొత్తంలో నా ఖర్చులు చేర్చలేదు కూడా! మరోసారి నువ్వు బేరమాడితే అది పాతిక అవుతుంది! అలా ప్రతిసారీ అయిదులక్షల వంతున రేటు పెరుగుతూ వుంటుంది.

ముఖ్యంగా మరో సలహా: రేపట్నుంచీ రెండు రోజులు నీ పబ్లికేషన్ సంస్థకి శలవు ప్రకటించు. మెకానికల్ ట్రబుల్! నేను గ్రీన్ సిగ్నల్ యిచ్చేదాకా యిటు వేపు నరమానవుడు రాకూడదు! నీ వీర సంపాదకుడు.... ప్రమాదకరమైన వ్యక్తి. మనుషుల్ని రచ్చకీడ్చడం అతనికి అలవాటు. తనకి తెలిసిందంతా లక్షలాది పాఠకులకి చెప్పేగానీ అతనికి నిద్ర పట్టదు! అతన్ని నోరు మూసుకొమ్మను. ఎవరు నోరు జారినా మునిగేది నీ కొంపే! టెలిఫోన్ ద్వారా యేదేనా చేయాలని ప్రయత్నించకు. నీ ఫోన్ టాప్ చేయబడింది. నువ్వు యెవరితో గుసగుసలాడినా నేను వినగలను! అంతా బుర్ర కెక్కిందా?" కాళీప్రసాద్ కటువుగా అడిగాడు.

చక్రవర్తి కంఠం యేదో అర్థంకాని శబ్దాలు చేసింది. కాళీప్రసాద్ ఎగతాళిగా నవ్వాడు. "రేపు మధ్యాహ్నం పన్నెండింటికి నువ్వు డబ్బు కట్టాలి. ఈలోగా మళ్ళీ నీతో మాట్లాడుతాను. మళ్ళీ వో సారి గుర్తు చేస్తున్నా!

నా అరచేతిలో నీ నరకం వుంది! జాగ్రత్త!!" శౌరీ ప్రసాద్ డిస్కనెక్టు చేశాడు.

చక్రవర్తి ఫోన్ని పెట్టేసి పరాంకుశంవేపు చూశాడు. పరాంకుశం మొహం ఆదోళకంగా వుంది. అతను కుర్చీలో కూచున్నాడు.

"పరాంకుశం కూచోకు. వెళ్ళు. మళ్ళీ కబురు చేసే దాకా మన కార్యాలయాన్ని లాకవ్ చేస్తున్నామని తెల్లారేలోగా అందరికీ తెలిపే యేర్పాటు చేయ్. మరో సంగతి: ఈ రాత్రి షిఫ్ట వర్కర్సంతా అక్కడే ఇరుక్కుపోయారు. వాళ్ళంతా రెండురోజులు ఓవర్ టైమ్ చేస్తున్నారని వాళ్ళ కుటుంబాలకి వర్తమానం పంపించు. మళ్ళీ పిలిచేదాకా పన్లోకి రాకపోయినా జీతాలు ఇవ్వ బడతాయని అందరికీ చెప్పు...."

"సార్ ....దినపత్రికలు తప్పా కతిమ్మాని రెండ్రో జులు ఆలస్యంగా వెళ్ళినా ఫర్వాలేదు. కానీ, ఆ మాత్రం ఆలస్యాన్ని కూడా మన సంస్థ అనుమతించరాదు. తెలుగు, ఇంగ్లీషు డెయిలీస్ వెళ్ళకపోతే ఏజెంట్లూ, పాఠకులూ నగ్గోలెత్తిపోతారు...." పరాంకుశం చెప్పుకుపోతున్నాడు.

"మనిషి మునిగిపోతున్నప్పుడు గుడ్డలు తడిసిపోతున్నా యని యేడ్చినట్టుంది, నీ వాదన! మనం యేమీ చేయలేం. ఈ క్షణంలో డబ్బు యిచ్చేసినా కూడా, అతను గ్రీన్ సిగ్నల్ యిచ్చేదాకా లోపల ప్రవేశించలేం. పత్రికల్ని రిలీజ్ చేయలేం. రేపటి పేపరే కాదు మరో రెండ్రోజు ల్దాకా ఏ పేపర్ని బైటకు పంపలేము...."

పరాంకుశం అడ్డొస్తూ అన్నాడు. "సార్, ఒకరోజు పేపర్ మార్కెట్లోకి వెళ్ళకపోతే వారంరోజుల సర్క్యు

లేషన్ దెబ్బతింటుంది! నా మాట విని పోలీసుల్ని ఎలాగైనా తప్పించుకుందాం. డబ్బు పోయే ప్రమాదమూ లేదు; పేపర్లు ఆగే అవసరమూ రాదు!"

చక్రవర్తి అసహనంగా చూశాడు. "నువ్వు నేరస్థుడిని తక్కువగా అంచనా వేస్తున్నావ్! ఈ క్షణంలో కూడా మన మాటల్ని అతను వింటున్నాడన్నా నేను ఆశ్చర్యపోను. తన ఆట కట్టయినప్పుడు తెలుసుకోడం మనిషికి ఆరోగ్యకరం.... వెళ్ళు. చెప్పిందంతా చేసి, తిరిగిరా" అన్నాడు చక్రవర్తి.

పరాంకుశం మెల్లగా లేచి, అయిష్టంగానే బైటికి నడిచాడు.

"ఏమండీ!...." లలిత యేదో అడగబోయింది.

"లలితా, అంతా విన్నావు. ప్రశ్నలు అడక్కు. నిద్ర మాత్ర వేసుకుని పడుకో," చక్రవర్తి విసుక్కున్నాడు.

## 5

కాశీప్రసాద్ ఫోన్ పెట్టేసి జంబులింగం వైపు నవ్వుతూ చూశాడు. "వీపుమీద వాత పడితేగానీ మనిషికి వేడి తెలీదు! కారుతో బాటు షెడ్డూ బూడిదయ్యాక, నీ యజమానికి బుద్ధొచ్చింది!" అన్నాడు.

జంబులింగం గాబరాగా చూశాడు. కాశీప్రసాద్ హుందా, ధైర్యం, తెగింపు చూస్తుంటే అతనికి మతితో బాటు మాట కూడా పోయింది!

"ఆల్బర్టు, మొదటిసీను జయప్రదంగా ముగిసింది. బందెలదొడ్డి తాళం తెరిచి, కేంటీన్ వాలాను నీతో తీసుకెళ్ళు. నాలుగు ఫ్లాస్కుల్లో స్ట్రాంగ్ కాఫీ పోయించి, మోయించి తీసుకురా. గంగారామ్‌కీ, రాంబాబుకీ చెరో

ఫ్లాస్క్ ఇచ్చేయి" అన్నాడు కాళీప్రసాద్.

అల్బర్టు మౌనంగా వెళ్ళిపోయాడు.

కాళీప్రసాద్ కు యేదో ఆలోచన తట్టి గదిలోంచి హాల్లోకి వచ్చాడు. బిల్డింగ్ ముందువైపున్న గదుల వేపు నడిచాడు. అన్ని గదుల్నీ పరీక్షించుకుంటూ తిరిగొచ్చాడు.

సర్క్యులేషన్ మేనేజర్ గదిలో అల్బర్టు కాఫీ ఫ్లాస్కుల్నీ కప్పుల్నీ పెడుతున్నాడు.

కాళీప్రసాద్ కుర్చీలో కూచుని అతనిచ్చిన కాఫీ కప్పుని అందుకుని చప్పరించాడు. లేచి, పచార్లు ప్రారంభించాడు. తటాలున ఆగాడు.

"అల్బర్ట్! గదికి తాళం వేసి, నాతో రా!" అంటూ బైటికి నడిచాడు.

అల్బర్టు అతన్ని అనుసరించి, తలుపు తాళం వేశాడు.

కాఫీని పూర్తిగా తాగేసి కాళీప్రసాద్ ఖాళీకప్పుని దూరంగా విసిరాడు. కప్పు చప్పుడు చేస్తూ బద్దలైంది.

రెండో హాలు దాటి, 'చీఫ్ ఎడిటర్' బోర్డున్న గది ముందు ఆగాడు కాళీప్రసాద్. తలుపు తాళం వేసుంది. ఆత్రంగా అల్బర్టువైపు చూస్తూ, పక్కకు తప్పుకున్నాడు.

జేబులోంచి తాళంచెవుల గుత్తిని తీస్తూ, అల్బర్టు తలుపు ముందు ఆగాడు. అయిదు నిమిషాల తరువాత తాళం క్లిక్కుమంది. హాండిల్ ని తిప్పి, తలుపుని లోపలికి తోసి, తలుపు పక్కనే వున్న స్విచ్ ని నొక్కాడు అల్బర్టు.

కాళీప్రసాద్ గదిలోపలికి అడుగుపెట్టాడు.

విశాలమైన ఎయిర్ కండిషన్డ్ గది. తివాసీ నేలను పూర్తిగా కప్పింది. గదిలో ఒక పక్కగా వెడల్పాటి టేబుల్, దాని వెనుక కుషన్డ్ రొటేటింగ్ కుర్చీ వున్నాయి. గోడవారగా ఎన్నో పుస్తకాలతో, మాగజైన్ బౌండ్స్‌తో నిండిన బీరువా లున్నాయి. టేబుల్ మీద ఎన్నో ఫైళ్ళూ, ఫోల్డర్లూ, నీట్‌గా పెట్టబడి వున్నాయి. నాలుగు టెలిఫోన్లు, ఒక యింటర్‌కమ్ వున్నాయి. ఎడిటర్ కుర్చీ వెనక గోడకి ఒక స్టీల్ సేఫ్ అమర్చబడింది.

ఆలోచిస్తూ నడిచి, రొటేటింగ్ కుర్చీలో కూచుని, టేబుల్ మీదున్న ఫైళ్ళని తిరగేసి చూడ్డం ప్రారంభించాడు కాళీప్రసాద్. ఆల్బర్టు ఫాన్ స్విచ్‌లను నొక్కాడు. ఫైళ్ళలో వున్న, పత్రికల్లో ప్రచురింపబడబోయే వార్తల్నీ, విశేషాల్నీ సంపాదకీయాన్ని తిరగేసి, ఫైళ్ళని నేలమీదకి గిరాటేశాడు కాళీప్రసాద్. రొటేటింగ్ కుర్చీని వెనక్కి తిప్పి. వాల్ సేఫ్‌ని పరీక్షగా చూశాడతను. ఆ వాల్ సేఫ్‌లో యేముంది?

"ఆల్బర్ట్!"

ఆల్బర్టు దగ్గరగా నడిచి నిలబడ్డాడు. కాళీప్రసాద్ అతన్ని వాల్ సేఫ్ తెరవమన్నాడు.

ఆల్బర్టు వాల్ సేఫ్ ముందు కూచుని, జేబులోంచి ప్లాస్టిక్ కేసు తీసి, అందులోని పనిముట్లని నేలమీద వరుసగా పెట్టి, పనిలో నిమగ్నుడయ్యాడు.

కాళీప్రసాద్ వెనక్కి తిరిగి, టేబుల్ మీద కాళ్ళని పెట్టి వెనక్కి వాలాడు. అడ్డొచ్చిన వస్తువుల్ని కాళ్ళతో అటూ యిటూ తోశాడు. మరికొన్ని ఫైళ్ళు తీసి తిరగేసి, గిరాటేస్తూ కూచున్నాడు. వెనకనుంచి చిన్న చిన్న

చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. ఆయిదునిమిషాల తర్వాత ఆల్బర్టు కంఠం అతనికి వినిపించింది:

"బాస్, తాళం లొంగడంలేదు. రివాల్వర్ ఒక్కటే దీనికి సరైన తాళంచెవి."

కాళీప్రసాద్ వెనక్కి తిరగలేదు. "ఇంత సేపూ ఎందుకు టైమ్ వేస్టు చేశావ్ ఆల్బర్ట్?" అన్నాడు.

కాస్సేపట్లో రివాల్వర్ పెద్దగా ధ్వనించింది. అదో రకం వాసన గాల్లో వ్యాపించింది. రెండు క్షణాల తర్వాత "బాస్, రెడీ!" అన్నాడు ఆల్బర్టు.

కాళీప్రసాద్ లేచివెళ్ళి సేఫ్ ముందు ఆగాడు. పది నిమిషాల్లో ఫైళ్ళూ, కవర్లూ, ఇతర కాగితాలూ టేబుల్ మీదకి చేర్చబడ్డాయి. కాళీప్రసాద్ కుర్చీలో తీరుబడిగా కూచున్నాడు. టైం చూశాడు. డ్రైవ్ నుంచి రిపోర్టు వచ్చే సమయం. కాస్సేపట్లో అంతా నార్మల్ గా వుందని తెలియజేశాడు డ్రైవ్. కాళీప్రసాద్ ఆల్బర్టువైపు చూశాడు.

"ఆల్బర్ట్. కోటంతా ఒకసారి తిరిగిరా. ఎక్కడివాళ్ళక్కడే వున్నారేమో చూడు. మనవాళ్ళని పలకరించి, అలర్ట్ గా వుండమని హెచ్చరించు. పదినిమిషాల్లో నన్నిక్కడ కలుసుకో" అన్నాడు. ఆల్బర్టు వెళ్ళిపోయాడు; తలుపు మూస్తూ.

కాళీప్రసాద్ సేఫ్లోంచి తీసిన ఒక్కో ఫైల్నీ పరిశీలిస్తూ తివాచీమీదకి గిరాటేస్తున్నాడు.

అతని చెయ్యి సీల్ వేయబడిన ఒక పెద్ద కవర్ని అందుకుంది.

కవర్ని సర్రున చించి, లోపలున్న కాగితాల్ని బయటకు లాగాడు. కాగితాలతో బాటు ఒక చిన్న కవరు

కిందపడింది. ఆ కవర్ని చించి లోపల్నుంచీ కొన్ని ఫోటోల్నీ, నెగటివ్స్నీ ఇవతలికి లాగా డతను.

ఫోటోల్ని చూస్తున్న అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దగా అయ్యాయి. తనకి తెలీకుండా నే సన్నగా విజిల్ వేశాడు కాళీప్రసాద్. నాలుగు నిమిషాలపాటు అర డజను ఫోటోల్నీ, వాటి నెగటివ్స్నీ తదేకంగా చూస్తూ కూర్చుండిపోయాడు. రెండు పెట్టున్న ఫోటోల్లో రోజా పేపర్లో కనిపించే మొహం వుంది.

ఆలోచిస్తూ ఫోటోల్నీ, నెగటివ్స్నీ కవర్లో పెట్టి నీట్ గా టైప్ చేసిన డాక్యుమెంట్స్ అందుకుని చదవడం ప్రారంభించాడు. ఏకాగ్రతతో అలా చదువుతూ వుండిపోయాడు. అతని పెదవులు నవ్వుతో మాస్క్ లోపలే విచ్చుకుంటున్నాయి. చేతిలోని రిపోర్టుని రెండోసారి చదివి, ఉషారుగా మాస్క్ ని పైకి లాగి, కరోనా సిగార్ ని వెలిగించి, కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ పొగ పీల్చసాగేడు.

రెండునిమిషాల తర్వాత కళ్ళు తెరిచి, ఫోటోల కవర్నీ, కాగితాల్ని పెద్ద కవర్లో పెట్టి, తన స్వెటర్ లోపల దోపుకున్నాడు. ఏదో విజయగర్వంతో అతని కళ్ళు మెరుస్తున్నాయి. మెల్లగా తన మాస్క్ ని తీసి, పాంటు జేబులో దాచుకున్నాడు. గదిలోకి వచ్చిన ఆల్బర్టు అతన్ని ఆశ్చర్యంగా చూశాడు. కాళీప్రసాద్ చిరునవ్వు నవ్వాడు.

"ఇంక మనం మాస్కులు ధరించే అవసరంలేదు, ఆల్బర్టు. మాస్క్ తీసేయ్!" అన్నాడు నవ్వుతూ.

ఆల్బర్టు మాస్క్ తీసేసి, "ఎందుకు బాస్?" అన్నాడు.

"ఆల్బర్ట్, 'అల్లాఉద్దీన్ అద్భుత దీపం' వున్న గదిలోకి వచ్చి చేరాం! మనం ఊహించని ఒక వస్తువు యిక్కడ నాకు చిక్కింది. అది మనందరికీ మాస్క్‌లా, ఉక్కు కవచంలా పని చేస్తుంది. చట్టంనుంచీ, పోలీసుల నుంచీ మనల్ని అది శాశ్వతంగా కాపాడుతుంది!" అన్నాడు కాళీప్రసాద్ హుషారుగా.

# 6

"మీరు చెప్పిందంతా చేశాను. కానీ....మరో మార్గం ఆలోచించడం మంచిదని నా నమ్మకం. బ్లాక్ మెయిలర్ బెదిరింపులకి మనం లొంగకూడదు సార్!" పరాంకుశం పట్టుదలగా అన్నాడు.

"అవి బెదిరింపులు కావు. రెప్పపాటులో కారూ, షెడ్డూ రెండింటినీ నాశనం చేశాడు. వాడంటే యెంత భయపడుతున్నానో అంతకన్నా కోటిరెట్లు అధికంగా ద్వేషిస్తున్నాను. గోళ్ళతో వాడి గుండెల్ని పెకలించి వేయాలనుంది నాకు! ఇంతవరకూ ఈ చేతుల్నుంచి యెవ్వడూ తప్పించుకోలేదు. నేను ఎన్నో నిచ్చెనలు ఎక్కాను. ఎన్నిసార్లో పాములవాత పడ్డాను. చివరికి ఏ పాములకీ అందని చోటికి, అంతస్థుకి చేరుకున్నాను. నే నిచ్చే డబ్బుని వాడు తగలేయొచ్చు. కానీ ఎప్పుడో ఒకప్పుడు వాణ్ని ఈ చేతులు పట్టేస్తాయి!" చక్రవర్తి ఆవేశంగా అన్నాడు.

పరాంకుశం నవ్వాడు. "మీ చేతుల్లోవున్న ఆయుధం జాలాయి వెధవల్ని భయపెట్టేది కాదు! మీ పత్రికలు రాజకీయనాయకుల్నీ, మంత్రుల్నీ, ధనవంతుల్నీ భయపెట్టవచ్చు. కానీ బ్లాక్ మెయిలర్ని ఆ విధంగా లొంగదీయలేరు! అన్నట్టు మరో విషయం మనం మరిచిపోతు

న్నాము. అవతెల్లుండి అసెంబ్లీ సమావేశాలు ప్రారంభమవుతున్నాయి. ఎల్లుండిలోగా మనం 'ఆ వార్తని' హెడ్‌లైన్స్‌లో వేయాలి. ఈ అవకాశం కోసం మనం యెంతో యెదురుచూశాం. ఎంతో ఖర్చుచేశాం....ఎట్టి పరిస్థితుల్లో కూడా ఎల్లుండి పత్రికలు ఆగడానికి వీల్లేదని మీకు తెలుసు!"

"తెలుసు....అందుకోసం యేదో తొందరపాటు పని చేస్తే, ఎల్లుండే కాదు, ఎప్పటికీ పత్రికల్ని ప్రచురించే అవకాశమే మనకి వుండకపోవచ్చు! మరొకణ్ని ఊబిలోకి తోసేకుందు, నువ్వు క్షేమంగా, భద్రంగా గట్టు మీద నుంచోవాలి!" అన్నాడు చక్రవర్తి.

"ఆ ఆర్టికల్‌ని సకాలంలో వేయకపోతే మనం ఒక లైఫ్ టైమ్ ఛాన్స్‌ని పోగొట్టుకుంటాం!" పరాంకుశం పట్టువదలకుండా అన్నాడు.

చక్రవర్తి చిరాగ్గా చూశాడు. "నా లైఫ్‌కి సంబంధించిన ప్రశ్న ఉదయించినప్పుడు యిలాంటి లక్ష లైఫ్ టైమ్ ఛాన్సెస్‌ని పోగొట్టుకుంటాను! ఐ డోంట్ కేర్! పరాంకుశం మళ్ళీ చెప్తున్నా. ఈ విపత్తునుండి తప్పించుకొనడానికి ఒకే మార్గం వుంది. కళ్ళెం చేతిలో వున్నంత కాలం రౌతు ఆడించినట్టు గుర్రం ఆడాలి. ముప్పు తప్పాలంటే ముడుపు చెల్లించాలి! ఈసారి వాడికి లొంగిపోడానికి నిశ్చయించుకున్నాను...." చక్రవర్తి నిట్టూర్చాడు. "పరాంకుశం, ఆ సేఫ్‌ని తెరు. బ్యాంక్ అకౌంట్ బుక్సున్నాయి పట్రా. ఏ బ్యాంకులో ఎంతుందో, ఏ బ్యాంకు నుంచీ ఎంత విత్‌డ్రా చేయాలో స్టేట్‌మెంట్ తయారుచేద్దాం. చెక్కుబుక్సు పట్రా" అన్నాడు తాళంచెవులు విసురుతూ.

# 7

కాళీప్రసాద్ పచార్లు మాని, ఎడిటర్ టేబుల్ మీద కూచుని కాళ్ళు ఆడిస్తూ ఆలోచనలో మునిగిపోయాడు. చుట్టని ఆఖరుసారిగా పీల్చి, తివాచీ మీదకు గిరాటే శాడు.

ఆల్బర్టు బూటుకాలితో దాన్ని ఆర్పేసి, జాగర్తగా జేబులో పడేసుకున్నాడు.

కాళీప్రసాద్ నుదురుమీద గీతలు ఏర్పడ్డాయి. మరో కరోనా వెలిగించి పచార్లు ప్రారంభించాడు, ఆల్బర్టు యిచ్చిన కాఫీకప్పుని అందుకున్నాడు. ఉన్నట్టుండి అతని కళ్ళు మెరిశాయి. కాఫీ కప్పుని అలాగే టేబుల్ మీద వుంచేశాడు. ఆల్బర్టువైపు తదేకంగా చూశాడు.

"ఆల్బర్ట్. పని పూర్తయ్యాక ఇరవై నాలుగ్గంటలు బాంబులు మనకు రక్షణ యిస్తాయి. ఆ తరవాత?"

"ఆ టైమ్ లోగా మనం పులితోళ్ళు తీసేసి మూకల్లో కలిసిపోవాలని మీరన్నారు!" ఆల్బర్టు చిరునవ్వుతో జవాబిచ్చాడు.

"అఫ్‌కోర్స్....సహజంగా దెబ్బతిన్న వ్యక్తి పగ బడతాడు. పోలీసుల్ని కలుసుకుంటాడు. వాళ్ళు రంగం లోకి దిగి మనం దొరికేదాకా తవ్వుతూ కూచుంటారు! అది మనకి ప్రమాదం..."

ఆల్బర్టు భయంగా చూశాడు. "బాస్...."

"గాబరాపడొద్దు. మనకోసం వల విసరకుండా పోలీసుల చేతులకి బేడీలు వేసే శక్తివంతమైన ఆయుధం ఈ గదిలో మనకి చిక్కింది!"

"బాస్!"

"యస్, ఆల్బర్ట్. వాకీటాకీ పట్టుకో. రిపోర్టుని రిసీవ్

చేసుకో. అర్జెంటుగా ఒక వ్యక్తికి నేను ఫోన్ చేయాలి. అతనే మన అంగరక్షకుడు!" అంటూ కాళీప్రసాద్ రొటేటింగ్ కుర్చీవైపు నడిచాడు.

కుర్చీలో కూచుని డైరెక్టరీ తిరగేసి ఒక నెంబరు చూశాడు. ఫోన్ని దగ్గరగా లాగి ఆ నెంబర్ని డయల్ చేశాడు. తను ఫోన్ చేస్తున్న వ్యక్తి వృత్తికి సంబంధించినవాళ్ళు రాత్రిళ్ళు నిద్రపోరు! కాసేపట్లో అటువైపున ఫోన్ ఎత్తబడింది. "యస్!" అందో కంఠం బొంగురుగా.

"దయానిధి వున్నాడా?" కాళీప్రసాద్ నిర్లక్ష్యంగా ఏకవచనంలో అడిగాడు.

అటువేపు కంఠం తటపటాయించింది. "తమరు.... ఎవరు?"

"చెప్పినా నీకు తెలీదు. దయానిధిని మాట్లాడమను!" కాళీప్రసాద్ గద్దించాడు.

"ముక్కూ మొహం తెలీనివాళ్ళతో ఆయన మాట్లాడరు!" అవతలి కంఠం కోపంగా అంది.

"నీ కంతగా కావాలంటే, అల్లుడుగారు మాట్లాడుతున్నారని చెప్పు!" అన్నాడు కాళీప్రసాద్ నవ్వుని ఆపుకుంటూ.

"మిస్టర్....జోకర్లతో ఆయన మాట్లాడరు....ఆయన సీక్రెట్ కాన్ఫరెన్సులో బిజీగా వున్నారు...."

"సీక్రెట్ కాన్ఫరెన్స్లో కాదు, శోభనం గదిలో వున్నా అతనితో తక్షణం మాట్లాడాలి! కాల్ హిమ్!" కాళీప్రసాద్ కంఠంలో అధికారం, ఆగ్రహం ధ్వనించాయి. అటువైపున బరువుగా వూపిరి పీలుస్తూన్న శబ్దం వినిపిస్తోంది.

"హోమ్ మినిష్టర్ హియర్" అందో కంఠం కొద్ది క్షణాల తరవాత.

"మిష్టర్ మినిష్టర్, మీ చుట్టూ యెవరేనా వున్నారా?"

"హూ ఆర్ యూ?" అన్నాడు హోమ్ మినిష్టర్ దయానిధి.

"ప్రశ్నలు వద్దు; జవాబు చెప్పండి."

"వాట్ నాన్ సెన్స్..."

"ఓ.కే మినిష్టర్...మీకు సంబంధించిన ఒక భయంకరమైన రహస్యం మీ శత్రువుల చేతుల్లోంచి—మీ అదృష్టంకొద్దీ—నా చేతుల్లోకి వచ్చింది. ఇతరుల సమక్షంలో దాన్ని గురించి చర్చించడానికి మీరు రెడీగా ఉంటే, నడిబజార్లో నగ్నంగా తిరగడానికి రెడీగా ఉన్నారన్నమాటే! నాకేం అభ్యంతరంలేదు..." కాళీప్రసాద్ అరక్షణంతంగా ఆగాడు.

"..ఒక్క క్షణం...ఇప్పుడు మాట్లాడొచ్చు.." అంది హోం మినిష్టర్ కంఠం, రెండు క్షణాల తర్వాత.

"మీ పరువుని బజారుపాలుచేసే విషయాలు ఫోటోలలో, డాక్యుమెంట్లలో నా దగ్గరున్నాయి...."

"ఎవరున్నవ్వు? ఎక్కణ్నుంచి మాట్లాడుతున్నావ్? పిచ్చాసుపత్రినుంచా? నీతో మాట్లాడం ఒక ...."

"డిస్కనెక్ట్ చేయకండి. నేను ఫోన్ పెట్టేశాక మీ కాంపౌండులో మూలగా వున్న మామిడి చెట్టుకింద చూడండి. నేను చెప్పేదంతా నిజమని నిరూపించే సాక్ష్యం దొరుకుతుంది .... నేనిప్పుడు పిచ్చాసుపత్రిలో కాదు; పారకుల్నీ, ప్రజల్నీ బ్రెయిన్ వాష్ చేసే చక్రవర్తి పబ్లికేషన్ ఎస్టేట్స్‌లో వున్నాను. నిజం చెప్పా

లంటే 'ప్రతిధ్వని' 'ఎకో' లాంటి బోల్డన్ని పత్రికల్ని ప్రచురించే సంస్థ సంపూర్ణంగా, మందీమార్బలంతో సహా నా చేతుల్లో వుంది! అధునాతన ఎలక్ట్రానిక్ ఆయుధాలతో, అద్భుతమైన ప్లానుతో ఈ సంస్థనీ, చక్రవర్తినీ నా గుప్పిట్లో బిగించాను, రాష్ట్రాన్నంతా మీ మంత్రులు గుప్పిట్లో బిగించినట్టు....!"

"మిస్టర్, నువ్వు చెప్పేదేమిటో...." దయానిధి అనుమానంగా అన్నాడు.

"పేపర్ల పేరుతో, పత్రికల పేరుతో, చక్రవర్తి కోట్లు గడిస్తున్నాడు. నా బుర్రతో అతన్ని లొంగదీశాను. అతని బిల్డింగ్‌నీ, మెషినరినీ, స్టాఫునీ, మార్కెట్‌లోకి వెళ్ళబోతున్న పత్రికల్నీ బాంబ్స్‌లో బూడిద చేస్తానని నికరంగా వాగ్దానం చేసి, అలా చేయకుండా వుండటానికి అతన్నుంచి ఇరవై లక్షలు ఫీజు కింద వసూలు చేస్తున్నాను...."

"సో....నువ్వొక బ్లాక్ మెయిలర్‌వన్నమాట! చక్రవర్తి నీ బుకాయింపులకి లొంగడు; నువ్వు అడిగింది ఇవ్వడు!" దయానిధి అడ్డొస్తూ అన్నాడు.

కాళీప్రసాద్ నవ్వాడు. "చక్రవర్తే కాదు; సార్వభౌముడిలాంటి మీరుకూడా నేను అడిగింది ఇస్తారు! చీఫ్ ఎడిటర్ సేఫ్‌లో, 'టాప్ సీక్రెట్' ఫైల్లో మీ గురించిన మీ ప్రణయానికి సంబంధించిన—ఫోటోలూ, రిపోర్టులూ వున్నాయి. ఎడిటర్‌గారికి మీమీద ప్రత్యేకమైన అభిమానం వుంది! మీ వ్యక్తిగత జీవితానికీ, మరో ఆడదాని వ్యక్తిగత జీవితానికీ మచ్చరావడం మీకు నచ్చదనే విశ్వాసంతో, మీతో సంప్రదింపులు చేయాలని నిశ్చయించుకున్నా...."

"నేను.... నేను నమ్మలేకుండా వున్నాను...." దయానిధి తడబడుతూ అన్నాడు.

"ఆమె పేరు హేమలత. ఆమె కోల మొహానికి బాబ్డ్ హెయిర్ అందమైన ఫ్రేములా వుంది. ఆమె కళ్ళు లోతుగా ఏదోలా మీ కళ్ళలోకి చూస్తున్నాయి. గడ్డంమీద బఠాణీగింజంత పుట్టుమచ్చ వుంది. ఆ పుట్టుమచ్చని మీ చూపుడు వేలు యెంతో ప్రేమతో తడువుతోంది. మీరిద్దరూ ఒక్కరుగా కూచున్న సోఫా వెనక గోడ గడియారం ఒంటిగంట చూపుతోంది. రోజూ ఒక కాయితాన్ని చించిపారేసే కాలెండర్, పోయిన్నెల నాలుగో తారీఖుని చూపుతూ గోడకి వేలాడుతోంది. పోయిన్నెల నాలుగో తారీఖు ఆమె పుట్టినరోజని డాకుమెంటు చెప్తోంది....'ఆమె పక్కనేవున్న చిన్న పార్సిల్లో బర్త్ డే డ్రెస్ వుందా?' అని డాక్యుమెంట్ చిలిపిగా ప్రశ్నిస్తోంది .... రెండో ఫోటో, మూడో ఫోటో తెలుగు సినిమా ప్రణయ సన్నివేశాన్ని వెక్కిరిస్తున్నాయి నాలుగూ, అయిదూ, ఆరూ ఫోటోలు...."

"ఆల్ రైట్ ....ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి?" దయానిధి కంఠం కోపంతో ఆశ్చర్యంతో వణుకుతోంది.

కాళీప్రసాద్ చిన్నగా నవ్వాడు. "ఖరీదైన అల్లుడికి ఇచ్చేలా చక్రవర్తి నాకు లౌక్యం చదివింపులు చేస్తున్నాడు. ప్రస్తుతం కత్తికింది మేకలా అతను నేను చెప్పింది వింటాడు. ఆ తరవాత ప్రతీకారంతో నామీదికి పోలీసుల్ని ఉసిగొలుపుతాడు. అది జరక్కుండా మీరు చూడాలి...." కాళీప్రసాద్ ఆగాడు. చిరునవ్వుతో ఆల్బర్టుని చూశాడు. ఆల్బర్టు ఆశ్చర్యంతో వింటున్నాడు.

దయానిధి మాట్లాడలేదు.

"మినిష్టర్ గారూ, మీ రహస్యాలు బైటికి పొక్కకుండా నేను చూస్తాను. నా పైకి వేటకుక్కలురాకుండా మీరు చూడాలి. అంతే! ఇది బ్లాక్ మెయిల్ కాదు; పరస్పర సహకారం! మీకు ఇష్టంలేకపోతే మానేయొచ్చు. నా చేతిలో వున్న మీ భాగోతాన్ని దేశంలోని పత్రికలన్నీ క్యూలో నిలబడి కొంటాయి.

ఆ మధ్య బ్రిటన్నీ, రష్యానీ గగ్గోలెత్తించిన క్రిస్టన్ కీలర్, ప్రొఫ్యూమో కేసు గురించి మీరు వినేవుంటారు. మీలాగే జాన్ ప్రొఫ్యూమో పెద్ద పదవిలో వున్న వ్యక్తి! రాబోయే అసెంబ్లీ సమావేశాలకి ముందు పత్రికల్లో మీ హరికథ ప్రచురించబడేలా చూస్తాను. అసెంబ్లీ పెద్ద చాకిరేవు అవుతుంది. ప్రతి పక్షాలు మిమ్మల్ని మురికి గుడ్డలు ఉతికినట్టు ఉతుకుతారు! మీ సహచరులు ఇస్త్రీ చేసేస్తారు! ఎలా వుంటుంది?" కాళీప్రసాద్ ప్రశ్నిస్తూ ఆగాడు. దయానిధి బరువుగా ఊపిరిపీల్చుకోడం అతనికి వినిపిస్తోంది. కాళీప్రసాద్ పుండుమీద ఇంకొంచెం కారం చల్లడం ప్రారంభించాడు.

"మీరు బుకాయించలేరు. భయంతో, గాబరాతో మీ గుండె చేస్తున్న చప్పుళ్ళని టెలిఫోన్ తీగ నా చెవుల్లోకి ప్రసారం చేస్తోంది! నా ప్రోత్సాహం డోసు చాల్లేదనుకుంటే చెప్పండి. మీ ఇద్దరిమీదా జరగబోయే దుష్ప్రచారాన్ని ఆపడానికి మీరు ఏమాత్రం ప్రయత్నించడంలేదని వివరించి, నా ప్రపోజల్ ని మీ బంగారు తీగకి—అదే మీ కోమలతకి—మీరామెని ముద్దుగా అలా పిల్చుకుంటారని ఇందులో రాసి వుందిలెండి—వినిపిస్తాను! ఒక నిమిషంలో ఔనో, కాదో మీరు చెప్పాలి...."

"ఆల్ రైట్.... నేను చేయగలిగింది చేశాక నువ్వు నన్ను మోసం చేయవని ఏమిటి గ్యారెంటీ?" దయానిధి పళ్ళు కొరుక్కుంటూ అడిగాడు.

"వెరీగుడ్. ఇప్పుడు నిజంగా సంప్రదింపులు ప్రారంభమయ్యాయి! నిజం చెప్పాలంటే గ్యారంటీ ఏమీ లేదు.. నా మాట తప్ప. ఒక కాండిడేట్ కి, చదువుకున్న భారతీయుడికి ఉద్యోగం ఇప్పిస్తానని మీరు పది వేలో, పాతిక వేలో తీసుకుంటారు. అతనికి గ్యారెంటీ యేముంటుంది?" కాళీప్రసాద్ ప్రశ్నించాడు.

"మిస్టర్, నువ్వు అతిగా వాగుతున్నావు. నేను అలాంటివాణ్ని కాను. హోల్డు యువర్ టంగ్!" దయానిధి కోపంగా అరిచాడు.

"ఐసీ...మంత్రులందరూ అలాంటి చేరగాళ్ళే అని లోకంలో గట్టి నమ్మకం వుందిలెండి. మీరు అలాంటి వ్యక్తి కాదంటున్నారు. ఒప్పుకుందాం! సరే.... నేను మిమ్మల్ని దగా చేయను. చేస్తే నష్టం నాకే కదా! కాని, నేను మునిగితే, నాతో బాటు హోమ్ మినిస్టర్ దయానిధి, మెడకి కట్టుకున్న రాయిలా — నాతో బాటు మునిగి పోతాడు! గుర్తుంచుకోండి. నా చేతిలో మరొక ట్రంప్ కార్డుకూడా వుంది. మీమీద ఆ ఆర్టికల్ ప్రచురించబడకుండా వుండేందుకు మీరే నాచేత ఇదంతా చేయించారనీ, చక్రవర్తినుండి ఇరవై లక్షలు గుంజి, వాత పెట్టుకున్నారనీ, ఆ మొత్తంలో సగం మీకే అందిందనీ..."

"స్టాపిట్!" దయానిధి అరిచాడు. మెల్లగా కంఠాన్ని అదుపులోకి తెచ్చుకుని, "చేయగలిగింది చేస్తాను...." అన్నాడు, బలహీనంగా.

కాళీప్రసాద్ ఉల్లాసంగా నవ్వాడు. "మీరు చేయగలరు. గుడ్ లక్ టూ యూ మిష్టర్ మినిష్టర్! ప్రజలకు సేవచేసే మీకు సేవచేయడం రెండు టర్మ్‌లు ప్రజాసేవ చేసినంత తృప్తినిస్తోంది! అన్నట్టు నా మాటలన్నీ యథార్థాలని చాటిచెప్పే ఏవిడెన్సుకోసం మామిడి చెట్టుకింద చూడండి. గుడ్ లక్!" అంటూ నవ్వుతూ అతను టీసీవర్ని పెట్టేసి, ఆల్బర్టుని చిరునవ్వుతో చూశాడు.

• • •

ఫోటోల్నీ, రిపోర్టునీ కవర్లో పెట్టి దయానిధి తన జుబ్బా జేబులో దోపుకున్నాడు. అతనిలో ఆశ్చర్యం, ఆగ్రహం తలెత్తుతున్నాయి.

పత్రికవాళ్ళు ఫోటోలు ఎలా తీశారు? పరాంకుశం! తమ పార్టీకి వ్యతిరేకంగా పనిచేస్తున్న ఆంగ్లవారపత్రిక సంపాదకుడైన పరాంకుశాన్ని, తమ పార్టీ అధికారంలోకి వచ్చాక ఎడిటర్ పదవినుంచీ హఠాత్తుగా తొలగించడం జరిగింది. ఆ పత్రిక యజమాని తన క్లాస్‌మేట్ అయినందువల్ల, పరాంకుశం తోకని కత్తిరించడంలో తను ప్రముఖపాత్ర వహించాల్సి వచ్చింది.

రెండేళ్ళు అజ్ఞాతవాసం చేశాక 'ప్రతిధ్వని'లో కుదురుకున్న పరాంకుశం, ఇన్నాళ్ళ తరవాత పగసాధిస్తూ, అంకుశంతో పొడుస్తున్నాడు!

తన పార్టీకీ, ప్రజలకూ తనెప్పుడూ ద్రోహం చేయలేదు. అయినా విచిత్రమైన పరిస్థితిలో ఇరుక్కున్నాడు.

తన వ్యక్తిత్వంమీద తానుపూసే ప్రయత్నం పెద్ద ఎత్తున జరుగుతోంది. దాన్ని ఆపాలంటే తను ఒక నేరగాడికి సహాయం చేయాలి!

దయానిధి బుర్ర వేడెక్కుతోంది. ఆ ఛండాలుడు

తనే పగ సాధించడానికి చక్రవర్తి సంస్థమీద అంతా చేయించాలని నిస్సంకోచంగా చెప్పగలడు. సాక్ష్యం కత్తిరించి పట్టినట్లు అవుతుంది! అయిదు నిమిషాల తర్వాత అతనో నిర్ణయానికి వచ్చాడు. టెలిఫోన్ రిసీవర్ని ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"ఐ.జి. ఆఫ్ పోలీస్ హియర్!" అందో కంఠం.

"మిష్టర్ రామలింగం, హోంమినిష్టర్. పదినిమిషాల్లో, హోటల్ ప్రెసిడెంట్ లో నా గదిలో నన్ను కలుసుకోండి" అంటూ దయానిధి ఫోన్ పెట్టేశాడు.

# 8

పరాంకుశం తయారుచేసిన స్టేట్మెంట్ ని చక్రవర్తి పరిశీలిస్తున్నాడు. కాష్ బాలెన్స్ దాదాపు ఖాళీ అయిపోతుంది! అయినా తప్పదు. టెలిఫోన్ శబ్దం విని అతను ఉలిక్కిపడ్డాడు. వణికే చేతో రిసీవర్ని తీశాడు.

"చక్రవర్తి హియర్" అన్నాడు.

....

"నమస్తే సార్!" అన్నాడు మళ్లీ, ఆశ్చర్యంతో. అటువైపు కంఠం చెపుతోంది. నమ్మలేనట్లు విన్నాడు. పరాంకుశంవైపు అర్థవంతంగా చూశాడు.

"....రేపు పొద్దుటే మిమ్మల్ని కలుసుకుంటాను.... వొద్దొద్దు. అలాగే..యస్..పంపిస్తాను. నమస్తే!" అంటూ రిసీవర్ని పెట్టేశాడు. పరాంకుశం ప్రశ్నార్థకంగా చూశాడు.

"హోమ్ మినిష్టర్ దయానిధిగారు" అన్నాడు చక్రవర్తి క్లుప్తంగా.

పరాంకుశం అదిరిపడ్డాడు. "ఏమిటి కావాలంటున్నాడాయన?" ప్రశ్నించాడు.

"నువ్వు! ఆయన హోటల్ ప్రెసిడెంట్‌లో వున్నాడు. అర్జెంటుగా నువ్వు వెళ్ళి ఆయన్ని కలుసుకోవాలి" చక్రవర్తి జవాబిచ్చాడు.

పరాంకుశం మొహంలో అనుమానం ప్రత్యక్షమవుతోంది. దయానిధి యెందుకు రమ్మంటున్నాడు? ఆర్టికల్ విషయం అతనికి తెల్సిందా? ఎట్లా తెలిసింది?

"ఏమిటయ్యా మాట్లాడవ్?" చక్రవర్తి హెచ్చరించాడు.

పరాంకుశం చిన్నగా నవ్వాడు. "రెండూ రెండూ కలిపి చూస్తూన్నా. మనం ప్రచురించబోయే ఆర్టికల్‌కీ, ఈ హోల్డవ్‌కీ, యేదైనా సంబంధం వుంటుందాని ఆలోచిస్తున్నా...."

"నేను అలా అనుకోడం లేదు. అయినా వెళ్ళక తప్పదు. వెళ్ళిరా!" అన్నాడు చక్రవర్తి.

"ప్రస్తుతం మనం వెళ్ళడం ప్రమాదకరం....ఇదేదో తేలేక...." పరాంకుశం ప్రారంభించాడు.

"పది నిమిషాల్లో నువ్వు అక్కడికి వెళ్ళకపోతే,ఐ.జీ. ఆఫ్ పోలీస్ కార్లో యిక్కడికి వస్తాడు. మా యింటికి ఫోన్ చేసి, నువ్వు యిక్కడున్నట్టు తెల్సుకున్నారు. ఈ క్షణంలో మనం పోలీసు ఆఫీసర్లని ఇటు వేపు రానియ్యలేం! కొంపలంటుకుంటాయి. తక్షణం బయల్దేరు. ఆర్టికల్ గురించే ఆయన నిన్ను రమ్మంటున్నాడని నా అనుమానం. ఎలాంటి పరిస్థితిలో కూడా ఈ గొడవ గురించి అక్కడ మాట్లాడకు. ఆర్టికల్ విషయంలో చివరి నిర్ణయం పబ్లిషర్‌ది అని చెప్పి తప్పించుకురా. ఊ....వెళ్ళు!" చక్రవర్తి తొందరగా అన్నాడు.

పరాంకుశం అయిష్టంగా లేచాడు....

పది నిమిషాల్లో హోటల్ ప్రెసిడెంట్ చేరు కున్నాడు.

గదిలోకి అడుగుపెట్టిన పరాంకుశం హోం మినిస్టర్‌తో బాటు ఐ.జీ.ని చూసి ఉలిక్కిపడ్డాడు. యాంత్రికంగా యిద్దరికీ నమస్కరిస్తూ, అడుగులు వేసి టేబుల్ ముందు నిలబడ్డాడు.

తన ముందున్న కవర్ని పరాంకుశంవైపు విసిరాడు దయానిధి.

"చూడు" అన్నాడు క్లుప్తంగా. పరాంకుశం చెయ్యి కవర్‌లోని కాగితాల్ని యివతలికి లాగింది.

డాక్యుమెంట్స్ ఫోటో కాపీల్ని, ఫోటోల్ని పట్టుకున్న అతని చేతులు వణికాయి. తన సేఫ్‌లో అతి భద్రంగా దాచిన కాన్ఫిడెన్షియల్ ఇన్‌ఫర్మేషన్ నకళ్ళు! అతను మంత్రముగ్ధుళ్లా దయానిధినీ, ఐ. జీ. నీ చూస్తూ వుండి పోయాడు. అతని పెదవులు ఎండిపోతున్నాయి.

"పరాంకుశం, ఇవి నా కెలా వచ్చాయని ఆశ్చర్య పోతున్నావా? ఈ రాత్రి మీ ఎస్టేట్స్‌లో జరుగబోతోం దంతా నాకు తెలుసు! నువ్వు ఈ చెత్తని పబ్లిష్ చేయ కుండా వుండేందుకు నేనే ఆ దారుణాన్ని జరిపిస్తున్నా నని కూడా నీ ఎడిటర్ మేధస్సు ఆలోచించగలదు! యెప్పుడు కావాలంటే అప్పుడు నువ్వు ఈ బురదని పేపర్‌లో అచ్చేసి, రాష్ట్రంలోని ఓటర్లందరికీ ఉచి తంగా పంచొచ్చు. ఐ డోంట్ కేర్! ఎందుకంటే, ఇదంతా నా పర్సనల్ లైఫ్. నా పబ్లిక్ లైఫ్ నా విధిని చిత్తశుద్ధిలో నిర్వర్తించడానికే అంకితం అయిపోయింది. అక్కడ నీకు యేమీ దొరక్క బెడ్‌రూమ్స్‌లోకి, వంట

గదుల్లోకి జొరబడ్డావు.

నా యింట్లో నేను అంట్లు తోముతాను. నా భార్య చెప్పిందానికి డూడూబసవన్నలా తలూపుతాను. నేను ప్రేమించే, నన్ను ప్రేమించే స్త్రీతో ఏకాంతంలో నా యిష్టమొచ్చినట్టు వుంటాను. ఈ ఫోటోల్ని నువ్వు అచ్చువేస్తే, నా ఒక్కడి ఏకాంత జీవితాన్ని బజార్లో పెట్టడం లేదు. స్త్రీ పురుషుల మధ్య సాగే రహస్య సంబంధాన్ని బజార్లో పెట్టావు. అయినా నేను లెక్క చేయను!

తరవాత.... ముఖ్యమైన విషయం. అసలు విషయం. ఈ క్షణంలో మీ కార్యస్థానం ఒక మాస్టర్ మైండ్ బ్లాక్ మెయిలర్ చేతిలో వుంది. రేపు 12 గంటల లోగా నీ యజమాని ఆ నేరస్థుడికి యిరవై లక్షలు చెల్లిస్తాడు. ఆ నేరస్థుడే యిదంతా నాకు నిర్భయంగా తెలియజేశాడు.

నన్ను అభాసుపాలు చేయడానికి నువ్వు తయారు చేసుకున్న పథకం అతని చేతిలో తురుపులా చెలామణి అవుతోంది. దాన్ని కత్తిలా వాడుకుని, నన్ను తమకు కరచంలా చేసుకోవాలన్న ఆశతో అతను నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు! అతను చెప్పినట్టు నేను నడుచుకోకపోతే వందలాది పత్రికలకి దీన్ని అమ్మి మరికొన్ని లక్షలు గడిస్తాడు. పోలీసుల్లాకా వెళ్ళవద్దని అతను మీకు ఆంక్ష విధించాడు. భవిష్యత్తులో కూడా పోలీసులూ, చట్టం తనని వేటాడకుండా చూసే బాధ్యతని నాకు అప్పగించాడు.

ఒప్పుకున్నట్టు నేను నటించాను. నా రాష్ట్రంలో ఒక పెద్ద పరిశ్రమను ఒక బ్లాక్ మెయిలర్ చేతిలో బలిపశువు

కావడం నేను సహించను. పరిస్థితిని ఐజీగారూ నేనూ క్షుణ్ణంగా చర్చించాం. పోలీసు పద్ధతిలో కాకుండా ఆ నేరస్థుడిని ఆలస్యం చేయకుండా పట్టేయాలి. హఠాత్తుగా దాడి చేయడానికి ఐజీగారు సిద్ధంగా వున్నారు. కానీ పరిస్థితి చెయ్యి జారిపోయి, అంతా మట్టిలో కలుస్తుంది.

అంచేత నీ కింద పనిచేసే ఒక చాకులాంటి రిపోర్టర్ని యిక్కడికి వెంటనే పిలిపించు. ఐజీగారు సర్వవిధాలా సహకరిస్తారు; సలహాలిస్తారు. మళ్ళీ చెప్తున్నా, ఇది తేలేక నువ్వు తీరుబడిగా నా గురించి నీ పేపర్లో అలకొచ్చు!" దయానిధి ఉపన్యాసం ముగించి, ఐ. జీ. వైపు చూశాడు.

నివురుగప్పిన నిప్పులా కూచున్న ఐ.జీ. గంభీరంగా, అవునన్నట్టు తలాడించాడు. షాక్ నుంచి తేరుకోడానికి పరాంకుశానికి రెండు నిమిషాలు పట్టింది.

"డబ్బు చెల్లించడానికే చక్రవర్తిగారు నిర్ణయించుకున్నారు" అన్నాడు మెల్లిగా. "మొరిగే కుక్కకి బిస్కట్ వేయమనండి. తింటున్నప్పుడు దాన్ని బంధిస్తాం!" అన్నాడు ఐ.జీ.

"మా క్రైమ్ రిపోర్టర్ ప్రభంజనం చాకు లాంటి వాడు...." పరాంకుశం సాలోచనగా అన్నాడు.

"అదుగో టెలిఫోన్. మీ 'చాకు'ని వెంటనే పిలిపించండి" అన్నాడు ఐ.జి.

పరాంకుశం టెలిఫోన్ అందుకున్నాడు....

• • •

"గో ఆన్!" అన్నాడు కాళీప్రసాద్ వాకీటాకీని పట్టుకుని,

"భైరవ్ రిపోర్టింగ్. హోం మినిస్టర్ నుంచీ చక్రవర్తికి ఫోనొచ్చింది. ఎడిటర్ పరాంకుశాన్ని తన హోటల్ గదిలో కల్సుకొమ్మన్నాడు. పరాంకుశం పరుగెట్టాడు. ఏం చేద్దాం బాస్?"

"నథింగ్! మనం తన్నిన మరో బంతి కదిలింది. మన ప్లాన్‌లో యిదొక లేటెస్టు డెవలప్‌మెంట్. భైరవ్, రక్షణమంత్రి మనకు రక్షణ కల్పిస్తున్నాడు. అతన్ని మనం పూర్తిగా నమ్మొచ్చు."

"క్రిరో అవర్ దగ్గరపడుతోంది. బి అలర్ట్. ఓవర్."

కాళీప్రసాద్ వాకీటాకీని కిందపెట్టి ఆల్బర్టు వైపు చూశాడు. "ఆల్బర్టు, కవర్ని రహస్యంగా డెలివరీ చేశావనుకుంటూ...."

"చీకటికి కూడా తెలీకుండా!" అన్నాడు ఆల్బర్టు సగర్వంగా.

"అన్నట్టు, మన సర్క్యులేషన్ మేనేజర్ యెలా వున్నాడు?"

"ఈ సేపట్లో కళలపిల్లల్ని కనేసేలా వున్నాడు!" అని ఆల్బర్టు నవ్వాడు.

కాళీప్రసాద్ గొల్లున నవ్వాడు.

# 9

క్రైమ్ రిపోర్టర్ ప్రభంజనం ఎడిటర్ చెప్పిందంతా ఆశ్చర్యంతో విన్నాడు. తనకి జరిగిన అనుభవాన్ని, తన నిర్ణయాన్ని హోం మినిస్టర్ చెప్తూంటే రెట్టింపవుతోన్న ఆశ్చర్యంతో మౌనంగా విన్నాడు.

దయానిధి సాభిప్రాయంగా ఐ.జీ. రామలింగం వైపు చూశాడు. ఐ.జి. గొంతు సవరించుకుని ప్రభంజనం వైపు చూశాడు.

"మిస్టర్ ప్రభంజనం, పెద్ద పరిశ్రమ ప్రస్తుతం పణంగా వుంది. పరిస్థితులన్నీ వోడిపొమ్మని ఉద్బోధిస్తు న్నాయి. ఎలక్ట్రానిక్ డివైస్‌తో యాక్టివేట్ అయ్యే అతి ప్రమాదకరమైన బాంబులు మీ కాంపౌండంతటినీ కంట్రోల్ చేస్తున్నాయి. ఈ పరిస్థితి మా పోలీసుశాఖ చేతుల్ని కట్టేస్తోంది. ఈ సీన్‌లో మా వాసన తగిలే చాలు, బ్లాక్ మెయిలర్ రెచ్చిపోయి ప్రళయం సృష్టి స్తాడు. అంచేత పూర్తిగా తెర వెనుక వుండి మేం సహాక రిస్తాం. క్రైమ్ రిపోర్టర్‌గా మీకు మాంచి అనుభవం వుందని మీ ఎడిటర్ చెప్తున్నారు. మీరు యేదేనా చేయ గలరా?" ఐ.జి. ప్రశ్నించాడు.

వంకీల జుత్తు. సన్నటి మీసాలు. సన్నగా పొడుగ్గా వున్న ఆకారం. తెల్ల పాంటులోకి తెల్ల షర్టుని దోపు కున్నాడు. చొక్కా చేతుల్ని మోచేతుల పైకి లాక్కుంటూ ప్రభంజనం "రిపోర్టింగ్ వేరు. పరిశోధన వేరు అఫ్‌కోర్స్ పరిశోధన రిపోర్టింగ్‌కి ఆధార మను కోండి. ఆ టైప్ పరిశోధనకి కావాల్సినంత టైమ్ వుంటుంది. ఇప్పుడు అంత టైమ్ లేదు. ఉన్న కొద్దిపాటి సమయం మాస్టర్ మైండ్‌కి అనుకూలంగా వుంది!" అన్నాడు.

ఐ.జి. అవుననట్టు తలాడించాడు.

"మన మాస్టర్ మైండ్ మన ఆఫీసులో విశ్రాంతిగా తొణక్కుండా కూచుని, తన కార్యక్రమాన్ని విజయవం తంగా అమలుజరుపుతున్నాడు. అతనిలాగే మనమూ ఒక చోట కూచుని మన పరిశోధన సాగించాలి....మనం ఎక్కడికీ వెళ్ళలేం. ఎందుకంటే అతన్ని గురించి అణు గింజంత కూడా మనకి తెలీదు!"

శ్రోతలు మూగగా అంగీకరిస్తూ తల లాడించారు.

ప్రభంజనం తన ఆలోచనల్ని పైకి చెప్పసాగేడు. "మాస్టర్ మైండ్ ఒకే ఒక మూవ్‌తో మనల్ని తన కంట్రోల్ లోకి తీసుకుని చుట్టూ ఉక్కు పిడికిలి బిగించాడు. అంటే చాలా ముందుగానే అంతా బ్రహ్మాండంగా ప్లాన్ చేయబడిందన్నమాట. మన డిశ్పాచ్ టైమింగ్స్, నైట్ షిఫ్ట్ వివరాలూ, మన బిల్డింగ్ లేఔటూ అతనికి కంఠతా పాఠంగా వచ్చని తెలుస్తోంది. అధునాతనమైన ఎలెక్ట్రానిక్ పరికరాల్ని వాడుతున్నాడంటే అతనికి ధనబలం వుండితీరాలి. చెమటోడ్చి ఆర్జించిన పైకాన్ని యెవరూ యిలాంటి అపాయకరమైన కార్యాలకి పెట్టుబడి పెట్టరు. అంటే మన మాస్టర్ మైండ్ ఇటీవలకాలంలో ఎప్పుడో ఎక్కడో చాలా సులువుగా, తేరగా పెద్ద మొత్తంలో డబ్బు సంపాదించి వుండాలి...."

ఐ.జి. తల వెనక్కి ముందుకీ ఊగింది. "గో ఆన్.... మీ ఆలోచనలు సరైన బాటలో వెళ్తున్నాయి!" అన్నాడు.

"మాస్టర్ మైండ్ మూడు పరికరాల్తో తన పథకానికి పదను పెట్టాడు. ఒకటి: డబ్బు. రెండు: టెక్నికల్ నాలెడ్జి. మూడు: మనకి సంబంధించిన అన్ని వివరాలూ. ఈ మూడింటినీ అతను యెలా సంపాదించాడు? ఇది తెలిస్తే అతనెవరో మనకి తెలుస్తుంది...." ప్రభంజనం ఆగాడు.

"యూ ఆర్ రైట్!" ఐ.జి. క్లుప్తంగా అన్నాడు.

"సార్, ఏడాదిగా జరిగిన అన్నిరకాల నేరాల గురించీ పూర్తి వివరాలు—ఎంత చిన్నవైనా సరే—మనకి అత్యవసరంగా కావాలి" అన్నాడు ఐ.జీ.తో.

ఐ.జీ. మాట్లాడకుండి, టెలిఫోన్నిలాగి రిసీవరెత్తి ఒక నంబరు తిప్పాడు. "శంకర్, ఈ ఏడాదిలో జరిగిన అన్ని రకాల నేరాలకీ సంబంధించిన డిటెయిల్డు రిపోర్ట్సు తీసుకుని పదినిముషాల్లో నన్ను కల్సుకో. ఇదంతా టాప్ సీక్రెట్!" అంటూ తనున్న చోటు చెప్పి ఫోన్ పెట్టేశాడు.

"శంకర్ మా డిపార్టుమెంట్‌కి వాకింగ్ ఎన్‌సైక్లో పీడియా! ఏడాదిలో జరిగిన కేసు వివరాల్ని అతను అమరంలా అప్పజెప్తాడు!" అన్నాడు ప్రభంజనంతో.

"ఇక్కడ వో గదిలో నాలుగు టెలిఫోన్లు యేర్పాటు చేయాలి. నాకు సహాయం చేయడానికి ఒక అసిస్టెంట్ కావాలి...." ప్రభంజనం అన్నాడు.

"ఐ విల్ బీ యువర్ అసిస్టెంట్" అన్నాడు ఎడిటర్ పరాంకుశం. ప్రభంజనం చిరునవ్వు నవ్వాడు.

"చక్రవర్తిగారు మీ కోసం యెదురుచూస్తూ వుంటారు...."

"ఫర్వాలేదు. అక్కడింక నేను చెయ్యాల్సిందేమీ లేదు; ఆయనతో పాటు జాగారం చేయటం తప్ప! పొద్దుటే కల్సుకుంటానని చెప్తాను" అంటూ పరాంకుశం ఫోన్ని అందుకున్నాడు.

ప్రభంజనం అతన్ని ఆపాడు. "ఒక్క క్షణం. మాస్టర్ మైండ్ చక్రవర్తిగారి ఇంటిమీద తన మూడో కన్ను కేంద్రీకరించబడిందన్నారు. ఇంత చాకచక్యంగా పని సాగిస్తున్న అతను మీ టెలిఫోన్ సంభాషణమీదకూడా ఒక చెవి పారేసి వుంటాడు. మీరు ఇక్కడికి వచ్చింది అతనకి కూడా ఈపాటికి తెలిసే వుంటుంది...."

పరాంకుశం గాభరాగా చూశాడు.

ప్రభంజనం చిన్నగా నవ్వాడు. "కంగారుపడకండి. మాస్టర్ మైండ్ కి ఏమాత్రం అనుమానం రాకుండా, చక్రవర్తిగారికి గాభరా పుట్టకుండా మీరు నాటకం ఆడాలి. హోం మినిస్టర్ గారు, తమకి సంబంధించిన ఫోటోలూ అవీ నిజంగా మీ దగ్గరున్నాయేమో రూఢిగా తెలుసుకోడానికి పిలిపించారనండి. గుట్టు చప్పుడు కాకుండా ఇరవై లక్షలూ చెల్లించమని సలహా యిచ్చారనీ, ఆ నష్టం పూడ్చడానికి నిదానంగా వేరే యేర్పాట్లు జరుగుతాయనీ, వోపిగ్గా ఉండమన్నారనీ చెప్పండి. భవిష్యత్తులో కూడా పోలీసు రిపోర్టు ఇవ్వొద్దన్నారనీ చెప్పండి. ఇంటికెళ్ళిపోతున్నాననీ, పొద్దుటే కలుస్తుంటాననీ చెప్పండి" ప్రభంజనం వివరించాడు. పరాంకుశం ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

దయానిధీ, ఐ.జి. మెప్పుగా తలలు ఆడించారు. పరాంకుశం నంబరు తిప్పాడు.

# 10

ఉదయం కావొస్తోంది. కాళీప్రసాద్ టేబుల్ మీదికి కాళ్ళు చాపి, కుర్చీలో వెనక్కి వాలి కూచున్నాడు. అతని పొట్టమీద టిఫిన్ ప్లేటుంది. ఉప్మాని స్పూనుతో నోటికి అందుకోబోతూ ఆగి, అల్బర్టువైపు చూశాడు. "అల్బర్టు ఉప్మా తినొచ్చా?"

"నిరభ్యంతరంగా. ప్రతి ప్లేటులోదీ మొదట వంటతనికీ, సర్క్యులేషన్ మేనేజర్ కీ తినిపించి, చూశాను. అందరూ శుభ్రంగా వున్నారు! రాత్రినుంచీ కాఫీకూడా అలాగే టెస్టు చేస్తూనే వున్నాను బాస్" అల్బర్టు సగర్వంగా అన్నాడు.

"ఎక్సలెంట్!" అంటూ కాళీప్రసాద్ ఆకలితో

తినడం ప్రారంభించాడు. వాకీటాకీలోంచి సిగ్నల్ వస్తోంది. ఎడంచేత్తో అందుకున్నాడు.

"యస్!"

"భైరవ్ రిపోర్టింగ్. ఇప్పుడే ఎడిటర్నుంచీ పబ్లిషర్‌కి ఫోనొచ్చింది. హోం మినిస్టర్ మనకి డబ్బు చెల్లించమనీ, పోలీస్ రిపోర్టు ఇవ్వొద్దనీ హెచ్చరించాట్ట. ఆ నష్టం తరవాత పూడ్చబడుతుందని ధైర్యం చెప్పాట్ట."

"మార్వెలస్! నా ఉక్కు పిడికిట్లో ఇరుక్కున్న హోం మినిస్టర్ మనకి ఉక్కు కవచంలా తయారవుతున్నాడు! భైరవ్, ఆకలవుతోందా?"

"బ్రెడ్డూ, ఫ్లాస్క్‌లో టీ వున్నాయి బాస్. అవసరమైతే రిలీఫ్ ఇవ్వడానికి గోపీ వుండనే వున్నాడు."

"నైస్. నాకిప్పుడు కళ్ళూ, చెవులూ నువ్వే భైరవ్!"

"యూ ఆర్ వెల్‌కమ్, బాస్!"

"థాంక్యూ....ఓవర్" కాళీప్రసాద్ సైంచూశాడు. ఆరయ్యింది. ఉప్మా ముగించి, పూరీలు తిని, కాఫీ చప్పరిస్తూ చక్రవర్తి నంబరు తిప్పాడు. చక్రవర్తి తనకన్నా అలర్టుగా వున్నాడు!

"చక్రవర్తి హియర్" అందతని కంఠం.

"చక్రవర్తీ, మరో నాలుగ్గంటల్లో బ్యాంకులు తెరుస్తారు ..."

"నాకు తెలుసు!" చక్రవర్తి కంఠం కటువుగా ధ్వనించింది. కాళీప్రసాద్ నవ్వాడు.

"కొత్త రోజు ప్రారంభమైంది. ఇటువేపు నీ వెట్టి చాకిరీగాళ్ళు రారనుకుంటాను...."

"రెండురోజులు లాకౌట్ ఎనౌన్స్ చేశాను. మెకానికల్ ట్రబుల్" చక్రవర్తి ముక్తసరిగా అన్నాడు.

"చక్రవర్తీ, ఇటువేపు వరమానవుడు రాకూడదు. ఇదే ఫైనల్ వార్నింగ్! సూర్యుడిలా మొత్తాన్ని నేను చూస్తూవుంటాను. నాకు ఏమాత్రం అనుమానం వచ్చినా, రెండో ఇన్‌స్టాల్మెంట్ డిస్ట్రక్షన్ జరుగుతుంది...."

"అనవసరంగా నువ్వు అనుమానిస్తూ, భయపడుతూ నన్ను గాభరా పెడుతున్నావ్. పాడిన పాటే పాడుతున్నావు!" చక్రవర్తి ఎగతాళిగా అన్నాడు.

"నీకు తెలీదు. నన్ను చూసి భయం భయపడుతుంది! ఇంక, అనుమానం నాకు ఆయుష్షుపోస్తూ వుంటుంది. మళ్లీ సిద్ధం చేసి, పదకొండింటికి ఫోనుముందు పద్మాసనం వేసుక్కూర్చో. ఎక్కడ, ఎలా, ఎప్పుడు అందజేయాలో చెప్తాను" కాళీప్రసాద్ రిసీవర్ని పడేశాడు.

# 11

"ఈ ఏడాదిలో — నాలుగు బస్సు దోపిడీలు జరిగాయి. దోపిడీ ముఠాలు దొరకలేదు. నాలుగూ ఒకే పద్ధతిలో జరిగాయి.

మూడు బాంకు దోపిడీలు జరిగాయి. దొంగలు దొరికిపోయారు; జైల్లో ఉన్నారు.

విశాఖపట్నం పొలిమేరల్లో రెండు పెట్రోల్ బంక్స్ దోచుకోబడ్డాయి. ఇరవై వేలదాకా పోయింది. రెండూ ఒకే పద్ధతిలో, మాస్క్ ధరించిక ఒక వ్యక్తిచేత చేయబడ్డాయి. అర్ధరాత్రి సమయంలో అతను కార్లో వచ్చాడు. కారు నంబరు యెవ్వరూ చూళ్ళేదు.

రెండుసార్లు రెండు కార్లు దొంగిలించబడి, దొరికాయి. వేలిముద్రలు లేవు...." శంకర్ ఆగి, మరో రెండు పేజీలు తిరగేశాడు.

ప్రభంజనం సిగరెట్ పీలుస్తూ వింటున్నాడు. నాలుగు

ఫోన్ల ముందు ఆపరేటర్లా కూచున్నాడు పరాంకుశం.

"ఆర్నెల్ల క్రితం తిరపతి సమీపంలోని విగ్గుల ఫ్యాక్టరీ జీతం పైకం—అరవై వేలు—దోచుకోబడింది. నడిరోడ్లో పట్టపగలు ఈ దోపిడీ జరిగింది. డ్రైవర్‌తో బాటు క్యాష్ తీసుకోడానికి వెళ్ళిన గుమస్తా వున్నాడు. క్యాష్‌తో కారు సగం దూరం వెళ్ళాక డిక్కీలోంచీ చప్పుడు వినిపించి, కారాపి ఇద్దరూ కిందికి దిగారు. డ్రైవర్ డిక్కీ లాక్‌ని పరీక్షించాడు. లాక్ చేయబడ లేదు. లాక్ చేయబోయాడు. లోపల చప్పుడైంది. ఆశ్చ ర్యంతో డిక్కీ తెరిచాడు.

నల్లటి దుస్తుల్లో, మొహానికి మాస్కుతో వున్న ఒక వ్యక్తి రివాల్వర్ చూపిస్తూ కిందకి ఉరికాడు. ఇద్దర్నీ బుద్ధిగా కారెక్కమన్నాడు. గుమాస్తా ప్రమాదం గ్రహించి, ధైర్యంగా తిరగబడబోయాడు. దొంగ అతన్ని స్పృహతప్పేలా రివాల్వర్ పిడితో తలమీద వాయించాడు. అతన్ని కార్లో పడేసి, తనూ కూచుని కార్ని వెనక్కి తిప్పి పోనిమ్మన్నాడు.

నిర్మానుష్యంగా ఉన్న ఒక అడ్డదారిలో పదికిలో మీటర్లు తీసికెళ్ళి కార్ని ఆపించి, రివాల్వర్ పిడి ప్రయోగంతో డ్రైవర్‌కి స్పృహతప్పించాడు. ఇద్దరూ కోలుకుని చూసేసరికి క్యాష్ బాగ్‌లో రొక్కం, నాలుగు టైర్లలో గాలీ లేవు! దొంగ తను తప్పించుకోడానికి కావల్సినంత టైమ్‌ని ఆ విధంగా సృష్టించుకున్నాడు. డబ్బూ, దొంగా ఇంతవరకూ దొరకలేదు...." శంకర్ ఆగాడు.

"ఇంతేనా?" ప్రభంజనం ప్రశ్నించాడు.

"ఇంకా ఎన్నో వున్నాయి. చిన్న చిన్న కేసులు. వివరాలు చెప్పమంటారా?" శంకర్ అడిగాడు.

"వరసగా, వివరంగా" అన్నాడు ప్రభంజనం నవ్వుతూ. అరగంటపాటు శంకర్ కేసుల్ని వివరిస్తూ కూచున్నాడు.

ప్రభంజనం లేచి అటూ ఇటూ తిరగసాగేడు. రెండు నిమిషాల తరవాత శంకర్ ముందు ఆగాడు.

"మిస్టర్ శంకర్, మీరు వివరించిన ఏ కేసుకీ ప్రస్తుత విషయంతో పోలిక లేవు. ఇప్పుడు మన మాస్టర్ మైండ్‌కి అనుచరులున్నారు. అవసరానికి సరిపడేంత డబ్బు పోగు చేసుకునే దాకా అతను వొంటరిగానే నేరాలు చేశాడని మాత్రం అనిపిస్తోంది.

పేట్రోల్ దోపిడీ చేసిన వ్యక్తి ముందుగా చక్కగా ప్లాన్ వేసుకొని చాకచక్యంగా పనిసాగించి, సాధించాడు. అతని జిత్తులమారితనాన్ని ఆ దోపిడీ బాగా వ్యక్తం చేస్తోంది. పెట్రోల్ బంక్స్ దోపిడీలు కూడా తెలివిగా జరుపబడ్డాయి.

ఈ మూడూ చేసిన వ్యక్తి ఒక్కడే అని నాకు అనిపిస్తోంది. మీకు లభించిన ఆధారాలమూలంగా ఈ మూడూ చేసిన వ్యక్తుల పోలికలేమన్నా దొరుకుతున్నాయా?"

శంకర్ డైరీని తిరగేశాడు. "పెట్రోలు బంక్స్‌ని కొల్లగొట్టిన వ్యక్తి కుంటుతూ నడిచాడు. దొరికిన పోలిక ఒక్కటే. మాస్క్. తనను దాచుకోవాలనుకున్న వ్యక్తి యెవరైనా సహజంగా మాస్క్ ధరిస్తాడు. అంచేత దానిమీద అంతగా ఆధారపడలేం!" అన్నాడు శంకర్.

ప్రభంజనం నవ్వుతూ చూశాడు. "పెట్రోల్ బంక్స్‌ని దోచిన వ్యక్తికి కొంచెం దూరం నడిచే అవకాశం వుంది. అంచేత అతను కుంటుతూ నడిచి, తన్ను కుంటివాడుగా

చిత్రించుకున్నాడు. కార్ని నడిదార్లో ఆపి, పట్టపగలు దారి మళ్ళించిన వ్యక్తి డిక్కీనుంచీ డోర్ దాకా రెండు మూడు అడుగులు వేసివుంటాడు. నింపాదిగా ప్రవర్తించే అవకాశం, జాగా అతనికి లేవు. కుంటివాడుగా నటించే ఛాన్సు అతనికి లేదు. ఇవన్నీ ఒక్క వ్యక్తే చేశాడని నేనంటే మీరేమంటారు?"

శంకర్ చిరునవ్వు నవ్వాడు. "చేసివుండొచ్చని వొప్పుకుంటాను. కానీ అది మీ వాదన బలంవల్ల మాత్రమే!"

"ఒకే వ్యక్తే అని వొప్పుకుంటే వొరిగేదేముంది? రెండు విశాఖపట్నం దగ్గరా, ఒకటి తిరుపతి దగ్గరా జరిగాయి!" పరాంకుశం అన్నాడు; కల్పించుకుని.

"వేటాడే పులికి అరణ్యమంతా సొంతమే! నేరస్థుడు విశాఖపట్నంనుండీ తిరపతి వెళ్ళలేడంటారా?" ప్రభంజనం అడిగాడు.

"వెళ్ళొచ్చు. కానీ విగ్గుల ఫ్యాక్టరీ జీతాల మొత్తం, చెల్లించబడే తేదీ, బాంకులో క్యాషయ్యే విధానం, సెక్యూరిటీ లేకుండా కార్లో వెళ్ళే వైనం__వగైరా ఇన్ఫర్మేషన్ బైటి వ్యక్తికన్నా, స్థానికంగా వుండే వారికే బాగా తెలుస్తాయి" అన్నాడు పరాంకుశం.

ప్రభంజనం నవ్వాడు. "నేరస్థుడు తిరపతివాడు కాడని మీరెలా అనగలరు? తిరపతినుండీ విశాఖపట్నం వెళ్ళివుండొచ్చుగా?"

"అయితే వాడే వీడు అంటావా, ప్రభంజనం?" పరాంకుశం ప్రశ్నించాడు.

"ఎవడు ఎవడో మనకి తెలీదు. పరిశోధన ఎక్కడో ఒకచోట ప్రారంభించాలి గనుక, డబ్బులేందే నేర

కూడు యిప్పటి అడ్వెంచర్ చేయలేదు గనుకా డబ్బు— క్షణం నుంచీ చూస్తున్నాం” అంటూ ప్రభంజనం కుర్చీలో కూచున్నాను.

“మిస్టర్ శంకర్! విశాఖ పోలీసులకీ, తిరపతి పోలీసులకీ ఫోన్ చేయండి. మూడు కేసులకి సంబంధించి యేవేనా డెవలప్‌మెంట్స్ వున్నాయేమో కనుక్కోండి” అన్నాడు.

•   •   •

ఉదయం నుంచీ కాళీప్రసాద్ బృందం చాలా అలర్ట్‌గా వుంది. కాంపౌండు వేపు యెవరేనా వస్తారేమో అని రాంబాబూ, గంగారామ్ వెయ్యి కళ్ళతో చూస్తున్నారు.

భైరవ్ నుంచీ క్రమం తప్పకుండా కాళీప్రసాద్‌కి రిపోర్టులు అందుతూనే వున్నాయి.

పది గంటలు కావొస్తోంది.

కాళీప్రసాద్ దీర్ఘాలోచనలో మునిగి పచార్లు చేస్తున్నాడు. సగం కాల్చిన చుట్టల్ని అటూ ఇటూ పారేస్తున్నాడు. ఆల్బర్టు వాటిని ఆర్పి, అతి జాగ్రత్తగా జేబులో పడేసుకుంటున్నాడు.

## 12

శంకర్ ఫోన్ని పెట్టేసి ప్రభంజనంవైపు చూస్తూ పెదవి విరిచాడు. “గొంగళ్ళు వేసిన చోటే వున్నాయి. నో ఫర్‌దర్ డెవలప్‌మెంట్స్!” అన్నాడు.

ప్రభంజనం తల పంకించాడు. “పోలీస్ రికార్డ్సునీ, ప్రెస్ రిపోర్ట్సునీ బట్టి ఆలోచిస్తే మాస్టర్ మైండ్ చేస్తున్న కొట్టమొదటి సాహసకార్యం యిదే అనిపిస్తోంది....అతనికి ‘డబ్బు ఎక్కణ్ణుంచీ వచ్చింది’ అన్న

యాంగిల్ మనకి సహాయపడ్డంలేదు. ఇంక ఇన్‌సైడ్ ఇన్ఫర్మేషన్! చక్రవర్తి ఎస్టేట్సు లేఔట్, నైట్‌షిఫ్ట్ వివరాలూ అతనికి బాగా తెలుసని రుజువైంది...."

"మీ సంస్థలో పనిచేసేవాళ్ళే ఆ ఇన్ఫర్మేషన్ అతనికి అందజేసి వుండొచ్చు.... తెలిసో, తెలీకో...." శంకర్ అందించాడు.

"ఉండొచ్చు. నైట్‌షిఫ్ట్ వివరాలు నైట్ వాచ్‌మెన్‌కీ డ్రైవర్లకీ నైట్ వర్కర్స్‌కీ తెలుసు. వాళ్ళంతా ప్రస్తుతం అతని బందీలుగా వున్నారు. వాళ్ళని మనం ప్రశ్నించలేం. పోతే లేఔట్‌ని కనుక్కోడానికి వెయ్యి మార్గాలున్నాయి....ఏదో వేషంలో అతనే అంతా తిరిగి చూసివుండొచ్చు...." కదిలో కొస్తున్న పరాంకుశాన్ని చూస్తూ ఆగాడు ప్రభంజనం.

"ఏదేనా క్లూ దొరికిందా?" పరాంకుశం ప్రశ్నించాడు.

"క్లూ దొరికితే అసలు వ్యక్తి దొరికినట్టే!" అన్నాడు ప్రభంజనం నవ్వుతూ.

పరాంకుశం పబ్లిషర్ యింటికి వెళ్ళివచ్చాడు.

"పదకొండు ముప్పైమూడుకి మాస్టర్ మైండ్ ఫోన్ చేసి, డబ్బు ఎలా, ఎక్కడ అందజేయాలో చెప్తాడు ప్రభంజనం! నువ్వు త్వరగా ఏదేనా చేయాలి. కాసేపట్లో పులి అడవిలోకి మాయమవుతుంది....!" అన్నాడు గాభరాగా.

ప్రభంజనం చిరునవ్వు నవ్వాడు. "అతను తను మాయం కావడానికి సేఫ్టీ అవర్స్ యేర్పాటు చేసు కున్నాడు. అతను జారుకుని, క్షేమంగా మాయం అయితేగానీ మనకి క్షేమంలేదు! అతను గ్రీన్ సిగ్నల్ ఇచ్చాకగానీ మనం అటూ ఇటూ పరుగెత్తి పరిశోధించ

శం!"

"హి యీజ్ కరెక్ట్. తప్పించుకునే ఛాన్స్ మనం అతనికి చచ్చినట్టు ఇవ్వాల్సిందే" అన్నాడు శంకర్.

ప్రభంజనం తటాలున లేచాడు. "మనం మూడో పాయింటుని మరిచిపోయాం!" అన్నాడు ఉద్రేకంతో.

"ఏమిటది?" శంకర్ పరాంకుశం జంటస్వరాలుగా ప్రశ్నించారు ఆత్రంగా.

"టెక్నికల్ ఎక్స్‌పర్టైస్! సాంకేతిక పరిజ్ఞానం, బాంబ్సుని, వాటిని యాక్టివేట్ చేసే పరికరాన్నీ అత నెలా సంపాయించాడు? మన ప్రతి అడుగూ అతను తెలుసుకోగలుగుతున్నాడు. అంటే అతను వాకీటాకీ ల్లాంటి పరికరాలు వాడుతున్నాడు...."

"ఎస్....ప్రొసీడ్?" అన్నాడు శంకర్.

"ఎలెక్ట్రానిక్స్‌లో అత్యంత ప్రావీణ్యత సంపాదించిన ఎక్స్‌పర్ట్స్ మన రాష్ట్రంలో ఎవరెవరున్నారు? ఎక్కడున్నారు? యేం చేస్తున్నారు? వాళ్ళు యెలాంటి వాళ్ళు? ఈ వివరాలు మనకి తక్షణం కావాలి!"అన్నాడు ప్రభంజనం.

"గడ్డిమేటిలో సూదిని ఇంకా తేలిగ్గా వెతికి, వెలికి తీయొచ్చు!" అన్నాడు శంకర్.

"యూ ఆర్ రాంగ్. అలాంటి ఎక్స్‌పర్ట్స్ దేశం మొత్తంమీద ఏ అయిదారుగురో వుండొచ్చు. అలాంటి వాళ్ళు మన సమీపంలో ఎవరున్నారు?" ప్రభంజనం ఇద్దర్నీ ప్రశ్నించాడు. ఇద్దరూ నిస్సహాయంగా తలలు వూగించారు.

ప్రభంజనం పెద్ద అంగల్లో గదిలోంచి హాల్లోకి వెళ్ళి వెళ్ళి ఐజీని వెంటబెట్టుకుని వచ్చాడు. తనకి కావాల్సిన

దాన్ని గురించి ఐ.జీ.కి వివరించాడు.

"ఎలెక్ట్రానిక్స్‌లో పరిశోధనలు సాగించడం అత్యధిక వ్యయంతో, శ్రమతో కూడిన పని. సొంతంగా యే శాస్త్రజ్ఞుడూ అంత భారీ యెత్తున పరిశోధన సాగించ లేడు...."

"ఏం కావాలో, ఏం చేయాలో చెప్పండి" అన్న ఐ.జీ.కి అడ్డొస్తూ.

"జై భారత్ ఎలెక్ట్రానిక్స్ మేనేజింగ్ డైరెక్టర్ని కాంటాక్ట్ చేయండి. అలాంటి ఎక్స్‌పర్ట్స్ గురించి ఆయన యేదేనా సమాచారం యివ్వగలదేమో కనుక్కోండి" అన్నాడు ప్రభంజనం.

డైరెక్టరీ తిరగేసి, ఒక నెంబర్ తిప్పాడు. "ఐ.జీ. గారుమీతో మాట్లాడతారు...." అంటూ రిసీవర్ని ఐజీకి అందించి, కుర్చీలో కూర్చున్నాడు.

## 13

11-30 అయింది. కాళీప్రసాద్ వాకీటాకీ అందు కున్నాడు. భైరవ్‌ని పిలిచాడు.

"భైరవ్ హియర్."

"భైరవ్, సరిగ్గా 11-40 కి సమతతో చక్రవర్తి బయల్దేరుతారు. అతను వొంటరిగా వెళ్ళాలి. మధ్యలో యెక్కడా ఆగకుండా నేను నిర్దేశించే గమ్యం చేరు కోవాలి. సిటీలిమిట్స్ దాటేదాకా సువ్వతన్ని ఫాలో చేయాలి. చేయగలవా?"

"అహా...."

"రైట్, భైరవ్! మరో పదినిమిషాల్లో గోపీని రిలీవ్ చెయ్. ఏం చేయాల్సిందీ అతనికి నేను చెప్తాను. 11-33కి

నేను చక్రవర్తితో మాట్లాడుతాను. ఆ క్షణం నుంచీ నువ్వు కళ్ళూ చెవులుగా మారిపోవాలి! చక్రవర్తి ఎవరికైనా ఫోన్ చేయొచ్చు. ఎవరైనా అతన్ని వెంబడించొచ్చు! అర్థమైందా?"

"పూర్తిగా."

"భైరవ్! యింతవరకూ నువ్వూ, గోపీ యెక్కడుంటున్నారో నేను అడగలేదు. ఎక్కడున్నారు?"

"సాధారణంగా యెవ్వరూ ఊహించలేని ప్రదేశంలో—చక్రవర్తి బంగళామీద!" భైరవ్ సగర్వంగా అన్నాడు.

"గుడ్. గోపీని మాట్లాడమను...."

కాళీప్రసాద్ యేం చేయాల్సిందీ గోపీకి వివరించాడు. ఆఖర్న యిలా అన్నాడు: "ఇప్పుడు మన ప్లాన్ పూర్తిగా నీ చేతుల్లోకి వస్తోంది. అందరం పాల సముద్రాన్ని చిలికాం. అమృతభాండం నీ చేతుల్లోకి వస్తోంది. ఏకాగ్రతతో పనిచేయి. ఇప్పుడు 11-32 అయింది. మరో నిమిషంలో నేను చక్రవర్తితో మాట్లాడుతాను. సరిగ్గా 11-40 కి అతను కారులో బయల్దేరుతాడు. అంటే నీకు యేడు నిమిషాల వ్యవధి వుంటుంది. ఆ సమయంలో నువ్వు జారుకోవాలి....సరుకుతో యెక్కడి కెళ్ళాలో తెలుసుగా?...."

"తెలుసు బాస్!"

"గోపీ, గుడ్ లక్ టు యూ!"

"గుడ్ లక్ టు అజ్ బాస్!"

తర్వాత చక్రవర్తికి ఫోన్ చేశాడు కాళీప్రసాద్. డబ్బు యెక్కడ, యెలా అందజేయాలో వివరించాడు.

"చక్రవర్తీ, సూట్ కేస్ ని ఓ గోనెసంచిలో పెట్టు.

దాన్ని నీ కారు వెనుక సీటుకింద పడేయ్. ఒంటరిగా 11-40 కి బయల్దేరు. పూనారోడ్డు మ్మీట కార్ని మామూలు స్పీడులో పోనియ్. ట్రాఫిక్ సిగ్నల్స్ దగ్గర తప్ప నీ కారు ఎక్కడా ఆగకూడదు. ఎలాంటి సందర్భంలో కూడా నువ్వు కారు దిగకూడదు.

పన్నెండు కిలోమీటర్లు పోయాక రోడ్డు చీలుతుంది. కంకర రోడ్డుమ్మీట మూడు కిలోమీటర్లు వెళ్ళు. ఒక చెరువుని సమీపిస్తావు. ఆపి, కిందికి దిగు. కారు ట్రబుల్ వున్నట్టు నటిస్తూ, బోనెట్ ఎత్తి వొంగి నిల్చుని ఇంజన్ని పరీక్షిస్తూ వుండు.

అయిదు నిమిషాల్లో "కార్ ట్రబులిచ్చిందా? ఠి పేరు కాదు!" అంటుందో కంఠం. అప్పుడు మాట్లాడకుండా లేచి నిలబడు. గోనెసంచీని ఆ వ్యక్తికి అందించు. ఆ వ్యక్తిని పోల్చుకోడానికీ, వెంబడించడానికీ ప్రయత్నించకు.

పదినిమిషాలు బోనెట్ని అలాగే తెరిచి, పరీక్షిస్తూ నిలబడు గుర్తుంచుకో. సరిగ్గా పదినిమిషాల తర్వాత కార్ని వెనక్కి తిప్పి నెమ్మదిగా తిరిగివెళ్ళు. ఇంట్లో కూచో. నేను క్షేమంగా మరో చోటికి చేరుకున్నాక, నీ కో టెలిఫోన్ కాల్ వస్తుంది. "మీకు లైసెన్స్ లభించింది!" అంటుందో కంఠం. ఆ తరువాత యథా ప్రకారం నీ పేపర్ వ్యాపారం ప్రారంభించు. అర్థమైందా?" అంది కాళీప్రసాద్ కంఠం.

"అర్థమైంది" అన్నాడు చక్రవర్తి. అతని కంఠం కొద్దిగా వణికింది.

కాళీప్రసాద్ కంఠం కఠినంగా, బెదిరింపుగా ధ్వనించింది. "చక్రవర్తీ! నీతో మళ్ళీ నేను మాట్లాడను. ఆఖరు

సారి చెప్తున్నా. నేను గ్రీన్ సిగ్నల్ యిచ్చేదాకా నువ్వు ప్రతీ అడుగూ నేను చెప్పినట్టే వేయాలి. నా పని సలక్షణంగా పూర్తయ్యేదాకా నువ్వు నా కాలికింద పురుగులా వుంటావు. మోసంచేసే ఆలోచన నీకు కలిగినట్టు నాకు అనుమానం వస్తే నిర్దాక్షిణ్యంగా నిన్ను కాలరాచేస్తాను. నామరూపాలు లేకుండా చేస్తాను. ఫుట్ పాత్ మీద న్యూస్ పేపర్లు అమ్ముకొంటావు! నా చూపుడు వేలిని గుర్తుంచుకో. నా అరచేతిలో నీ నరకం వుందని గుర్తుంచుకో!"

## 14

"మరేంలేదు.... జస్టు రొటీన్.... థాంక్యూ వెరీమచ్" అంటూ ఫోన్ పెట్టేసి ఐ. జీ. ప్రభంజనం వైపు చూశాడు.

"మిస్టర్ ప్రభంజనం! జై భారత్ ఎలక్ట్రానిక్స్ మేనేజింగ్ డైరెక్టర్ చెప్పిందాన్నిబట్టి మనకి కావాల్సిన హాయి ఎక్స్‌పర్ట్స్ చాలా, చాలా తక్కువమంది వున్నారు. ఆ తక్కువమందిలో మనకి సమీపంలో వున్న వ్యక్తి భరద్వాజ. అతను ఏడాది క్రితందాకా జై భారత్ ఎలెక్ట్రానిక్స్‌లో చీఫ్‌గా పని చేశాడు. వ్యక్తిగత కారణాలవల్ల రాజీనామా చేసి వెళ్ళిపోయాడు. ప్రస్తుతం కంప్యూటర్లని సర్వీస్ చేసే సొంత ఫర్మ్‌ని నడుపుతున్నాడు...."

"అతనెక్కడున్నాడు?" ప్రభంజనం ఆడ్డొస్తూ అడిగాడు. ఐజీ ఒక చిన్న కాగితాన్ని అందించాడు. భరద్వాజ అడ్రస్ వున్న ఆ కాగితాన్ని జేబులో వుంచుకున్నాడు ప్రభంజనం.

"సార్, అతని ప్రవర్తన గురించీ, మన స్తత్వం గురించీ

డైరెక్టర్ యేదేనా చెప్పాడా?"

"మనం విన్నదాన్నిబట్టి అతను ముక్కుకు సూటిగా వెళ్ళే మనిషి. తను చెప్పిందే వేదం అనే రకం. పై అధికార్లనీ, తనకింద పనిచేసే వాళ్ళనీ ఒకేరకమైన నిర్లక్ష్యభావంతో చూసేవాడు. ఇంతకన్నా డైరెక్టర్ యేమీ చెప్పలేకపోయాడు" ఐ.జీ. చెప్పాడు.

"సార్! దయచేసి మీరు ఆ గదిలో టెలిఫోన్ ముందు కూచోండి. శంకర్ గారూ, పరాంకుశంగారూ మీతో వుంటారు. మూడో్ంతులు మీకు నేను ఫోన్ చేస్తాను. భరద్వాజమీద నాకు అనుమానంగా వుంది...."

ఐ.జీ. కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "ఇద్దర్నీ మఫ్టీలో మీతో తీసుకెళ్ళడం మంచిదేమో...."

"ఇప్పుడప్పుడే మన పరిశోధన ఆ స్థాయికి రాలేదు. ఇదే మనం వేస్తున్న మెట్ట మొదటి అడుగు!" అన్నాడు ప్రభంజనం పాలోచనగా.

"పదకొండూయాభై అయిదయింది. అతను చక్రవర్తి గార్ని ఆడిస్తూ వుంటాడు...." అన్నాడు పరాంకుశం విచారంతో. అతని కంఠం భయంతో వణికింది.

"అతన్నే కాదు; నేరస్థుడు మనల్నందర్నీ ఆడిస్తున్నాడు. అతని పాటకు అనుగుణంగా ఆడినంత కాలం చక్రవర్తికే ప్రమాదమూ రాదు" అన్నాడు ఐ.జీ.

ప్రభంజనం వెళ్ళబోయాడు. "మిస్టర్ ప్రభంజనం! యూ కెన్ టేక్ మై కార్" అన్నాడు ఐజీ తాళంచెవ్వి యివ్వబోతూ. ప్రభంజనం వద్దన్నాడు. "మా ఎడిటర్ గారి కారు తీసికెళ్తాను" అంటూ పరాంకుశం అందించిన కీ తీసుకుని గబగబా వెళ్ళిపోయాడు.

• • •

"భైరవ్ రిపోర్టింగ్!"

"యస్. గో ఆన్!"

"చక్రవర్తి కారు యెక్కడా ఆగకుండా సిటీ లిమిట్సు దాటింది. అతను కిందికి దిగలేదు. వొంటరిగానే వున్నాడు. ఆటోలో యిక్కడి దాకా ఫాలో అయ్యాను."

"ఓకే, భైరవ్. నువ్వు మునిగిపో. ఎక్కడ తేలాలో తెలుసుగా?"

"యస్ బాస్."

"గడ్డం గీసుకోడం మర్చిపోకు. ఓవర్!"—కాళీ ప్రసాద్ విజయగర్వంతో ఆల్బర్టు వైపు చూశాడు. ఆల్బర్టు మొహంలో సంతృప్తికరంగా నవ్వు వెలుగుతోంది.

"ఆల్బర్ట్! పక్షి పంజరం వేపు యెగురుతోంది. ఆఖరు క్షణంలో కథ అడ్డం తిరక్కూడదు. వెళ్ళు. రాంబాబుకీ, గంగారామ్‌కీ సంగతి చెప్పు. పంజాలు ఎత్తుకుని ముగ్గురూ సిద్ధంగా వుండండి. బాగా కండిషన్‌లో వున్న ఒక వ్యాన్ని సెలెక్టు చేయండి. తరవాత దాన్ని యెక్కడో వదిలేద్దాం."

"యస్ బాస్!" అంటూ ఆల్బర్టు విజయోత్సాహంతో వెళ్ళిపోయాడు.

కాళీప్రసాద్ పచార్లు ప్రారంభించాడు. ఆనందం అతన్ని ఒకచోట నుంచోనివ్వడంలేదు. పంట నూర్పిడి పూర్తికావస్తోంది. వండుకుతినడమే తరువాయి! సగం కాలిన సిగార్‌ని తివాచీమీదకి విసిరాడు. ఆల్బర్టుని జ్ఞాపకం చేసుకుంటూ, దాన్ని బూటుకాలితో తొక్కి ఆర్పేసి తీసి పాంటు జేబులో పడేసుకున్నాడు.

# 15

ప్రభంజనం డ్రైవ్ చేస్తున్న కారు కీచుమని శబ్దం చేస్తూ మలుపు తిరిగింది. కొంచెం ముందుకెళ్ళి 114 నెంబరున్న ఇంటిముందు ఆగింది; సడన్ బ్రేకుతో.

ఇగ్నిషన్ కీని జేబులో పడేసుకుని, కిందికి దిగి ఇంటి వేపు చూశాడు.

రెండంతస్తుల భవనం. ఇంటిముందు చిన్న తోట.

గేటు తోసుకుని ప్రభంజనం పూల మొక్కల మధ్య వున్న బాటమీద నడవసాగేడు.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది. వరండా మెట్లెక్కి మూసిన తలుపుముందు, వరండాలో నిలబడ్డాడు. క్షణకాలం తటపటాయించి అతను బెల్ నొక్కాడు. ఇంట్లో ఎక్కడో ఛైమ్స్ రాగయుక్తంగా ధ్వనించింది.

రెండు నిమిషాల తరవాత తలుపు తెరుచుకుంది. పాతికేళ్ళ యువకుడు ప్రశ్నార్థకంగా చూశాడు.

"భరద్వాజగార్ని కల్సుకోవాలి...." అన్నాడు ప్రభంజనం.

"మీరెవరు?" యువకుడు ప్రశ్నించాడు.

"కంప్యూట రిండియా తరఫున ఆయన్ని కల్సుకోడానికి వచ్చాను. పేరు ప్రభంజనం."

"ఆయన్తో మీకు అపాయింట్ మెంటుందా?"

"లేదు. అనుకోకుండా వచ్చాను .... ఆయన వున్నారా?" ప్రభంజనం ప్రశ్నించాడు.

యువకుడు మాట్లాడకుండా వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. అతను మేడమెట్లెక్కుతున్న శబ్దం వినిపిస్తోంది. ప్రభంజనం ఆలోచిస్తూ నిలబడ్డాడు. ఐజీ చెప్పినట్టు ఇద్దరు డిటెక్టివ్స్‌ని తీసుకువచ్చివుంటే బావుండే

దేమో....

రెండు నిమిషాల తరవాత యువకుడు మళ్ళీ గుమ్మంలో ప్రత్యక్షమయ్యాడు. లోపలికి రమ్మన్నాడు. ఎడంచేత్తో గోడవారగా వున్న మెట్లు చూపిస్తూ, "పైకి వెళ్ళండి. రెండో గది. తలుపు తట్టి, లోపలికి వెళ్ళండి...." అన్నాడు.

ప్రభంజనం మెల్లెక్కసాగేడు. తలుపు మూసిన చప్పుడు అతని వెనకనుంచీ వినిపించింది.

ప్రభంజనం తిరిగిచూశాడు. యువకుడు తలుపు దగ్గరగా నిలబడి తననే చూస్తూన్నాడు.

ఒక్కో మెట్టే యెక్కుతూ ప్రభంజనం పైకి చేరుకుని, రెండో గదిముందు ఆగి, తలుపుమీద మెల్లగా వేళ్ళతో తట్టాడు....

# 16

చక్రవర్తి కారుని మెయిన్ రోడ్డుమీంచి కంకర్రోడ్డులోకి మళ్ళించాడు.

కంకర్రోడ్డు గతుకుల మూలంగా కారు పైకీ కిందకి ఆడుతోంది. అతనికి చెమటలు కమ్ముతున్నాయి. స్టీరింగ్ని పట్టుకున్న చేతులు చెమట మూలంగా జారుతున్నాయి. లోపల్లోపల అతను భయపడుతున్నాడు. అన్నిపనుల్నీ అందరికీ పురమాయించడానికి ఏళ్ళతరబడీ అలవాటుపడ్డ అతనికి ప్రమాదకరమైన ఈ కార్యాన్ని కొనసాగించడం అయిష్టంగా, కష్టంగావుంది. ట్రాఫిక్తోడున్న మెయిన్ రోడ్డు వదిలాక ఏదో ఎడారిలో వొంటరిగా ఎక్కడికో పోతున్నట్టుంది అతనికి.

రెండు కిలోమీటర్లు దాటాక కార్ని మరికొంచెం స్లో చేశాడు.

రోడ్డుకి రెండువేపులా దట్టంగా చెట్లూ, పొదలూ వున్నాయి. రోడ్లో వాహనాలమాట అటుంచి, మనుషులు కూడా నడవడంలేదు.

కారు మలుపు తిరిగింది.

ఎదురుగా పెద్ద చెరువు ప్రత్యక్షమైంది. చెరువులో నీళ్ళని చూస్తూంటే అతని కెంకుకో గాభరా పుట్టుకొస్తోంది. తను మూడు కిలోమీటర్లు కంకర్రోడ్డుమీద వచ్చేకాడన్న మాట.

కార్ని మరికొంచెం ముందుకిపోనిచ్చి ఆపి, క్షణకాలం భయంతో అట్లాగే కూచున్నాడు. అతని గుండె దడదడ కొట్టుకుంటోంది. ఎవరొస్తారు? ఎక్కణ్నుంచీ వస్తారు? తనకి అపకారం జరుగుతుందా? అతను ఫోనులో తనకిచ్చిన సూచనలు చెవుల్లో గింగురుమంటున్నాయి.

ధైర్యం తెచ్చుకుని చక్రవర్తి కార్లోంచి కిందకి దిగాడు. ముందుకినడిచి, బోనెట్ ఎత్తి ఇంజన్ని పరీక్షిస్తున్నట్టు చూడసాగేడు. అతని కళ్ళకి ఇంజను కనిపించడంలేదు. చెవులకి చుట్టూ వ్యాపిస్తున్న చిన్న చిన్న శబ్దాలేవీ వినిపించడంలేదు. చెవుల్లో, గుండెలో అతనిమాటలే ప్రతి ధ్వనిస్తున్నాయి....

ఆలోచనల్లో మునిగిన చక్రవర్తి, తన కారు డిక్కీ తెరుచుకున్న శబ్దాన్ని వినలేదు. పిల్లిలా తనవేపు నడుస్తున్న గోపీని చూడలేదు.

గోపీ కారుని ఆనుకుని నడుస్తూ బోనెట్ దగ్గరగా వచ్చాడు.

చక్రవర్తి తన పాత్రని తు. చ. తప్పకుండా పోషిస్తున్నాడు!

గోపీ రివాల్వర్ హేండిల్తో, అమాయకంగా కిందికి

వాలివున్న చక్రవర్తి తల వెనక భాగంలో జాగ్రత్తగా ఒక్క దెబ్బకొట్టాడు; సుత్తితో తబలాని శ్రుతిచేసే విద్వాంసుడిలా. చక్రవర్తి తల ఇంకా కిందికివాలింది. వొరిగిపోతున్న చక్రవర్తి భారీశరీరాన్ని లాక్కెళ్ళి గోపీ వెనకసీటుమీద పడుకోబెట్టాడు.

డిక్కీ తెరిచి, అందులో తను విడిచేసిన బూట్లని తీసి తొడుక్కున్నాడు. వాకీటాకీని అందుకుని కారు డోర్ తెరిచి, సీటుకిందున్న గోనెసంచీని లాగాడు. సూట్ కేస్‌ని తెరిచి, లోపలున్న నోట్లకట్టల్ని మెరిసే కళ్ళతో చూశాడు. అతనిలోంచీ ఆనందం ఊరకలేస్తూ ప్రవహిం చుకొస్తోంది.

సూట్ కేస్‌ని సర్ది, ముందు సీటుమీదకి చేరవేశాడు. చక్రవర్తి నాడిని పరీక్షించాడు. మరో అరగంటదాకా అతను లేవడు! గోపీ వెళ్ళి స్టీరింగ్ ముందు కూచుని, వాకీటాకీని పట్టుకున్నాడు.

"గోపీ కాలింగ్ బాస్!" అన్నాడు రెండుసార్లు.

"యస్, గోపీ! వాట్?" కాళీప్రసాద్ కంఠం ఉద్రేకంతో ప్రశ్నించింది.

"పక్షి పంజరం చేరింది! డబ్బు చేజిక్కింది!" గోపీ ఉత్సాహంగా అరిచాడు.

"ఎక్సలెంట్! వెరీగుడ్! మార్వలస్! గోపీ, ఎక్కడికెళ్ళాలో, ఏంచేయాలో తెలుసుగా?" కాళీప్రసాద్ ఆత్రంగా అడిగాడు. "నీ దగ్గర రేజరుందా?"

"రెండు నిమిషాల్లో నా గెడ్డమూ, మీసాలూ మాయమవుతాయి బాస్!"

"నైస్! మేమూ డిస్సపియర్ అవుతున్నాం....గంటలో 'అక్కడ' కలుసుకుందాం. ప్రొసీడ్! గంగారామ్

కాసేపట్లో గుండాగి చచ్చేలావున్నాడు!"

"ఎవరివాటా వాళ్ళకి దక్కుతుందని గంగారామ్‌కి చెప్పండి బాస్!"

"వోకే. ప్రొసీడ్. వోవర్."

గోపీ కార్ని రివర్స్ చేసి, మెయిన్ రోడ్డువైపు పోనిచ్చాడు. మెయిన్ రోడ్డు రాగానే, కుడివైపుకి తిప్పి, పూనా వైపు స్పీడుగా తోలుకుంటూ పోయాడు. దూరంగా రోడ్ క్రాసింగ్ కనబడుతోంది. కార్ని స్లో చేసి, ఎడంవైపున్న బండి దారిలో కొంచెందూరం పోనిచ్చి, దట్టంగావున్న పొదల మధ్య ఆపేశాడు.

## 17

'కమిన్!' అందో కంఠం గంభీరంగా.

ప్రభంజనం తలుపు తోసుకుని విశాలమైన గదిలోకి అడుగు పెట్టాడు. అతని చూపులు గదంతా పరిశీలించాయి, లిప్తపాటులో.

కిటికీ దగ్గరగావున్న సింక్ ముందు నిలబడి సన్నగా, పొడుగ్గావున్న వ్యక్తి గెడ్డం గీసుకుంటున్నాడు. తలతిప్పి చూసి, "సిడౌన్. క్షణంలో వస్తా," అంటూ మొహం కడుక్కుని, టవల్‌తో తుడుచుకుంటూ ప్రభంజనం ముందుకు నడిచి, ఎదురుగావున్న సోఫాలో కూచున్నాడు.

"కంప్యూటరిండియా కొత్త ఫర్మ్ అనుకుంటా.... ఇంతవరకూ వినలేదు!" అన్నాడు, భరద్వాజ.

"ఆ ఫర్మ్ ఇంకా ప్రొడక్షన్ స్టార్ట్ చేయలేదు. ఎలెక్ట్రానిక్స్ ఎక్స్‌పర్టు అయిన మీతో కొంత డిస్కషన్ చేయాలని వచ్చాను...." అన్నాడు ప్రభంజనం.

"నేను వేరే పనిమీద వెళ్తున్నా. ఏంకావాలో

త్వరగా చెప్పండి," అన్నాడతను.

"జై భారత్ నుంచీ మీరెందుకు రిజైన్ చేశారు?" ప్రభంజనం ప్రశ్నించాడు.

భరద్వాజ సూటిగా చూశాడు. "అది అవసరమా?"

"మీకు అభ్యంతరంలేకపోతే, అవసరమే!" ప్రభంజనం చిన్నగా నవ్వాడు.

"మిస్టర్ ప్రభంజనం, నేను శాస్త్రజ్ఞాణ్ని. మేధస్సును డబ్బూ, అధికారం, పలుకుబడీ కంట్రోల్ చేయడం నేను సహించను. ప్రమోషన్ విషయంలో రాజకీయాలు తల దూర్చాయి. వదిలేశాను. అనువుకాని ప్రదేశంలో అధికులు వుండలేరు!" అన్నాడతను నవ్వుతూ.

"చాలా అర్జెంటు పనిమీద మీ దగ్గరకు వచ్చాను. భరద్వాజగారూ, మీరు ఎప్పుడేనా సోఫిస్టికేటెడ్ ఎలెక్ట్రానిక్ డిజైన్ తయారు చేశారా?"

"ఎలాంటివి?"

"ఉదాహరణకి: ఎక్కడో పెట్టిన బాంబుని బటన్ నొక్కి యాక్టివేట్ చేసేవి," అన్నాడు ప్రభంజనం.

"ఖచ్చితంగా అందుకే కాకపోయినా, అలాంటి ఎలక్ట్రానిక్ కంట్రోల్స్‌ని నేను డిజైన్ చేశాను.... అయినా ఇదంతా మీరెందు కడుగుతున్నారు? కంప్యూటర్ సబ్జెక్టు...."

"చెప్తాను. ఈలోగా రెండు మూడు ప్రశ్నలకి మీరు దయచేసి సమాధానాలు చెప్పాలి. మీలాగా అలాంటి కంట్రోల్స్‌ని మన ప్రాంతంలో ఎవరేనా డిజైన్ చేసిన వాళ్ళున్నారా?" ప్రభంజన్ అడిగాడు.

"మన ప్రాంతంలో లేరు. మనదేశంలో...."

"అడ్డొస్తున్నందుకు క్షమించండి. ఎవరికేనా, ఎప్పు

రేనా ఇలాంటి డివైజ్ ని మీరు తయారుచేసి ఇచ్చారా?"
ప్రభంజనం ప్రశ్నించాడు.

"లేదు. అది చాలా వ్యయంతో కూడినపని. ఈ ప్రశ్నలు ఎందుకు?" భరద్వాజ అసహనంగా అడిగాడు.

"భరద్వాజగారూ, బాంబ్సుని యాక్టివేట్ చేసే ఎలెక్ట్రానిక్ పరికరం సహాయంతో భయంకరమైన నేరాలు జరిగేలావున్నాయి. ముందు జాగ్రత్తగా ఈ పరిశోధన సాగుతోంది. అబద్ధాలాడినందుకు క్షమించండి. కంప్యూటరిండియా పేరు కల్పితం...."

భరద్వాజ ఆశ్చర్యంగా చూశాడు. ప్రభంజనం లేచాడు.

"ఆ డివైస్ కి సంబంధించిన ఫార్ములాని మీరు ఎక్కడేనా పబ్లిష్ చేశారా?" ప్రభంజనం అడిగాడు.

"ఇంతవరకూ లేదు. నా అసిస్టెంట్స్ కి కూడా ఆ ఫార్ములా పూర్తిగా తెలీదు. కానీ...." భరద్వాజ ఆలోచిస్తూ ఆగాడు.

ప్రభంజనం తటాలున కూచున్నాడు. "చెప్పండి. కానీ....?"

"అర్నెల్లక్రితం అనుకుంటా, ఒక రచయిత నన్ను కల్సుకున్నాడు. తను రాయబోయే సైంటిఫిక్ థ్రిల్లర్ కి అవసరమైన ముడిసరుకులో మీరడుగుతున్న ఎలక్ట్రానిక్ డివైజ్ కూడా ఒకటన్నాడు. ఒకానొక పబ్లిషర్ ఆథెంటిక్ గా సైంటిఫిక్ థ్రిల్లర్ రాయడానికి తనని నియమించాడనీ, తనకి తెలీని సైంటిఫిక్ వివరాలు సేకరిస్తున్నాననీ, బాంబ్సుని యాక్టివేట్ చేసే ఎలక్ట్రానిక్ డివైజ్ తయారుచేసే టెక్నికల్ వివరాలు తనకి కావాలనీ అన్నాడు. దాన్ని చేర్చడంవల్ల నవల విలువ పెరుగు

తుందనీ అన్నాడు....”

ప్రభంజనం కుర్చీలో ముందుకి జరిగాడు. “ఆ తరువాత?”

“అతని మాటలు నన్ను ఇంప్రెస్ చేశాయి. మన దేశంలో ఆథెంటిక్ సైంటిఫిక్ ఫిక్షన్ తక్కువగా వుందన్న అతని అభిప్రాయం నిజమే అనిపించింది నాకు. పుస్తకంలో నా సహకారాన్ని పేర్కొంటానన్నాడు. పబ్లిషర్ తనకిచ్చిన అడ్వాన్స్‌లోంచీ వెయ్యినూట పదహార్లు నాకు ప్రజెంట్ చేశాడు. డబ్బుకోసం కాక పోయినా, నా పరిశోధన ఒక రచయితకి, వుపయోగ పడుతుందనుకున్నాను. నోటితో చెప్తే ఫార్ములా అతనికి గుర్తుండదన్నాను. దాన్ని కాగితంమీద పెట్టడానికి వారంరోజులు పట్టుతుందన్నాను. అడ్రస్ రాసి, స్టాంపు అతికించిన కవర్ని ఇచ్చి, అతను వెళ్ళిపోయాడు. నా ఫార్ములాని రాసి వారం తరవాత అతనిచ్చిన కవర్లో పెట్టి పోస్టు చేయించాను....”

ప్రభంజనంలో ఏదో ఆశ, ఆవేశం కట్టలెంచుకుంటు న్నాయి. భరద్వాజ మీద ఏర్పడ్డ అనుమానం కరిగి పోయింది. “అతని పేరూ, అడ్రసూ చెప్పగలరా?”

భరద్వాజ తల అడ్డంగా వూపాడు. “ఏదో పెన్ నేమ్ చెప్పాడు. నవలలు చదివే అలవాటులేని నాకు ఆ పేరు గుర్తులేదు....కానీ కవరుమీద అతను ఏదో పోస్టుబాక్సు నంబరు వేశాడు. ఊరు....విజయవాడ....” ఆలోచనతో భరద్వాజ బొమలు ముడిపడుతున్నాయి.

“ప్రయత్నించండి. గుర్తు చేసుకోండి. ఇది అత్యవసరం!” ప్రభంజనం ఆవేశంతో అన్నాడు.

భరద్వాజ మాట్లాడకుండా టీపాయ్‌మీదున్న డబ్బా లోంచీ సిగరెట్ తీసి వెలిగించాడు. రెండు దమ్ములులాగి పొగ వదిలాడు. ఆలోచన అతని నుదురుమీద గీతలు గీస్తోంది. "పెన్ నేమ్ నాకు గుర్తురావడంలేదు. పోస్టు బాక్సు నంబరు 66, 69, 96, 99—వీటిలో ఏదో వొకటి కావొచ్చు....ఇంతే నేను చెప్పగలను." అన్నాడు మెల్లిగా.

ప్రభంజనం లేచి నిలబడ్డాడు. "థాంక్యూ వెరీమచ్. మీరు చెప్పింది నాకెంతగానో వుపయోగిస్తుంది," అంటూ కరచాలనం కోసం చెయ్యి చాచాడు.

భరద్వాజ కరచాలనం చెయ్యలేదు. తల పైకెత్తి ప్రభంజనాన్ని అనుమానంగా చూశాడు. "ఇంతకీ ఏమిటి దంతా?" ప్రశ్నించాడు.

ప్రభంజనం చిరునవ్వు నవ్వాడు. "భరద్వాజగారూ, మీకంతా చెప్పాలనివుంది. కానీ, నిజంగా—టైమ్ లేదు. రాత్రిలోగా మీకు ఫోన్ చేస్తాను; అంతా చెప్తాను. ఇప్పటికి క్షమించండి. నన్ను నమ్మండి," అన్నాడు.

భరద్వాజ లేచి, అతని చెయ్యిపట్టుకున్నాడు. తీక్షణంగా చూశాడు. "మిస్టర్ ప్రభంజనం మీరెవరు? పోలీస్?"

ప్రభంజనం అతని చూపుల్ని ఎదుర్కొన్నాడు. "కాదు. రిపోర్టర్ని. క్రైమ్‌రిపోర్టర్ని," అన్నాడు చిరునవ్వుతో.

భరద్వాజ అతని చేతిని వదిలేశాడు. "అయామ్ క్యూరియస్. మీ ఫోన్ కాల్ కోసం ఎదురు చూస్తాను," అన్నాడు నవ్వుతూ.

# 18

ఐ.జీ. రామలింగం, పరాంకుశం, శంకర్ ముగ్గురూ ప్రభంజనం కథనాన్ని ఆశ్చర్యంతో విన్నారు.

"విజయవాడ పోస్టల్ సూపరింటెండెంట్ కి ఫోన్ చేయండి. 66, 69, 96, 99 పోస్టుబాక్సులు ఎవరెవరి పేర్లమీద వున్నాయో చెప్పమనండి. మన కేసులో ఇదే ముఖ్యమైన క్లూ కావొచ్చు!" అన్నాడు ప్రభంజనం ఐ.జీ.తో.

ఐ.జీ. టెలిఫోన్ అందుకున్నాడు. ప్రభంజనం టైమ్ చూశాడు ఒంటిగంట దాటింది. "సార్, చక్రవర్తిగారు ఇంటికి చేరుకుని వుండొచ్చు. ఏం జరిగిందో మనకి అర్జెంటుగా తెలియాలి!" అన్నాడు పరాంకుశంతో.

పరాంకుశం ఫోన్ అందుకోబోయాడు. ప్రభంజనం అతన్ని వారించాడు. "టెలిఫోన్ వుపయోగించకండి. మీరే వెళ్ళిరండి," అంటూ కారు తాళాలు ఇచ్చాడు. పరాంకుశం వెళ్ళిపోయాడు.

టెలిఫోన్ సంభాషణ ముగించి, ఐ.జీ. ప్రభంజనం వైపు తలవూపాడు. ప్రభంజనం దగ్గరగా నడిచాడు. "మిస్టర్ ప్రభంజనం. 66,96,99 నంబర్ల పోస్టుబాక్సులు వాలుగేళ్ళగా మూడు వ్యాపార సంస్థల పేర్లతో వున్నాయి, 69 మాత్రం ఫిబ్రవరి 3 నుంచీ ఒక వ్యక్తి పేరుతో వుంది...."

"ఎవరా వ్యక్తి?" ప్రభంజనం అడిగాడు.

"బి. భార్గవరావు, 342, దర్గామిట్ట. మరో విశేషం: ఆ బాక్సుకి ప్రస్తుతం బొత్తిగా ఉత్తరాలు రావడంలేదు. అసలు ఆ వ్యక్తి యిప్పుడు విజయవాడలో వున్నాడో లేడో—అన్న అనుమానం వ్యక్తం చేశారు పోలీసు

అధికారులు" అన్నాడు ఐ.జీ.

ప్రభంజనం సాలోచనగా పచార్లు ప్రారంభించాడు.

"విజయవాడ ఎస్.పి. విజయరామారావుతో మాట్లాడాను. దుర్గామిట్టలో ఆ చిరునామాకి వెళ్ళి ఆ పేరున్న వ్యక్తి, అసలు యెవరేనా వ్యక్తి ఆ యింట్లో వున్నాడేమో రహస్యంగా వాకబు చేయమన్నాను...." అన్నాడు ఐ.జీ.

ప్రభంజనం ఆగాడు. "సార్! అది చాలా, చాలా జాగ్రత్తగా జరగాలి. ఏ మాత్రం పొక్కినా...."

"ఐ.జీ. నవ్వాడు. "డోంట్ వర్రీ! హెల్త్ డిపార్ట్మెంటు వ్యక్తి వెళ్ళి అంతా ఆరాతీస్తాడు!" అంటూ అప్పుడే మోగడం ప్రారంభించిన ఫోన్ని అందుకున్నాడు.

"....స్పీకింగ్ ....ఏమిటి సంగతి?" అన్నాడు అధికారపూర్వకంగా. కాసేపు తల ఆడిస్తూ వింటూ వుండిపోయాడు. రిసీవర్ని పెట్టేసి, ప్రభంజనం వేపు నవ్వుతూ చూశాడు.

"342 ఇల్లు బి. భార్గవరావు అనే వ్యక్తికి అద్దెకియ్యబడింది. ఏడాదిగా అతను ఒంటరిగా ఆ యింట్లో నే వున్నాడు. అంటే, యిల్లు అతని అధీనంలో నే వుంది. నెలలో యే రెండు మూడు రోజులో అతను ఆ ఇంట్లో వుంటాడు. ఎప్పుడొస్తాడో, ఎప్పుడు వెళ్తాడో, అతనేం చేస్తాడో ఎవరికీ తెలీదు. వన్ టౌన్ లో వున్న వోనర్ కి అద్దె టంచన్ గా చెల్లించబడుతోంది...."

ప్రభంజనం కుర్చీలో కూచున్నాడు. ఆలోచిస్తూ, అప్పుడే గదిలోకి వస్తున్న పరాంకుశాన్ని చూశాడు.

"ఏం జరిగింది?" విజీ ఆత్రంగా ప్రశ్నించాడు.

"ముడుపు చెల్లించబడింది. చక్రవర్తిగారి తలమీద బొప్పి కట్టింది. అరగంట పాటు ఆయన స్పృహ లేకుండా కార్లో పడున్నారు. తెలివొచ్చేసరికి, మరోచోట వున్నారు...." పరాంకుశం తనకి చక్రవర్తి వినిపించిందంతా పూసగుచ్చినట్లు వివరించాడు. ప్రభంజనం కళ్ళు మెరిశాయి.

"తిరుపతి సమీపంలో కారు దోపిడీ, ఈ నేరమూ చేసిన వ్యక్తి ఒకడే!" ప్రభంజనం ఉత్సాహంగా అరిచాడు. పరాంకుశం, శంకర్ అదిరిపడ్డారు. విజీ మొహం ప్రశ్నార్థకంగా మారింది.

ప్రభంజనం చిరునవ్వుతో చూస్తూ చెప్పుకుపోయాడు: "మెయిన్ రోడ్డుకి దూరంగా నిర్జన ప్రదేశంలో,— ఖాళీ ప్రదేశంలో కారు ఆగింది. కారు చుట్టూ చాటుగా యేమీలేదు. అయితే పైకం వసూలు చేసుకున్న వ్యక్తి ఎక్కడ్నుంచి వచ్చాడు? చెరువులోంచి తేలివచ్చాడా? ఆకాశంలోంచి వూడిపడ్డాడా? అతను సురక్షితమైన జాగాలో వున్నాడు. చక్రవర్తిగారు కార్లో బయల్దేరే ముందే అతను తెలివిగా కారు డిక్కీలో యిరుక్కుని దాక్కున్నాడు! తనకి తెలీకుండానే చక్రవర్తిగారు నేరస్థుడిని తన కారులో భద్రంగా తీసుకెళ్ళారు."

పరాంకుశం, శంకర్ ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తున్నారు. విజీ తృప్తికరంగా చిరునవ్వు నవ్వుకుంటున్నాడు.

"మనకి అనుమానం రాకుండా వుండటానికి నాలుగు రోడ్లూ కలిసే చోటికి దగ్గరగా అతను కారాపి, అదృశ్యమయ్యాడు!" అన్నాడు ప్రభంజనం.

"అయితే ఇప్పుడు ఏంచేద్దాం? తిరపతి కారు దోపిడీ ఎవరు చేశారో మనకి తెలీదు!" అన్నాడు ఐ.జీ.

"మాస్టర్ మైండ్ అనుమతి లభించేదాకా చక్రవర్తి పబ్లికేషన్స్ అపాయంలోనే వుంటుంది. మనం యింకా యేమీ చేయలేని నిస్సహాయ స్థితిలో వున్నాం...."
ప్రభంజనం మెల్లగా అన్నాడు.

"అతను యెప్పుడు గ్రీన్ సిగ్నలిస్తాడో మనకి తెలీదు...." పరాంకుశం స్వగతంగా చెప్పుకుంటున్నట్టు అన్నాడు.

ఐ.జీ. నవ్వాడు. "అసలు గ్రీన్ సిగ్నల్ యిస్తాడన్న గ్యారెంటీ ఏమిటి? కడుపు నిండాక కాకులు యెగిరి పోతాయ్! సాధారణంగా బ్లాక్ మెయిలర్స్ ఏరుదాటేక తెప్పని తగలేస్తారు. ఎక్కదలుచుకున్న ఎత్తుకి ఎక్కాక నిచ్చెనని తన్నేస్తారు!"

"ఐజీగారు అద్భుతంగా చెప్పారు!" అన్నాడు ప్రభంజనం. "అయితే మనం....యిప్పుడు ఏం చేయాలి....? ఏం చేయాలి?" అంటూ పచార్లు చేయసాగేడు. తటాలున ఆగి, టెలిఫోన్ని అందుకున్నాడు. భరద్వాజ నెంబరు తిప్పాడు. అటువైపున అతను పలికాడు.

"భరద్వాజగారూ, నేను....ప్రభంజనం ...మరొక్క చిన్న ప్రశ్న....మీరు డిజైన్ చేసిన బాంబ్ యాక్టివేటింగ్ డివైజ్ రేంజి యెంతో చెప్పగలరా?" అన్నాడు.

"........ ........ ...."

"థాంక్యూ.... థాంక్యూ....మీతో తరవాత మాట్లాడను. బై బై" అంటూ ఫోన్ పెట్టేశాడు.

తా"ఎలెక్ట్రానిక్ ఎక్స్‌పర్ట్ భరద్వాజ డిజైన్ చేసిన

డివైజ్ రేంజి ఒక కిలోమీటరు. ఎక్స్‌పర్టు నుంచీ తను సంపాయించిన ఫార్ములా ప్రకారం ఒక కిలోమీటరు రేంజి వున్న పరికరాన్ని అతను తయారుచేయించుకున్నాడనో, చేసుకున్నాడనో మనం అనుకోవచ్చు.. ఇరవై లక్షలు చేతిలో పడ్డాక, తన బెదిరింపుని నిజం చేయడం కోసం అతను ఒక కిలోమీటరు రేడియస్‌లో మాటువేసి కూచున్నాడంటే అంత సులభంగా నమ్మలేం" ప్రభంజనం ఐజీని చూస్తూ అన్నాడు.

"యూ హావ్ దే పాయింట్ దేర్!" అన్నాడు ఐజీ.

"సార్! విజయవాడ భార్గవరావుని అర్జెంటుగా మనం కల్సుకోవాలి...."

"తప్పకుండా. ఒక హెలికాప్టర్ మనల్ని విజయవాడలో దింపుతుంది," అంటూ ఐజీ ఫోన్ అందుకున్నాడు.

పరాంకుశాన్నీ, శంకర్నీ, తాము తిరిగొచ్చేదాకా అక్కడే ఫోన్ల ముందు కూచోమన్నాడు ప్రభంజనం. టెలిఫోన్ని పెట్టేసి ఐజీ లేచి నిలుచుని, "లెటస్ స్టార్ట్!" అన్నాడు.

# 19

ఎస్. పి. విజయరామారావు కార్ని మెయిన్ రోడ్డు వారగా ఆపాడు.

వెనుకసీట్లో కూచున్న ఐజీనీ, ప్రభంజనాన్నీ కార్లోనే వుండమని సైగచేసి, కారు దిగి పక్కనే వున్న సందమ్మట నడవసాగేడు. గోచీపోసి కట్టిన పంచ, సిల్కు జుబ్బాలో వున్న విజయరామారావు ఎవరో స్థానిక రాజకీయ నాయకుడిలా వున్నాడు. అతని చేతిలో నల్లటి ప్లాస్టిక్ బాగ్ వుంది.

మలుపు తిరిగి అదృశ్యమైన విజయరామారావు మూడు నిమిషాల్లో తిరిగొస్తూ, సందు మధ్యలో నిలబడి కారు వైపు చెయ్యి వూపాడు.

డోరు తెరుచుకుని ఐజీ, ప్రభంజనం కిందదిగి, సందు లోకి నడిచారు. బ్రౌన్ కలర్ ఫుల్ సూట్ లో వున్న ఐజీ పక్కనే తెల్లటి పాంటూ వర్టు ధరించిన ప్రభంజనం తండ్రితో పాటు పిల్లని చూడ్డానికి వస్తున్న పెళ్ళి కొడుకులా వున్నాడు.

ఇద్దరూ దగ్గరగా వచ్చాక ఎస్.పి. వెనక్కి తిరిగి నడుస్తూ, 'లైన్ క్లియర్!' అన్నాడు తగ్గు స్వరంలో. ముగ్గురూ మలుపు తిరిగారు.

వీధికి దూరంగా విశాలమైన ఖాళీజాగాలో వనగ్గా వున్న 342 నెంబరు ఇంటివేపు నడవసాగేరు. వీధిలో జనం అట్టే లేరు.

ముగ్గురూ రెండంతస్థుల మేడ ముందు ఆగారు. ప్రభంజనం అటూఇటూ చూసి, వరండా మెట్లెక్కాడు, తలుపుకి తాళం వేళ్ళాడుతోంది. వరండా అంతా దుమ్ము నిండివుంది.

ఎస్. పి. స్కెలిటన్ తాళం తెరిచాడు. కీతో తాళం కప్పని అలాగే చేత్తో పట్టుకుని తలుపులు తోస్తూ లోపలికి వెళ్ళాడు. తతిమ్మా యిద్దరూ లోపలికి రాగానే తలుపుల్ని మూసేశాడు.

ఐ.జీ., ఎస్.పి. హాలుని పరీక్షిస్తున్నారు. ప్రభంజనం లోపలికి నడిచాడు.

హాలు మధ్యలో పెద్ద టేబులుంది. దానిమీద నాలు గైదు ప్లేట్లూ, లోటాలూ ఖాళీవిస్కీ సీసాలూవున్నాయి.

ప్రభంజనం ఒక తలుపుని తోసుకుని వంటగదిలో

ప్రవేశించాడు. ఎదురుగా వున్న తలుపుని తెరిచి, పెరట్లోకి చూశాడు. నేలంతా పచ్చగడ్డి తివాచీలా కప్పింది.

ప్రభంజనం పెరట్లోకి దిగి, యింటిని చుట్టేస్తూ, ముందు భాగం చేరుకున్నాడు. ఎవరేనా చూస్తే అనుమానంరాని విధంగా సొంతదారులా నడుస్తూ వరండా మెట్లెక్కి తలుపుకి మునుపట్లా తాళం వేశాడు. వెనక్కి తిరిగి, మళ్ళీ పెరటి తలుపుగుండా యింట్లోకి ప్రవేశించి, తలుపుని యథాప్రకారం మూసి, హాల్లోకి వెళ్ళాడు.

"ఇక్కడ ఏమీలేదు. పైకి వెళ్ళి చూడాలి" అన్నాడు ఎస్.పి.

ప్రభంజనం మెట్లవేపు దారితీశాడు. కాసేపట్లో ముగ్గురూ మేడమీదున్న ఒక తాళంవేసిన తలుపు ముందు నిలబడ్డారు.

స్కెలిటన్ కీతో తాళం తెరిచాడు ఎస్.పి. ముగ్గురూ లోపల ప్రవేశించారు. తలుపు మూసి ప్రభంజనం చిన్న హాలుని కలయజూశాడు.

గోడవారగా మంచం, గది మధ్యలో కర్ర సోఫా, రెండు పేము కుర్చీలూ, టీపాయ్ వున్నాయి. హాలుకి రెండువైపులా రెండు తలుపులున్నాయి. ఒకటి తాళం వేయబడి వుంది. తాళంలేని తలుపుని ప్రభంజనం తెరిచాడు. బాత్‌రూమ్, లావెటరీ.

తలుపుని మూసేసి, తాళం వేసిన గది ముందు ఆగాడు. స్కెలిటన్ కీ మూడో తాళాన్ని కూడా తెరిచింది.

తలుపుల్ని తోసుకుంటూ ప్రభంజనం చిన్న గదిలోకి అడుగుపెట్టాడు. టేబుల్, టేబుల్ వెనుక కుర్చీ వున్నాయి. కుర్చీ వెనుక ఎత్తుగా వున్న కర్ర బీరువా

స్తుంది.

ప్రభంజనం దృష్టి టేబుల్ మీద కేంద్రీకరించబడింది. తెల్ల కాగితాల బొత్తిమీద పేపర్ వెయిట్ గా రింగ్ విరిగిపోయిన పింగాణీ కప్పు బోర్లించబడింది. ఏదో రాయబడిన పేపర్ల చిన్న చిన్న కట్టలు మరో వైపున పెట్టబడ్డాయి. వాటిమీద తుప్పుపట్టిన అలిఘర్ తాళం పేపర్ వెయిట్ డ్యూటీ నిర్వహిస్తోంది.

ప్రభంజనం వ్రాతప్రతుల్ని పరీక్షించాడు. చిన్న చిన్న సాంఘీక కథలూ, గేయాలూ! వాటిమీద ఎర్ర పెన్సిల్ లో వున్న ఇంగ్లీష్ అక్షరం 'ఆర్', అవి తిరస్కరించబడిన రచనలని తెలియచేస్తోంది.

ప్రభంజనం అటువేపు వెళ్ళి టేబుల్ సొరుగుల్ని లాగి చూశాడు. చిత్తుకాగితాలూ, సిరాలేని పాలుగు పేనాలూ వున్నాయి. వెనక్కి తిరిగి బీరువాని చూశాడు. చిన్న తాళం వేళ్ళాడుతోంది. చేత్తో పట్టి బలంగా లాగాడు. ఊహించని విధంగా తాళం చేతిలోకి ఊడొచ్చింది.

తలుపులు తెరిచి, లోపలున్న మూడు అరల్ని చూశాడతను. క్రింది అరలో వివిధ వారపత్రికలూ, మాసపత్రికలూ, ఇంగ్లీష్ క్రైమ్ నవలల్సా వున్నాయి. రెండో అరలో అయిదారు పాంట్లూ, షర్టులూ, స్వెట్టర్ లూ, బనీన్లూ వున్నాయి. పై అరలో టేబుల్ మీద వున్నట్టే పేపర్ల దొంతరలూ, మూడు ఫైల్సూ వున్నాయి.

ఒక ఫైల్లో బి. భార్గవరావుకి వచ్చిన ఉత్తరాలున్నాయి. రెండో ఫైల్లో డజనుకు పైగా కథలకి రాసుకున్న సినాప్సిస్ వున్నాయి. ప్రభంజనం దాన్ని పక్కేసి మూడో ఫైలు అందుకున్నాడు.

మొదటి పేజీ అతన్ని ఆశ్చర్యంతో నింపింది. ఎల్లో

నిక్ డివైజ్ ఫార్ములా! భరద్వాజ టైప్ చేసి పంపిందా?....టైపు చేసిన ఆరు పేజీల్ని తిరగేసి, వాటి కిందవున్న వ్రాతప్రతిని చదవసాగేడతను. భార్గవరావు రచించిన క్రైమ్ నవల: 'అరచేతిలో నరకం!'....

అప్రయత్నంగా ప్రభంజనం విజిల్ వేశాడు. "ఏమిటి?" గుమ్మంలో నిలబడి ఐ.జీ. ప్రశ్నించాడు. ప్రభంజనం వెనక్కి తిరిగి ఆయనవైపు చిరునవ్వుతో చూశాడు.

"ఒక్క క్షణం...." అంటూ, నల్లసిరా పంక్తుల వెంట చూపుల్ని పరుగెత్తించాడు. మొదటి పేజీ అయిపోయింది. రెండో పేజీలో కొంతభాగం చదివి ప్రభంజనం మెరిసే కళ్ళతో ఐ.జీ.ని చూశాడు. ఫైల్ని పట్టుకున్న అతని చేతులు ఉద్రేకంతో కొద్దిగా వణుకుతున్నాయి.

"రావాల్సిన చోటికే వచ్చాం!" అన్నాడు విజయోత్సాహంతో. ఫైల్ని టేబుల్ మీద పెట్టి, బీరువాని యధాప్రకారం మూసేసి తాళాన్ని నొక్కాడు. టేబుల్ మీద పేపర్లని మునుపట్లా సర్దేశాడు. ఫైల్ని తీసుకుని హాల్లోకి నడిచాడు. ఐ. జీ. అతన్ని అద్భుతంగా చూశాడు.

"ఏమిటి ఆధారం?"

ప్రభంజనం వ్రాతప్రతి వున్న ఫైల్ని చేత్తో తట్టాడు. "మన మాస్టర్ మైండ్—భార్గవరావు—ఒక రచయిత. నిజం చెప్పాలంటే భాషకి అర్థం, రచనకి నిర్వచనం తెలీని రచయిత. తన నిశితమైన ఆలోచనల్ని భయంకరమైన భాషలో కాగితాలమీదికి ఎక్కించి, వివిధ పత్రికలకి పంపి, దారుణంగా ఫెయిలయ్యాడు.

ఇది అతను రాసిన సైంటిఫిక్ క్రైమ్ థ్రిల్లర్—

అర చేతిలో నరకం! ఈ నవలలో అతను రూపొందించిన ప్లాట్, చక్రవర్తి సంస్థను బ్లాక్ మెయిల్ చేయడానికి ప్లాన్ గా ఉపయోగించబడింది! నవలలో విలన్ ఎలక్ట్రానిక్ డివైజ్‌తో బ్రాంచ్‌స్ని యాక్టివేట్ చేసి, ఒక పారిశ్రామికవేత్తను దోచుకుంటాడు. ఇది రెండు పేజీల్లోని సినాప్సిస్! ఎలా వుంది?"

"గుడ్ గాడ్!" ఐజీ ఆశ్చర్యంతో చూశాడు.

"ఇన్‌క్రెడిబుల్!" కిటికీని కొద్దిగా తెరిచి మేడ ముందు భాగాన్ని కాపలా కాస్తున్న ఎస్. పి. అన్నాడు.

"త్వరగా, పూర్తిగా చదవండి. ఇట్ విల్ బీ గుడ్ ఎవిడెన్స్!" ఐ.జీ. ఉద్రేకంతో అన్నాడు.

ప్రభంజనం టైమ్ చూశాడు. అయిదు కావస్తోంది. అతను చుక్కల్లా మెరుస్తున్న కళ్ళతో యిద్దరు పోలీసాఫీసర్లనీ చూశాడు.

"భార్గవరావు యిప్పుడు అమలుజరిపిన నేరానికి ఈ నవల వ్రాతప్రతి ఒక బ్లూ ప్రింటు అని అనుకుంటున్నా. ఇంత భారీ యెత్తున నేరం జరిపిన భార్గవరావు లాంటి జిత్తులమారి వ్యక్తి కొంతకాలం పాటు నేరం జరిపిన ప్రాంతానికి దూరంగా, చాలా దూరంగా వెళ్ళిపోడానికి సహజంగా నిర్ణయించుకుంటాడు. వెళ్ళేముందు తనకు సంబంధించిన యే వస్తువునీ, యే సాక్ష్యాన్నీ వదిలి వెళ్ళకుండా జాగ్రత్తపడతాడు...."

"దటీస్ నాచురల్ ఫర్ ఏ క్రిమినల్!" ఐ. జీ. అన్నాడు.

"అయితే మిస్టర్ ప్రభంజనం, అతను యిప్పుడు, యివాళ యిక్కడికి వస్తాడంటావా?" అని అడిగాడు

ప్రభంజనం చిరునవ్వు నవ్వాడు. "నేనే అతనవుతే, యెప్పుడో యిక్కడికి చేరుకునేవాణ్ని! అతను తన వాటా పంచుకొని యిక్కడికి వస్తాడనే నా ఆశ!"

"ఏం చేద్దాం?" ఐజీ ఆత్రంగా అడిగాడు.

"అతను తనని ఆశ్చర్యపరిచే పరిస్థితులు ఎదురవకుండా చాలా తెలివిగా అంతా ప్లాన్ చేశాడు. అతన్ని మనం సర్‌ప్రైజ్ చేయాలి .... మనిద్దరం బాత్‌రూమ్‌లో దాక్కుందాం. ఎస్. పి. గారు బైట తాళం వేసి, డాబా మీద నక్కి కూచుని అతని రాక కోసం చూస్తారు...."

"విజయరామారావ్, యెవరేనా సరే—ఈ యింటి తాళం తెరిస్తే, డాబామీద రివాల్వర్ పిడితో మూడు సార్లు శబ్దం చెయ్. నౌ ప్రొసీడ్" అన్నాడు అధికార పూర్వకంగా.

"యెస్, సర్!" అంటూ ఎస్.పి. కిటికీని మూసేసి బైటికి వెళ్ళాడు. కాసేపట్లో తాళం క్లిక్కుమంది. దూరంగా వెళ్తున్న అతని అడుగుల చప్పుడు వినిపించింది.

ప్రభంజనం గదికి తాళం వేశాడు. గదిలో తమ ఆనవాలు లేకుండా చూసి, బాత్‌రూమ్‌వేపు నడిచాడు. ఐ.జీ. అతన్ని వెంబడించాడు.

## 20

బాత్‌రూమలో ఒక మూలవున్న డీల్‌వుడ్ బాక్సు మీద ఐ.జీ. కూచున్నాడు. వెలుగొస్తున్న వెంటిలేటర్‌కి దగ్గరగా గోడకి జార్లాబడి, భార్గవరావు సైంటిఫిక్ థ్రిల్లర్‌ని ప్రభంజనం గబగబా చదవసాగేడు.

భార్గవరావు బొత్తిగా పనికిమాలిన రచయిత—అని నిరూపిస్తోంది స్క్రిప్టు. ముఖ్యమైన అంశాల్ని గబగబా ఏరేస్తున్నాయి ప్రభంజనం కళ్ళు. పేజీలు తిరిగేకొద్దీ నవలలోని ప్లాట్ అత్యద్భుతంగా ప్రాక్టికల్ గా అమలు జరుపబడిందన్న నిర్ణయం అతనిలో బలపడసాగింది.

చీకటిపడుతోంది. చదవడం పూర్తయింది. విలన్ తన ప్లాన్ ని సాధించి, తప్పించుకున్నాడు. అతను మరికొన్ని నేరాలు చేస్తాడనీ, భవిష్యత్తులో తమ వలలో చిక్కుతాడనీ పోలీసులు అనుకున్నారు. ఆ విలన్ చేసే మరికొన్ని అడ్వెంచర్స్ని వరసగా పాఠకులకి అందించే సూచన చేశాడు రచయిత!

"ఇదే అది! ఇది బ్లూప్రింట్; అది ప్రాక్టికల్ వర్క్! ఊర్లూ పేర్లూ తప్ప రెండూ ఒకటే! రచయితగా ఫెయిలైన భార్గవరావు, అడ్డదారి తొక్కాడు!" అన్నాడు ప్రభంజనం. పూర్తిగా చీకటిపడింది. లైటు వేసే అవకాశంలేదు.

"ఇంకా ఎంత సేపు ఈ నిరీక్షణ?" ఐజీ మెల్లిగా అడిగాడు. ఆయన కంఠంలో విసుగు ధ్వనించింది.

"ఎదురు చూసిన వ్యక్తి ఎదుట నిలబడేదాకా!" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

"అసలతను వస్తాడా? మిస్టర్ ప్రభంజనం, ఎగిరిపోయిన పక్షికోసం మనం ఇక్కడ వలవేసి కూచున్నామా?" ఐజీ సంశయంతో అడిగాడు.

"అతను చాకులాంటివాడు. ఈ నవల ప్లాటుని యథాతథంగా ఉపయోగించుకున్నాడు. ఇది అతని స్టేట్ మెంట్! జిత్తులమారి నక్కలాంటి అతను దీన్ని గురించి మరిచిపోతాడంటే నేను నమ్మను...." ప్రభంజనం అటూలున ఆపి, చెవులురిక్కిం

చాకు.

తమ పైన, కప్పుమీద టకటక శబ్దం చేయబడింది. మరు క్షణం విజీ చెయ్యి అతని భుజాన్ని నొక్కింది, చీకట్లో. ఇద్దరు ఊపిరి బిగబట్టారు.

క్షణాలు గడుస్తున్నాయి. మెల్లెక్కుతున్న శబ్దం దగ్గరవుతోంది. రెండుక్షణాల్లో అడుగులచప్పుడు గుమ్మం ముందు ఆగింది. తాళం తీస్తున్న చప్పుడు. తలుపు తెరవ బడింది. అడుగుల శబ్దం లోపలికి ప్రవేశించింది. తలుపు మూసిన చప్పుడు. హాల్లో లైటు వెలిగింది. మరో తలుపు తెరుస్తున్న చప్పుడు.

ప్రభంజనం చెయ్యి విజీ చేతిని నొక్కి, లాగింది. ఇద్దరో బాత్ రూం తలుపు వెనక నించున్నారు. ప్రభం జనం తలుపుని అరంగుళం తెరిచి, చూశాడు. హాల్లో ఎవరూ లేరు. తలుపుని ఇంకొంచెం తెరిచాడు. గదిలో బీరువా తలుపు కిర్రుమంటూ చప్పుడుచేసింది.

తలుపుని పూర్తిగా తెరిచి ప్రభంజనం హాల్లోకి అడుగు వేశాడు. మంచంమీద నల్లటి సూట్ కేసు పెట్టబడింది. విజీ అతని పక్కనే పిల్లిలా అడుగులేస్తున్నాడు. క్షణంలో ఇద్దరూ గది గుమ్మంలో నిలబడ్డారు. అతని వీపు వాళ్ళకి కనిపిస్తోంది.

బీరువాముందు నిలబడి గబగబా దేనికోసమో వెతుకు తున్నాడతను. పాంటు, షర్ట్ లో సన్నగా పాడుగ్గా వున్నాడతను. అడ్డొచ్చిన పేపర్లనీ, పుస్తకాల్ని విసుగ్గా పక్కకి తోస్తూ అతను తొందరగా వెతుకుతున్నాడు. అతను దేనికోసం వెతుకుతున్నాడో ప్రభంజనానికి తెలుసు....

"భార్గవరావ్, నువ్వు వెతికే వస్తువు ఇక్కడుంది!"

అన్నాడు మెల్లిగా.

భార్గవరావ్ పక్కలో పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాడు. మెరుపులా వెనక్కి తిరిగాడు. పాము పడగలా తిరిగిన అతని వేగం ప్రభంజనాన్ని ఆశ్చర్యంతో నింపింది.

అతని చెయ్యి ఎప్పుడు జేబులోకి వెళ్ళిందో ప్రభంజనం చూడలేదు కానీ, అతను పూర్తిగా తిరిగేసరికి అతని కుడి చేతిలో పదునైన కత్తి తళుక్కుమంది. అతని ఎర్రటి కళ్ళు, ఆశ్చర్యంతో, కోపంతో చూస్తున్నాయి.

ప్రభంజనం చేతిలోని ఫైలుమీద అతని దృష్టి పడింది. క్షణంపాటు ఆ కళ్ళల్లో ఏదో ఆందోళన కనిపించి మాయ మైంది. కత్తిని పట్టుకున్న అతని కుడిచెయ్యి పైకిలేచింది.

"భార్గవరావ్, కత్తిని పడేయ్. కదలకుండా నుంచో!" ఐ.జీ. కంఠం భయంకరాలా ధ్వనించింది.

భార్గవరావు నిర్లక్ష్యంగా కత్తి విసిరాడు ప్రభం జనం తటాలున పక్కకి జరిగాడు. అదేక్షణంలో ఐజీ చేతిలోని రివాల్వర్ పేలింది. కత్తిని పూర్తిగా వదిలే లోపలే, రివాల్వర్ తూటా భార్గవరావు మణికట్టులో దూరింది. కత్తి గురితప్పి గోడకి తగిలి, శబ్దం చేస్తూ కింద పడింది.

అతని మణికట్టు గక్కసిక్తంగా వుంది. బోనులో ఇరు క్కున్న పులిలా అతను ఆగ్రహంతో తల కిందికి వాల్చి పొట్టేలులా ముందుకి దూసుకొచ్చాడు. పక్కకి జరిగి, వంగి, బుల్లెట్ తగిలిన అతని చేతిని ప్రభంజనం గట్టిగా పట్టుకున్నాడు. అసంకల్పితంగా అతను కెవ్వుమన్నాడు. అతని ఎడంచెయ్యి ప్రభంజనం గొంతుని పట్టుకోడానికి తంటాలుపడుతోంది. ఐజీ రివాల్వర్ పిడి, అతని తలమీద సుత్తిలా దిగింది. భార్గవరావు నేలమీద పడిపోయాడు.

రెండు చేతులకి బేడీలువేయబడ్డ భార్గవరావు, ఉరఫ్ కాళీప్రసాద్ కుర్చీలో కూచున్నాడు. అతని మొహం మీద రక్తం చారలుగా కారుతోంది. మణికట్టు, అర చెయ్యి రక్తంలో ముంచినట్టున్నాయి.

ఎస్.పి., భార్గవరావు జేబులోంచిలాగిన జేబురుమాల్ని మణికట్టు చుట్టూ చుట్టాడు.

తెరిచిన సూట్‌కేస్‌ని మధ్య వుంచుకుని ఐజీ, ప్రభంజనం మంచంమీద కూచున్నారు. పైనున్న కవర్ని ప్రభంజనం తెరిచాడు. హోం మినిస్టర్‌కి సంబంధించిన ఫోటోలూ, రిపోర్టులూ! వాటిని ఐజీకి అందించాడు.

సూట్‌కేస్‌లోంచీ నోట్లకట్టలు తొంగిచూస్తున్నాయి. నోట్లకట్టల మధ్య రివాల్వర్ ఇరికించబడింది.

ఐజీ జేబురుమాల్తో దాన్ని పైకితీశాడు. రివాల్వర్ కింద, నోట్లదొరసల మధ్య, ఎలక్ట్రానిక్ డివైజ్, భార్గవరావు రక్తంలా ఎర్రగా మెరుస్తోంది. రివాల్వర్‌నీ, కవర్నీ మళ్ళీ సూట్‌కేస్‌లో పెట్టి మూసేశాడు ఐజీ.

ప్రభంజనం లేచి నిలబడి, భార్గవరావువైపు తదేకంగా చూశాడు. భార్గవరావు కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. వాటిలో భయంలేదు. మొదటిసారిగా బోనులోకి తోయబడిన రుద్రసింహంలా వున్నాడతను.

"భార్గవరావ్, నీ తెలివిని భాష నేర్చుకోడానికి వుపయోగించి వుంటే మంచి డిటెక్టివ్ రచయిత అయివుండేవాడివి!" అన్నాడు ప్రభంజనం నవ్వుతూ.

భార్గవరావు పళ్ళుకొరికాడు. తనను పట్టుకున్న వాళ్ళందర్నీ హత్యచేయాలన్న వాంఛతో అతని కళ్ళు ఇంకా ఎర్రగా అయ్యాయి.

"విజయరామారావ్, ఈ గదిలోని ప్రతి పూచిక

పుల్లా మనకి కావాలి" అన్నాడు ఐజీ.

"యస్సర్ .... అరగంటలో అన్నీ మన చేతుల్లోకి వస్తాయి సార్" అన్నాడు ఎస్.పి.

## 21

ఐ.జీ. రామలింగం విజయవాడలో జరిగిందంతా హోమ్ మినిస్టర్ దయానిధికి వివరించాడు.

"తన అనుచరులున్న గూటి అడ్రసు భార్గవరావు అని గిన వెంటనే చెప్పేశాడు. దోచుకున్న డబ్బుని అనుభ వించే అవకాశం తనికి లేనప్పుడు వాళ్ళకి మాత్రం ఎందు కుండాలనుకున్నట్టున్నాడు. తనకి లేని స్వాతంత్ర్యం అదృష్టం వాళ్ళకెందుకు? వాళ్ళందరూ దొరికిపోయారు. భార్గవరావు దగ్గర దొరకగా మిగిలింది వాళ్ళదగ్గరుంది! పదివేలు తక్కువగా.

చక్రవర్తి ఎస్టేట్స్‌లో ప్లాంట్ చేసిన బాంబుని మా ఎక్స్‌పర్ట్స్ స్వాధీనం చేసుకున్నారు. రెండు పెట్రోల్ బంక్స్‌, తిరుపతి సమీపంలో కారు దోపిడినీ చేసింది తనే అని భార్గవరావు ఒప్పుకున్నాడు. ప్రభంజనం ఆలోచ నలూ, పరిశోధన ప్రారంభంనుంచీ సరైన మార్గంలో నడి చాయి. రహస్యాన్ని అతిసులభంగా, తెలివిగా కనిపెట్టా డతను" అన్నాడు ఐజీ తన కథనం ముగిస్తూ.

హోటల్ ప్రెసిడెంట్ గదిలో పబ్లిషర్ చక్రవర్తి, పరాంకుశం, శంకర్, విజయవాడ ఎస్.పి. విజయరామా రావు ప్రభంజనం వున్నారు. ఐజీ చెప్పిందాన్ని అందరూ సంతోషంగా విన్నారు.

"ప్రభంజనం మనపరువు నిలబెట్టాడు. అతన్ని మెచ్చు కుంటున్నా" అన్నాడు దయానిధి.

"థాంక్యూ సార్. ఐజీగారూ, విజయరామారావు

గారూ, శంకర్ గారూ ఎంతో సహకరించారు."

"ప్రభంజనం, ఆ యాక్టివేటింగ్ డివైజ్ అతనికి ఆఖరు నిమిషంలో చిక్కివుంటే...." చక్రవర్తి అన్నాడు.

ప్రభంజనం చిరునవ్వు నవ్వాడు.

"ఏమీ అయ్యేదికాదు! బాంబ్స్‌నుండీ ఒక కిలో మీటరు దాటిన మరుక్షణం అది పనికి రాకుండాపోతుంది. భరద్వాజతో చర్చించాక ఆ నమ్మకం నాలో కలిగింది. అందుకే అతని గ్రీన్ సిగ్నల్ గురించి ఆలోచించకుండా రంగంలోకి ధైర్యంగా దూకాము!" అంటూ ప్రభంజనం తన ముందున్న బ్రీఫ్‌కేస్‌ని తెరిచి, ఒక పొడుగాటి కవర్ని ఇవతలకి తీశాడు. "ఇది మీది!" అంటూ దయానిధికి అందించాడు.

దయానిధి కవర్ని అందుకున్నాడు. తెరవకుండా దాన్ని అలాగే ఎడిటర్ పరాంకుశం వేపు విసిరాడు. "నాదికాదు. కష్టపడి సంపాదించిన సంపాదకుడిది!" అన్నాడు నవ్వుతూ. క్షణంలో అతని మొహం గంభీరంగా తయారైంది.

"మిస్టర్ ఎడిటర్, నా వ్యక్తిగత జీవితాన్ని, ఎవరితోనూ సంబంధం లేకుండా నాలుగ్గోడల మధ్య—జరిగే నా ఆంతరంగిక వ్యవహారాల్ని దండోరా వేస్తానంటే నేను వద్దనను. హోమ్ మినిస్టర్ వేరు, దయానిధి వేరు! అందరికీ కనిపించే మొహం ద్వారా కాకుండా, ఎవ్వరికీ కనిపించని చోటవుండే చిన్న పుట్టుమచ్చ ద్వారా నన్ను గుర్తించాలని నీ పత్రికలూ, ప్రజలూ అనుకుంటే నేను కాదనను! యూ•కెన్ గో ఎ హెడ్!"

ఎడిటర్ పరాంకుశం ఇబ్బందిగా కదిలి, నిస్సహాయంగా చక్రవర్తి వైపు చూశాడు. చక్రవర్తి ఏం చెప్పాలా అని

ఆలోచిస్తున్నాడు.

ప్రభంజనం పైకి లేచాడు. పరాంకుశం చేతిలోని కవర్ని మెల్లిగా తీసుకున్నాడు. జేబులోంచీ సిగరెట్ లైటర్ తీసి వెలిగించి, మంటను కవర్ కింద పెట్టాడు. క్షణాల్లో కవరు కాలి బూడిదై పోయింది. రాలి పోతున్న బూడిద కిందకి ఖాళీ ట్రేని జరిపాడు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. బూడిదని సింక్ లో పడేసి నీళ్ళువదిలి, ప్రభంజనం నవ్వుతూ చూశాడు.

చక్రవర్తి నవ్వు గదిలో ప్రతిధ్వనించింది. క్షణంలో అందరూ శృతికలిపారు. దయానిధి చిరునవ్వుతో చూస్తున్నాడు. ఐజీ వొంగి దయానిధి చెవిలో ఏదో చెప్పాడు.

"నా రాష్ట్రంలో, అన్నింటికీ తెగించిన దోపిడీ ముఠాను అతి తక్కువ వ్యవధిలో పట్టి, అప్పజెప్పినందుకు పోలీసుశాఖ తరఫున, రిపోర్టర్ ప్రభంజనంకి పాతిక వేల రూపాయల బహుమతి ప్రకటించడానికి ఎంతో సంతోషిస్తున్నా!" అన్నాడు దయానిధి. అందరూ చప్పట్లుకొట్టారు.

చక్రవర్తి లేచి నిలబడ్డాడు. "మా ప్రభంజనంకి మా చక్రవర్తి పబ్లికేషన్స్ పాతిక వేల రూపాయల అవార్డు ఇస్తుంది!" అన్నాడు సగర్వంగా.

అందరూ మళ్ళీ చప్పట్లు చరిచారు.

—:అ యి పో యి ం ది:—

# నాగుల కొండ

## సుంకరి రాంప్రసాద్

విశాఖ మునిసిపల్ స్టేడియం ఆరోజు వచ్చేపోయే జనాలతో క్రిక్కిరిసి వుంది.

ముప్పయి రోజులుగా ప్రదర్శింపబడుతున్న 'స్నేక్ ఎగ్జిబిషన్'కు అదే ఆఖరిరోజు.

ఎగ్జిబిషన్‌లోని గ్లాస్ సెల్ చుట్టూ గుమిగూడసాగారు ప్రేక్షకులు.

ఆ గ్లాస్ సెల్‌లో సుమారు రెండువందల దాకా వివిధ రకాల విషసర్పాలు వున్నాయి. ఆ గ్లాస్ సెల్‌లో గత ముప్పయిరోజులుగా వాటి మధ్యే తిరుగుతూ ఆ విషసర్పాలతోనే వుంటున్నాడు రాంబాబు. అప్పటికే రాష్ట్రంలోని ఎన్నో ముఖ్యపట్టణాలలో ప్రదర్శనలిచ్చుకుంటూ విశాఖపట్టణం వచ్చాడు. విశాఖలో కూడా అతనికి మంచి ఆదరణే లభించింది.

ఒక్కసారిగా అన్ని పాములను ఒకే స్థలంలో చూడటానికే భయం వేయసాగింది కొందరు ప్రేక్షకులకు.

కొన్ని పాములు జర జరా ప్రాకుతో నాలుగుమూలలా తిరుగుతున్నాయి. కొన్ని తోకలమీద లేచి పడగలువిప్పి బుసలు కొడుతున్నాయి. అన్ని విషసర్పాల మధ్య హాయిగా తిరుగాడుతున్న రాంబాబును చూస్తుంటే వారికెంతో ఆశ్చర్యంగా వుంది.

రాంబాబు బూటుమీద గుండా అతని కాలిమీదకు నెమ్మదిగా ప్రాకసాగింది ఒక కట్లపాము. తన చేతిలోని వంకీ కర్రతో లాఘవంగా ఆ కట్లపామునుతీసి దూరంగా విసిరేసాడు రాంబాబు.

ఆ అదటుకు అంతవరకూ స్తబ్దంగా ఒకమూల చుట్టలు చుట్టుకొని పడుకునివున్న నల్లత్రాచు ఛివాలున తల పైకెత్తింది. పడగవిప్పి, ముందూ, వెనుకలకు ఊగుతూ ఆ నల్లత్రాచు బుసలుకొడుతుంటే .... ప్రేక్షకులు ఊపిరి తీయడం కూడా మరచిపోయి ఆ త్రాచునే చూడసాగారు.

రాంబాబు మాత్రం నిర్భయంగా అలాగే నిలుచుని వున్నాడు. తనను సమీపిస్తున్న ఒక్కొక్క పామును సున్నితంగా తన చేతిలోని వంకీ కర్రతో దూరంగా త్రోసివేస్తున్నాడు. అతని చూపులు సునిశితంగా వున్నాయి.

కొందరు ప్రేక్షకులు అసహనంగా తమ వాచీలవంక చూడసాగారు. ఐదు గంటలు కావడానికి యింకా ఐదు నిముషాలు ఉంది. సరిగ్గా ఐదు గంటలకు రాంబాబు ఆ గ్లాస్ కేస్‌లో నుండి పైకి వస్తాడు. అంతటితో ఆ స్నేక్ ఎగ్జిబిషన్ పూర్తి అవుతుంది.

ఇదే చివరి అవకాశమన్నట్లు ఆ వివిధ రకాల సర్పాలను అపురూపంగా చూస్తున్నారు ప్రేక్షకులు. కాని

ఒకేఒక వ్యక్తి మాత్రం ఏకాగ్రతతో రాంబాబునే చూస్తున్నాడు.

అతడు గత పదిరోజులుగా ప్రతిరోజూ సాయంత్రం సరిగ్గా నాల్గింటికి ఆ ఎగ్జిబిషన్‌కి వస్తున్నాడు. గ్లాస్ సెల్‌లోని రాంబాంబు ప్రతి కదలికనూ ఎంతో శ్రద్ధగా గమనిస్తున్నాడు.

అయితే విచిత్రం యేమిటంటే తను రాంబాబును గత పదిరోజులుగా పరిశీలిస్తున్న విషయం రాంబాబు తెలుసు కున్నాడనీ అప్పటి నుండి రాంబాబు కూడా తనను గమ నిస్తున్నాడనీ ఆ వ్యక్తికి తెలియదు.

ఆ రోజు రాత్రి ఎగ్జిబిషన్ క్లోజ్ చేశాక రాంబాబు వెంటపడి వచ్చాడు ఆ వ్యక్తి.

"నా పేరు ప్రసాదరావు" స్నేహపూర్వకంగా చేయి చాస్తూ అన్నాడు ఆ వ్యక్తి. రాంబాబు ఆశ్చర్యంతో అతనితో చేయి కలిపాడు.

"మీరు పదిరోజులుగా ఎగ్జిబిషన్‌కు వస్తున్నారు. నన్నే యెంతో శ్రద్ధగా గమనిస్తున్నారు. ఇప్పుడు చీకటి పడ్డాక, అందరూ వెళ్ళిపోయాక నా కోసం వచ్చా రంటే....మీరు నా నుండి యేదో ఆశిస్తున్నారు. ఏమి టది?" ఆ వ్యక్తి కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు రాంబాబు.

ఇప్పుడు ఆశ్చర్యపడటం ప్రసాదరావు వంతు అయింది. ఊహించని ఆ ప్రశ్నకు ఒక్కసారిగా తడబడ్డాడు. కాని ఆ తడబాటు కేవలం ఒక్కక్షణం. అంతే! మరుక్షణంలో తేరుకొని—మళ్ళీ మామూలుగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు ప్రసాదరావు.

"మీతో ఒంటరిగా కొన్నివిషయాలు మాట్లాడాలి!"

ఒక్కసారి ప్రసాదరావువంక సాలోచనగా చూశాడు రాంబాబు. తరువాత తనతో 'లోపలికి రమ్మన్నట్లు' తల పంకించి టెంట్ లోనికి నడిచాడు. రాంబాబును అనుసరించాడు ప్రసాదరావు.

## 2

ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మార్షల్ ఆర్ట్స్ మూడవ వార్షికోత్సవం... పోలీస్ గ్రౌండ్స్‌లో యేర్పాటు చేయబడింది. విశాఖనగర మేయర్ సాధూభూషణరావు ఆ వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించారు. సాధారణ కార్యక్రమాలు ముగిశాక ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు కరాటేలో తమకున్న ప్రావీణ్యాన్ని ప్రదర్శించారు.

చివరి అంశం ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపల్ కమ్ ఇన్‌స్ట్రుక్టర్ అయిన చంద్రం ప్రదర్శన. చంద్రం కరాటేలో బ్లాక్ బెల్టు హోల్డర్. జపాన్‌లో కరాటే, కుంగ్ ఫూలలో శిక్షణ పొందిన వ్యక్తి.

చంద్రం వేదికమీదకు వచ్చాడు. పదిహేను అడుగుల పొడవు, పది అడుగుల వెడల్పులతో నిర్మింపబడ్డ విశాలమైన వేదిక అది. మార్షల్ ఆర్ట్స్ ప్రదర్శన కోసం ప్రత్యేకంగా నిర్మింపబడింది.

వేదికమీదకు పదిమంది దృఢకాయులు ప్రవేశించారు. వారి చేతులలో వివిధ రకాల ఆయుధాలు దేదీప్యమానంగా వెలుగుతున్న విద్యుద్దీపాల కాంతిలో తళ, తళ మెరుస్తున్నాయి. వారు చంద్రం చుట్టూ వలయంలా ఏర్పడ్డారు. చంద్రం చేతిలో కేవలం రెండు కర్రలు ఉన్నాయి. అవి ఒక్కొక్కటి సుమారు మూడు అడుగుల పొడవు ఉంటాయి. చంద్రం ఒక్కసారి తన చుట్టూ ఉన్నవారిని పరికించాడు.

కేవలం రెండు.... మూడు సెకన్లు.

అంతే....!!

మరుక్షణం....భయంకరమైన 'కరాటే షౌట్స్‌తో' ఆ ప్రాంగణం మార్మోగసాగింది. చంద్రం చేతులలో ఆ స్టిక్స్ మెరుపు తీగల్లా కదలసాగాయి.

చంద్రం అద్భుతమైన పోరాటం...అతడు చూపిన ప్రావీణ్యం ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేశాయి. చప్పట్లతో, హర్షధ్వానాలతో ఆ ప్రదేశం అంతా కొన్ని నిముషాలపాటు మార్మోగిపోయింది.

ఫంక్షన్ పూర్తయింది.

ఫంక్షన్‌కు వచ్చినవారంతా ఇంటిముఖం పట్టసాగారు. ముఖ్య అతిథుల్ని గేటువరకూ సాగనంపి స్టేజి దగ్గరకు వచ్చాడు చంద్రం. మైకులు, లైటింగ్ ఎక్విప్మెంట్, కర్టెన్స్ తీయించడంలో హడావుడిగా తిరుగుతున్నారు కొద్దిమంది ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు.

'కంగ్రాచ్యులేషన్స్....!'

అన్న మాటలు వినిపించి చివుక్కున వెనక్కి తిరిగాడు చంద్రం. ఎదురుగా యెవరో ఒక అపరిచితుడు.

"థాంక్యూ!!" అంటూ చిన్నగా నవ్వి, "మీరు...." అంటూ అర్ధోక్తిలో ఆగిపోయాడు చంద్రం ఆ వ్యక్తి వంకే పరిశీలనగా చూస్తూ.

"నా పేరు ప్రసాదరావు. మీ ప్రదర్శన నిజంగా అద్భుతంగా ఉంది. కాకుంటే ఒక్క సందేహం. అడగమంటారా?" చంద్రం కళ్ళల్లోకే సూటిగా చూస్తూ అడిగాడు ఆ వ్యక్తి.

'అడగమన్నట్లు' చిన్నగా తలాడించాడు చంద్రం.

"మీరు యింతకు క్రితం యిచ్చినది ప్రదర్శన. ఒకవేళ

మీ నిజ జీవితంలో కూడా పదినుంచి దుండగులు ఆయు ధాలతో మీ పైన దాడి చేస్తే మీరు వాళ్ళను యెదు ర్కొనగలరా?"

చంద్రం ఒక్కక్షణం ఆ వ్యక్తివంకే సూటిగా చూశాడు. "తప్పకుండా ఎదుర్కొనగలను ప్రసాద రావుగారూ. కరాటే, కుంగ్ ఫూ....విద్యలలోని గొప్ప తనం అదే" చంద్రం గొంతు గర్వంగా పలికింది.

వింటున్న ప్రసాదరావు కళ్ళు యేదో వింత కాంతితో మెరిశాయి. కొన్ని సెకన్లు వారిద్దరి మధ్యా మౌనంగా దొర్లిపోయాయి.

"మీతో కొన్ని విషయాలు ఒంటరిగా మాట్లాడాలి' చంద్రంవంకే సాలోచనగా చూస్తూ అన్నాడు ప్రసాద రావు.

ప్రసాదరావువంక ఆశ్చర్యంగా చూశాడు చంద్రం. ప్రసాదరావెవరో తనకు తెలియదు. ఇంతవరకూ అతన్ని యెక్కడా కనీసం చూడలేదు. ఇదే మొదటి పరిచయం. మరి తనతో యేకాంతంగా మాట్లాడాల్సిన విషయాలు అతనికి యేం ఉంటాయి చెప్మా!

చంద్రంఆలోచనలను భంగపరుస్తూ మళ్ళీ ప్రసాదరావే అన్నాడు. "పోనీ రేపు సాయంత్రం ఆరింటికి వస్తాను."

'సరే!' అన్నట్లు అప్రయత్నంగా తలూపాడు చంద్రం.

## 3

కన్నారావు ఎక్స్ సర్వీస్ మాన్.

ఆర్మీ నుండి వచ్చేశాక తన స్వగ్రామమైన 'బొబ్బిలి' లోనే ఉంటూ పిత్రార్జితమైన రెండెకరాల మాగాణిని సాగుచేస్తూ జీవిస్తున్నాడు. ఆపైన ప్రభుత్వంవారు

యిచ్చిన ఐదెకరాల బంజరు ఉంది. ఈమధ్యే అందులో జీడిమామిడి, సరుగుడు మొక్కలు వేశాడు. జీవితం ఏ చీకూ చింతా లేకుండా హాయిగా గడిచిపోతుంది కన్నారావుకు.

ప్రసాదరావు, కన్నారావు మంచి స్నేహితులు.

ప్రసాదరావు ఫారెస్టు ఆఫీసరుగా పనిచేసే రోజులలో....ప్రసాదరావుతో పాటు వేటకు వెళ్తూండేవాడు కన్నారావు. కన్నారావు ఎక్స్‌పర్టు షూటర్. ఎంత దూరంలో ఉన్న జంతువునైనా అవలీలగా షూట్ చేసేవాడు. ఎంతయినా మిలటరీ సోల్జర్ కదా!

కన్నారావులో యింకా కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. దూరంలో ఉండగానే జంతువుల వాసనలు పసిగట్టేవాడు. ఆకులమీద మెత్తగా పడే జంతువుల అడుగుల చప్పుడునుబట్టి అదే జంతువో ఖచ్చితంగా చెప్ప గలిగేవాడు. అతనివి పాము చెవులు. చీమ చిటుక్కు మన్నా అతనికి వినిపిస్తూంది. చిమ్మచీకటిలో సైతం అతడు వస్తున్న ఆకారాలను కనిపెట్టగలడు.

"నీవు అడవిలో చిరుతపులివై పుట్టాల్సిందిరా!" అని అంటూండేవాడు ప్రసాదరావు కన్నారావును మెచ్చుకోలుగా చూస్తూ. అసలు కన్నారావు లేకుండే వేటకే వెళ్ళేవాడు కాదు ప్రసాదరావు. వారిద్దరి మధ్యా స్నేహం అలాంటిది.

ఆ రోజు కన్నారావు పొలం నుండి తిరిగివస్తూంటే పోస్టుమాన్ ఒక కవరు యిచ్చాడు. చింపి చూస్తే అది ప్రసాదరావు వ్రాసిన ఉత్తరం.

గులాబిరంగు కాగితంమీద ఒకే ఒక్క వాక్యం వ్రాసి ఉంది.

"మిత్రుడు కన్నారావుకు,

ఈ ఉత్తరం అందిన తక్షణం బయలుదేరి విశాఖపట్నంలోని ఈ ఎడ్రస్‌కు రా.

నీ

ప్రసాదరావు."

క్రింద చిరునామా వుంది.

ఉత్తరం చదవడం ముగించిన కన్నారావు భృకుటి ముడిపడింది. సంవత్సర నుండీ ఎడ్రసు లేకుండా పోయిన ప్రసాదరావు దగ్గర నుండి హాఠాత్తుగా ఈ ఉత్తరం ఏమిటి? అంత అర్జంటుగా తనను రమ్మనట మేమిటి?

మందపా రిజర్వ్ ఫారెస్టులో అటవీ శాఖాధికారిగా పని చేస్తుండగా దొంగతనంగా కలప రవాణా చేయిస్తున్నాడన్న నేరంమీద ఉద్యోగం నుండి సస్పెండ్ చేయబడ్డాడు ప్రసాదరావు. ఈ సంఘటన జరిగి సుమారు సంవత్సరం కావస్తూంది. అప్పటి నుండి ప్రసాదరావు యేమయ్యాడో, ఎక్కడ తిరుగుతున్నాడో కూడా ఎవరికీ తెలియదు.

ప్రసాదరావును గూర్చి ఆలోచిస్తూ వే ఇంటి దారి పట్టాడు కన్నారావు.

అయితే ప్రసాదరావు ఈ సంవత్సరంగా ఓ అమూల్యమైన సమాచారం సేకరించడంలో మునిగిపోయాడని, ఒక అద్భుతమైన ప్లాన్ వేస్తున్నాడని కన్నారావుకు తెలియదు.

## 4

విశాఖపట్టణానికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఉంది ఆ జీడిమామిడి తోట.

ఏపుగా పెరిగిన ఆ తోట ఎంత దట్టంగా ఉందంటే

ఆ తోట మధ్యలో ఒక అందమైన కాటేజ్ ఉందనే విషయమే యెవరికీ తెలియదు. ప్రసాదరావు ఫారెస్టర్ గా పనిచేసే రోజులలో సంపాదించిన ఆస్తులలో ఆ తోట ఒకటి.

ఆ రాత్రి....ఆ కాటేజ్ లో కూర్చుని నలుగురు వ్యక్తులు మాట్లాడుకుంటున్నారు. వారు ప్రసాదరావు, అతని మిత్రుడు కన్నారావు, చంద్రం, రాంబాబు. అప్పటికే వారు ఒకరికొకరు పరిచయం చేయబడ్డారు....ఇక మెల్లగా కబుర్లలోకి దిగారు.

ఊరికి దూరంగా ఉన్న ఆ తోటలోకి ప్రసాదరావు తమను యెందుకు రమ్మన్నాడో....అతను చెప్పబోయే కోట్ల రూపాయలు విలువచేసే ఆ ప్లాన్ యేమిటో....తెలియక ఆ ముగ్గురి మనసులు గిజ, గిజ గింజుకుంటున్నాయి. వారు ఏదో కాలక్షేపానికి మాట్లాడుకుంటున్నా....వారి ఆలోచనలు మాత్రం ప్రసాదరావు చెప్పబోయే ఆ ప్లాన్ మీదే ఉన్నాయి.

"మీకు మహేంద్రగిరి తెలుసా?"

తను చెప్పబోయే ప్లాన్ కి ఉపోద్ఘాతంలా చంద్రం, రాంబాబులను చూస్తూ అడిగాడు ప్రసాదరావు.

తెలియదన్నట్లు వారు తలలు అడ్డంగా ఊపారు.

"అఫ్ కోర్స్! మీకు తెలియదని నాకు తెలుసు. మా 'కన్నారావు'కు కొద్దిగా తెలుసు. అదైనా మహేంద్రగిరి పేరు విన్నాడంతే!"

అంటూ ప్రసాదరావు చెప్పడం ప్రారంభించాడు. ముగ్గురూ కుర్చీలలో నుండి కాస్త ముందుకు వాలి శ్రద్ధగా ఆలకించసాగారు.

"శ్రీకాకుళం జిల్లాలో సోంపేట తాలూకాలో

'మందసా' అనే ఒక పల్లె గ్రామం ఉంది. నేషనల్ హైవే ఫైవ్ గుండా ఇచ్ఛాపురంకు వెళ్ళే త్రోవలో ఉంది ఆ గ్రామం.

ఒకప్పుడు 'మందసా' ఒక పెద్ద సంస్థానం. రాజులూ రాజ్యాలూ కాలగర్భంలో కలిసిపోయాక, గత వైభవానికి చిహ్నాలుగా యిప్పుడు శిథిలమైన కోట మాత్రం మిగిలింది మందసాలో. ఆ నగర సౌందర్యమంతా ఏనాడో మట్టికొట్టుకుపోయింది.

మందసాకు ఇరవై కిలోమీటర్ల దూరంలో వున్నాయి తూర్పుకనుమలు. ఆ పర్వతశ్రేణుల మధ్య వ్యాపించిన మహారణ్యమే మందసా రిజర్వ్ ఫారెస్టు. భయంకరమైన క్రూర మృగాలకూ, విష సర్పాలకు ఆటపట్టు ఆ మహారణ్యం. ఆ తూర్పు కనుమలలోని ఎత్తయిన శిఖరమే 'మహేంద్రగిరి.' సముద్ర మట్టానికి సుమారు ఐదు వేల ఐదువందల అడుగుల యెత్తుంటుంది ఆ గిరి శిఖరం."

ప్రసాదరావు తమ కిదంతా ఎందుకు చెబుతున్నాడో అర్థంగాక తెల్లబోయి చూస్తున్నారు చంద్రం,రాంబాబు.

వారి ముఖకవళికలను గమనించాడు ప్రసాదరావు. ఒక్క క్షణం చెప్పడం ఆపాడు.

"ఈ మహేంద్రగిరికీ, నేను చెప్పబోయే ఆ ప్లాన్ కూ చాలా దగ్గర సంబంధం వుంది. అందుకే మీకు ఇదంతా చెబుతున్నాను. మీకేమైనా విసుగ్గా వుందా....?"

వారి కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు ప్రసాదరావు.

ఆ చూపులకు చంద్రం కాస్త యిబ్బందిగా కదిలాడు.

"లేదు. ఇంటరెస్టింగ్ గానే వుంది చెప్పండి" అన్నాడు చంద్రం నవ్వుతూ.

వాళ్ల ముగ్గురినీ ఒక్కసారి పరికించి చూసి, గొంతు సవరించుకున్నాడు ప్రసాదరావు.

"అవి నేను మందసా రిజర్వ్ ఫారెస్టులో అటవీ శాఖాధికారిగా పనిచేస్తున్న రోజులు. ఆ రోజులలో నేను తరచుగా ఒక కథ వింటుండేవాడిని. మొదట యేదో కథలే అని కొట్టిపారేసినా....పదిమంది నోటా అదే కథ వినేసరికి ఆ కథ నాలో కొంత ఇంటరెస్టుని రేకెత్తించిందనే చెప్పాలి.

కొన్నేళ్ళ తర్వాత నా జీవితంలో జరిగిన ఒక సంఘటన నేను ఆ కథను నిజంగా నమ్మేటట్లు చేసింది.

మహేంద్రగిరి శిఖరంమీద ఒక శబర గూడెం వుంది. విచిత్రం ఏమిటంటే ఆ గూడెంలో కేవలం పదకొండు కుటీరాలు మాత్రమే వుంటాయి. అందులో పదకొండు కుటుంబాలు మాత్రమే జీవిస్తుంటారు. అది వారి ఆచారం. యిప్పటికి కూడా ఆ ఆచారం నిర్విఘ్నంగా కొనసాగుతుంది.

మహేంద్రగిరి పర్వతంమీద ఎక్కడో ఒక రహస్యమైన గుహ వుంది. అది భయంకరమైన విషనాగులకు నిలయం. ఆ గుహలో ఆ శబరులు కులదైవమైన నాగరాజు నిలువెత్తు విగ్రహం వుంది. అది పూర్తిగా బంగారంతో చేయబడింది. దాని కన్నుల స్థానంలో రెండు వజ్రాలు తాపడం చేయబడ్డాయి. అవి ప్రపంచంలో నే అరుదుగా లభ్యమయ్యే రెడ్ డయిమండ్స్.

ఎ గోల్డెన్ స్నేక్ విత్ రెడ్ డైమండ్స్!

ఆ గూడెం నాయకుడికి మాత్రమే ఆ గుహకు పోయే దారి తెలుసు. అతడు ప్రతి నెలా చవితినాటి రాత్రి ఒంటరిగా ఆ గుహకు పోయి ఆ నాగదేవతను పూజించే

వాడు.

ఆ గుహనే 'గుప్త మహేంద్రం' అని పిలుస్తారు.

ఆ 'గుప్త మహేంద్రం' రహస్యం గూడెం నాయకుడు తన మగబిడ్డకు గూడెం నాయకత్వం అప్పగించే సమయంలో మాత్రమే చెప్పేవాడు. అలా ఆ రహస్యం యెన్నో తరాలుగా వారి ప్రాణాలకన్నా మిన్నగా కాపాడబడుతోంది.

ఈ గుప్త మహేంద్రం రహస్యం మందసా మహారాజుకు యెలా తెలిసిందోగాని, ఎలాగైనా ఒక్కసారి ఆ గుహలోనికి ప్రవేశించి, ఆ బంగారు నాగేంద్రుని చూడాలనుకున్నాడు. మహేంద్రగిరిమీది శబర గూడెం నాయకుడ్ని కోటకు రప్పించి, తన మనసులోని కోరికను అతడికి చెప్పాడు మహారాజా.

మహారాజా కోరికను విని భయంతో వణికిపోయాడు శబర గూడెం నాయకుడు. తమ ఆచారాల్ని, గూడెం కట్టుబాట్లను తప్పి పరులకు ఆ గుప్త మహేంద్రపు రహస్యాన్ని చెప్పలేనన్నాడు.

కాని మహారాజా ఆ నాయకుడ్ని యెంతో ప్రాధేయపడ్డాడు. తను కేవలం ఆ నాగేంద్రుని దర్శించి వచ్చేస్తానని, ఆ గుప్త మహేంద్రం రహస్యం ఎవరికీ చెప్పనని ప్రమాణం చేశాడు మహారాజా. ఆ నాయకుడికి అంతులేని ధనాన్ని ఆశచూపాడు.

అంతటి మహారాజు మాటను జవదాటలేకో, లేక మహారాజా యిస్తానన్న ధనానికి ఆశపడో చిట్టచివరకు మహారాజాను ఆ గుహలోనికి తీసుకువెళ్లడానికి అంగీకరించాడు ఆ గూడెం నాయకుడు.

ఒక చవితినాటి రాత్రి....

మందసా మహారాజు ఒంటరిగా మహేంద్రగిరి అడవులకు చేరుకున్నాడు. ముందుగా నిర్ణయించుకున్న ఒక సంకేత స్థలంలో మహారాజును కలిసాడు గూడెం నాయకుడు. రాజు కళ్ళకు గంతలు కట్టి తనవెంట నడిపించుకు వెళ్ళాడు.

చెట్లూ, పుట్టలూ, కొండలూ, గుట్టలూ దాటుకుంటూ వారిద్దరూ కొన్ని గంటలు నడిచారు. తరువాత యేదో సన్నని మార్గంగుండా ప్రాకుకుంటూ నడిచారు. అలా వారి ప్రయాణం మరికొంతసేపు సాగింది. నాయకుడు రాజు కళ్ళకు కట్టిన గంతలు విప్పాడు. కొన్ని క్షణాల వరకూ రాజుకు ఏమీ కనిపించలేదు. అంతా చిమ్మచీకటి.

మెల్ల, మెల్లగా కనులు విప్పుకొని చూసిన రాజుకు ఒక అద్భుతమైన కాంతి కనులు మిరుమిట్లు గొలిపింది.

ఎదురుగా ఒక విశాలమైన గుహ. అందులో కాంతులు వెదజల్లుతున్న బంగారు నాగేంద్రుని విగ్రహం. రాజు ఆ అద్భుత దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుడైపోయాడు. భక్తితో ఆ నాగేంద్రునికి నమస్కరించాడు.

రాజును అక్కడే నిలబడమని సైగచేసి ఆ గుహ లోనికి ప్రవేశించాడు గూడెం నాయకుడు. నాగేంద్రుని విగ్రహం ముందు భక్తితో మోకరిల్లాడు. రాజు రెప్ప వేయకుండా అలే చూస్తున్నాడు.

ఆ నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ....అప్పుడు వారికి వినిపించింది ఒక తీవ్రమైన నిశ్వాసం. నాగేంద్రుని విగ్రహం వెనుకనుండి జర, జరా ప్రాకుకుంటూ వచ్చింది ఒక భయంకరమైన సర్పం.

సుమారు పది, పన్నెండడుగుల పొడవున్న తెల్ల త్రాచు అది. ప్రపంచంలోనే అరుదైన సర్ప జాతులలో

ఆ 'శ్వేతనాగం' ఒకటి. భారతీయులు దేవతా సర్పంగా భావించి, పూజించే ఆ తెల్ల త్రాచు తోకమీదలేచి బుసలు కొట్టసాగింది.

రాజు ఆ శ్వేతనాగును చూసి నిలువెల్లా భయంతో కంపించిపోయాను.

ఎప్పుడూ ప్రసన్నంగా వుండే ఆ దేవతా సర్పం ఆ రోజు అలా కోపంగా బుసలు కొడుతుండటం చూసి నాయకుడు తెల్లబోయాడు.

క్షణ, క్షణానికి ఆ తెల్లత్రాచులో తీవ్రత అధికం కాసాగింది. ఏదో తెలియని భయంతో నాయకుని శరీరం గజ, గజ వణకసాగింది. పరిస్థితి విషమించిందని గ్రహించాడు అతడు. అతని పెదవులు సన్నగా ఏవో మంత్రాలను ఉచ్ఛరించసాగాయి. ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ ఆ గుహలోనుండి బయటపడ్డాడు నాయకుడు.

"నాగదేవరకు కోపమొచ్చింది దొరా.... కరుణించే దేవత కాటేయబూనింది. మంత్రంవేసి కట్టుకట్టినా. ఈ పూటకు గండం గడిచింది."

అంటూ వణుకుతున్న గొంతుతో రాజుతో అన్నాడు గూడెం నాయకుడు. వారిద్దరూ ప్రాణాలు బిగపట్టుకొని ఆ గుహ ప్రాంగణం నుండి బయటపడ్డారు.

సరిగ్గా ఆ రోజుకు మూడవనాడు పాము కాటుకు గురియై మరణించాడు నాయకుడు. ఒక విచిత్రమైన వ్యాధితో మంచంపట్టాడు మహారాజు. రాజవైద్యులు ఎంత ప్రయత్నించినా ఆ వ్యాధి లక్షణాలేమిటోకూడా కనుక్కోలేక పోయారు. మూడు నెలలపాటు అలా మంచంమీనే ఆ వ్యాధితో క్షీణించి, క్షీణించి మహారాజు కూడా మరణించాడు."

చెప్పడం పూర్తిచేశాడు ప్రసాదరావు.

"రియల్లీ ఇటీజ్ వండర్‌ఫుల్." అన్నాడు చంద్రం. అతని గొంతులో ఏదో ఎగ్జయిట్‌మెంట్. "ఇది కథేనా....? లేక, నిజంగా ఆ గోల్డెన్ స్నేక్ ఇప్పటికీ వుందంటారా?" సాలోచనగా అన్నాడు రాంబాబు.

"నేనూ ముందు కథే అని కొట్టిపారేసాను. కాని అది కథ కాదనీ....యింకా ఆ గుప్త మహేంద్రంలో ఆ "గోల్డెన్ స్నేక్" వుందని నమ్మకం పూర్తిగా కుదిరాకే ఈ పథకం తయారు చేశాను" అన్నాడు ప్రసాదరావు.

అంతవరకూ మౌనంగా వున్న కన్నారావు అప్పుడు పెదవి విప్పాడు. "యిప్పటికీ మహేంద్రగిరిమీద ఆ శబర గూడెం వుంది కదూ?"

"ఉంది "అంటూ 'ఏం' అన్నట్లు చూశాడు ప్రసాదరావు.

"అయితే ఆ శబర గూడెం నాయకుడికి ఆ గుప్త మహేంద్రం రహస్యం తెలుస్తూంది కదా...." అంటూ అనోకిలో ఆపేసాడు కన్నారావు.

చిన్నగా నవ్వాడు ప్రసాదరావు.

"లేదు. అరాంతరంగా పాము కాటుకు గురియైన ఆ నాయకుడు తన కుమారుడికి ఆ రహస్యం చెప్పకుండానే మరణించాడు. అప్పటినుండీ..గుప్త మహేంద్రం రహస్యం గుప్తంగానే వుండిపోయింది."

రెండు క్షణాలు ఆ కుటీరంలో నిశ్శబ్దం నాట్యం చేసింది.

ఊపిరికూడా తీయకుండా ప్రసాదరావు యింకా ఏం చెబుతాడా అని ఉత్సుకతతో చూస్తున్నారు ఆ

ముగ్గురూ.

ప్రసాదరావు మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

"మందసా రిజర్వ్ ఫారెస్టులో పనిచేస్తున్న రోజు లలో పదిమంది నోటా అదే కథ.... అంటే యింతకు ముందు మీకు చెప్పినది.... వింటూంటేసరికి నాకు కూడా ఆ కథపట్ల ఒక రకమైన ఆసక్తి ఏర్పడింది. దాని గురించి పూర్తి వివరాలు సేకరించడానికి ప్రయత్నించ సాగాను. ఆ శబర గూడెం నాయకుడు 'భీమా'ను మెల్ల మెల్లగా లొంగదీసుకున్నాడు.

అయితే అతనికి గుప్త మహేంద్రం రహస్యం తెలియ దని తేటతెల్లమయింది. కాని .... 'గుప్త మహేంద్రం' వున్నట్లు అందులో 'బంగారు నాగ విగ్రహం' ఉన్నట్లు అతడి మాటల వలన ధృవపడింది.

'గుప్త మహేంద్రం' రహస్యాన్ని తెలుసుకునే మార్గం యింకేమైనా వుందేమోనని .... ఆ శబరగూడెం నాయ కుడ్ని ఎన్నో విధాల ప్రశ్నించాను. యెంతో డబ్బు ముట్టచెప్పాను. మన ప్లాన్ సక్సెస్ అయితే అతడికి కూడా ఒక వాటా యిస్తానని ఆశ పెట్టాను. చివరకు.... గుప్త మహేంద్రం రహస్యాన్ని కనుగొనగలిగే ఒకే మార్గాన్ని తెలుసుకోగలాను."

"ఏమిటది....?" ఆత్రంగా అడిగాడు చంద్రం.

"ఆ గుప్త మహేంద్రానికి పోయే త్రోవ ఒక పులి చర్మంపై చిత్రీకరింపబడింది. అయితే ఆ ప్లాన్ గీయ బడిన చర్మం పటం ఎక్కడో నిగూఢంగా నిక్షిప్తం చేయబడి వుంది. దానికి రక్షణగా ఒక కాల సర్పం వుంటుంది. దానిని 'కళింగనాగు' అంటారు కాని....ఆ

ప్లాన్ వ్రాయబడ్డ ఆ రహస్య స్థలం మాత్రం యెక్కడో ఆ నాయకుడికి తెలియదు.

రాత్రీ, పగలూ నాకు ఇవే ఆలోచనలు.

కొన్ని కోట్ల రూపాయలు విలువచేసే ఆ 'గోల్డెన్ స్నేక్' నిజంగా వుందని తెలిసాక.... దాని ఆలోచనలతో నాకు రాత్రుళ్ళు నిద్రపట్టేదికాదు.

నాకో విచిత్రమైన ఆలోచన వచ్చింది. ఆ రహస్య స్థలం దగ్గరకు మనం వెళ్ళలేం. ఎందుకంటే—అది ఎక్కడుందో మనకు తెలియదు కాబట్టి.

చైనాలో ఒక సామెత వుంది. 'నీవు ఎవరిదగ్గరికైనా వెళ్ళలేనప్పుడు—వారినే నీ దగ్గరకు రప్పించుకో' అని దాని అర్థం.

ఆ ప్లాన్ గీయబడిన చర్మం మన దగ్గరకు రాలేదు. దానికి జీవం లేదు గనుక. కాని జీవం వున్న 'కాల సర్పం' రాగలదేమో!

కొన్ని సంవత్సరాలుగా ఆ రహస్య స్థలంలోనే కాపురం వుంటున్న కాల సర్పాన్ని మన దగ్గరకు రప్పించుకోగలిగితే.... దానిని విడిచిపెట్టిన మరుక్షణం.... అది ఖచ్చితంగా ఆ రహస్య స్థలాన్నే చేరుకుంటుంది.

అప్పుడు ఆ సర్పాన్ని వెంబడించగలిగితే.... చాలు! ఆ ప్లాన్ చేతికి చిక్కినట్లే.

నా మనసులోని ఆలోచన వినినంతనే నాయకుడు ఆనందంతో ఎగిరి గంతులేసాడు.

'నాగ బంధం' అనే మంత్ర విద్య వుందట. ఆ మంత్ర విద్య ప్రభావంతో మనం యే సర్పాన్నయినా మన దగ్గరకు రప్పించి బంధించవచ్చుట. ఆ రోజే నాయకుడి గుడిసెలో ఆ పూజకు రహస్యంగా ఏర్పాట్లు చేయ

బడ్డాయి. ఆ శబర గూడెంలో మిగిలిన గుడిసెలకు కాస్త దూరంగా నాయకుడి గుడిసె ప్రత్యేకంగా నిర్మింపబడింది.

నాయకుడు తన గుడిసెను గోమయంతో అలికాడు. అలికిన ఆ గుడిసె మధ్యలో ఒక ముగ్గు వేశాడు. అది ఒక విచిత్రమైన ముగ్గు. నాలుగు పాములు ఒకదానితో నొకటి పెనవేసుకొని ఉన్నట్లు ఉంది ఆ ముగ్గు. ఆ నాలుగు పాముల తలలూ నాలుగు దిక్కులకేసి ఉన్నవి. అవి నాలుగు రంగులలో తీర్చబడ్డాయి. ఒకటి ముగ్గు పొడి, రెండవది పసుపు, మూడవది కుంకుమ, నాల్గవది బొగ్గుపొడి.

ఇలా నాలుగు రంగులలో ఆ నాలుగు పాములూ మెరుస్తున్నాయి. ఆ ముగ్గు మధ్య కొన్ని అస్థికలను పెట్టాడు నాయకుడు. అవి సర్పాస్తికలు.

తలంటి స్నానంచేసి ఆ ముగ్గుకు ఉత్తరదిశలో కూర్చున్నాడు నాయకుడు. అతని యెదుట ఒక చిన్న మట్టి ప్రమిదలో కొన్ని అక్షతలు ఉన్నాయి. అయితే అవి మామూలు అక్షతలు కావు. రక్తాక్షతలు. నాయకుని పెదవులు మెల్లగా యేవో మంత్రాలను ఉచ్చరించ సాగాయి. అతడి కుడిచేయి యాంత్రికంగా ఆ రక్తాక్షతలను ఆ ముగ్గులోని సర్పాస్తికలపై వేయసాగింది.

ఆ గుడిసెలో ఒక మూలనున్న ఒక పెద్ద వెదురుబుట్ట చాటున దాక్కొని ఉన్నాను నేను. క్షణ క్షణానికి నాలో యేదో తెలియని టెన్షన్ పెరిగిపోసాగింది. అంతలో ఏదో బరువుగా ఊపిరి విడుస్తున్న ధ్వని వినిపించింది. తల త్రిప్పి చూశాను.

అంతే!

అప్పుడు నేను చూసిన భయానక దృశ్యంతో నేను

ఊపిరితీయడం కూడా మరచిపోయాను. నా కళ్ళతో నేను చూడకుంటే బహుశా యింకెవరైనా చెప్పినా నేను నమ్మేవాణ్ని కాదేమో!

సుమారు పన్నెండడుగుల పొడవున్న ఒక కళింగ నాగు జర, జరా ప్రాకుతుంటూ ఆ గుడిసెలోకి ప్రవేశించింది. బాగా ముదిరిన తాడిపండు రంగులో వుంది దాని శరీరం. అది కేవలం కళింగభూమిలో మాత్రమే కనిపించే నల్లత్రాచు. ది రియల్ కింగ్ కోబ్రా.

అది ఆ ముగ్గు మధ్య చుట్టలు చుట్టుకొని పడగ విప్పి బుసలుకొట్టసాగింది. ఆ కింగ్ కోబ్రాను చూసేసరికి నాకు ముచ్చెమటలు పోశాయి. భయంతో దానివంకే చూడసాగాను.

చుట్టలు చుట్టుకొని వున్నా—నిలువెత్తు పొడవు లేచింది కింగ్ కోబ్రా. పెద్ద ఏనుగు చెవులా వున్న తన పడగను ముందు వెనుకలకు ఊపుతూ—భయంకరంగా బుసలు కొడుతూంటే నా పై ప్రాణాలు పైనే పోయాయి.

శబర నాయకుడు మాత్రం నిశ్చలంగా దానివంకే చూస్తూ మంత్రాలను వల్లించసాగాడు. అతడి యెడమ చేతిలో వున్న ఒక విచిత్రమైన ముల్లుగర్రను ఆ పాము పడగ చుట్టూ మూడుసార్లు త్రిప్పాడు. తరువాత ఆ ముల్లుగర్రను ద్వారంవైపు చూపాడు.

అద్భుతం!!

అంత భయంకర సర్పం తన పడగ వంచింది. నాయకుని సంజ్ఞను అర్థం చేసుకున్నట్లు.... ఆ గుడిసె బయటకు జర, జరా ప్రాకసాగింది. ఆ కింగ్ కోబ్రాను జాగ్రత్తగా అనుసరించాం మేమిద్దరం.

సుమారు రెండుగంటలసేపు సాగింది మా ప్రయాణం. ముళ్ళ పొదలు గీచుకోవడంతో మా శరీరాల నుండి రక్తం కారుతోంది. కొన్ని ప్రదేశాలలో ప్రాకుతుంటూ వెళ్ళవలసి వచ్చింది. మా మోకాళ్ళు కొట్టుకుపోయాయి. అయినా మొండి పట్టుదలతో ఆ 'కింగ్ కోబ్రా'ను వెంబడించాం.

చిట్టచివరకు ఆ 'కళింగ నాగు' ఒక దట్టమైన వెదురు తోపులో ప్రవేశించింది. దాని వెనుకే ముందుకు అడుగు వేయబోయిన మేము కరెంట్ షాక్ కొట్టినట్లు ఆగి పోయాం.

ఎంత ధైర్యం గలవాడయినా భయంతో వణికిపోయే దృశ్యం అది. నా గొంతు తడి ఆరిపోయింది. భయంతో నా నాలుక పిడచగట్టుకుపోయింది. శిలా విగ్రహాల్లా అలాగే నిలుచుండిపోయాం మేము.

ఆ వెదురుతోపు నిలువెత్తు పాముల పుట్టలతో నిండి ఉంది.

ఒకటీ....రెండూ కాదు. కొన్ని వందల పుట్టలు. ఆ పుట్టలపైనా....ఆ తోపు మధ్య నేలమీదా బుసలు కొడుతూ సంచరిస్తున్నాయి వివిధ రకాల విషసర్పాలు. కొన్ని పుట్టల రంధ్రాలలో నుండి సగం వచ్చి పడగలు విప్పి ఆడుతున్నాయి.

ఆ పుట్టలనూ....ఆ భయంకరమయిన విషసర్పాలనూ చూస్తుంటే 'నాగలోకమేమో' అనిపిస్తూంది ఆ వెదురు తోపు. అన్ని వేల సర్పాలను చూసేసరికి నాకు వెన్నులో నుండి చలి పుట్టుకొచ్చింది.

ఆ వెదురుతోపు మధ్యనున్న ఒక ఎత్తయిన పుట్టవద్దకు పోయి ఆగింది మేము వెంబడించి వచ్చిన కళింగనాగు. ఆ

పుట్ట ప్రక్కన భూమిలో పాతబడి ఉంది ఒక నల్లరాతి ఫలకం. దానిపై రెండు పాములు ఒకదాని నొకటి పెన వేసుకొని ఉన్నట్లు చెక్కబడి ఉంది.

శబర నాయకుడు భీమో ఒక్కక్షణం తీక్షణంగా ఆ కళింగ నాగువంక చూశాడు. ఆ పుట్టమీద చుట్టలు చుట్టుకొని పడగవిప్పి ఆడుతుంది ఆ సర్పం.

"దొరా! చూసినావా ఆ నాగశిలను. నాగదేవర దానినే కాపుతుండది. నీ వీడనే నిలు. నే బోయి వస్తా" అంటూ వెదురుతోపులోనికి అడుగు పెట్టాడు భీమో.

అతడి పెదవులు ఏవో మంత్రాలను ఉచ్ఛరించ సాగాయి. దారికి అడ్డంగా వస్తున్న సర్పాలను చేతిలోని ముల్లుగర్రతో తప్పిస్తూ ఆ శిలాఫలకాన్ని సమీపించాడు భీమో. మొలనున్న పిడిబాకుతో నేలను త్రవ్వి ఆ నాగశిలను పైకి తొలగించాడు. ఆ నాగశిల క్రింద పాతిపెట్టబడి వుంది ఒక ఇనుపరేకు గొట్టం. మూత వేయబడి ఉన్న ఆ గొట్టాన్ని తీసుకొని నా దగ్గరకు వచ్చాడు భీమో.

మరుక్షణం మేమిద్దరం ఆ వెదురుతోపుని వీడి నాయకుని కుటీరానికి బయలుదేరాం.

కుటీరంలో నాయకుడు ఆ రేకుగొట్టపుమూతను తొలగించాడు. ఆ రేకుగొట్టంలోనుండి జారిపడింది ఒక పులిచర్మపు పటం. విచిత్రమైన రేఖలతో దానిపై గీయబడి ఉంది ఒక మార్గం. కొండలూ, అడవులూ ....రంగులతో చిత్రీకరింపబడ్డాయి ఆ పటంమీద. ఎన్నో సంవత్సరాలయినా చెక్కుచెదరకుండా ఉన్న ఆ పటాన్ని చూసి ఆశ్చర్యపోయాను నేను.

ఆపటం మీదనున్న మార్గాన్ని జాగ్రత్తగా పరిశీలించాం నేనూ....భీమా! మా ఇద్దరి అంచనా తప్పు కాకుంటే .... ఆపటం మీద గుర్తింపబడ్డది .... గుప్త మహేంద్రానికి....త్రోవ."

అంతవరకూ చెప్పి ఆపాడు ప్రసాదరావు.

అంతవరకూ ఎంతో ఉత్సుకతో ప్రసాదరావు చెప్పినదంతా వింటున్న ఆ ముగ్గురూ తాము మహేంద్రగిరి అడవులలో....ఆ వెదురు తోపులలో....కలింగ నాగును చూస్తున్న అనుభూతిని పొందారు.

ఆ రాత్రి చాలా పొద్దు పోయేవరకూ ఆ నలుగురి మధ్యా చర్చలు కొనసాగుతూనే వున్నాయి. వారు అడిగే ప్రతి ప్రశ్నకూ ఓపికగా సమాధానాలిస్తూనే వాడు ప్రసాదరావు.

# 5

పర్వతాలు ఎక్కడానికి అనువైన వస్త్రాలు ధరించారు వారు.

జీన్స్ పాంట్, ఫుల్ స్లీవ్స్ బనియన్....కోట్స్.... కేప్....చేతిలో గొడుగు కర్రలాంటి హేండ్ స్టిక్. పర్వతాలు ముఖ్యంగా నిట్టనిలువుగా వున్న వాటిని ఎక్కేటప్పుడు ఈ స్టిక్ ఎంతో ఉపకరిస్తూంది.

వారి భుజాలపై చిన్న కిట్ వుంది. అందులో వాటర్, టార్చ్‌లైట్, చిన్న టవల్....విషానికి విరుగుడు అయిన ఇంజక్షన్ బాటిల్, సిరంజ్ లాంటి చిల్లర సామానులు వున్నాయి. నడుముకున్న బెల్టుకు చిన్న పేష్కేవ్ వ్రేలాడుతుంది.

జేవులోనుండి నాలుగు బండ్లను తీశారు. అవి చిన్న పిల్లలు ఆడుకునే రెండడుగుల పొడవు ఒక అడుగు

వెడల్పు వున్న చిన్న చిన్న లాగుడు బండ్లు. కాకుంటే అవి పెట్టెల ఆకారంలో వున్నాయి. వాటికి నాలుగు చక్రాలు బిగింపబడి వుండటంచేత వాటిని సునాయాసంగా లాక్కొని పోవచ్చు. ఆ బండ్లకు వున్న త్రాళ్ళను తమ నడుములకు కట్టుకున్నారు ఆ నలుగురూ.

వీటన్నిటికీ ముందే తాము వచ్చిన జీప్‌ను జీబురుగా వున్న పొదలమధ్య పెట్టాడు. కాసిన్ని కొమ్మలూ ... రెమ్మలు కొట్టుకొచ్చి జీప్ పైన కప్పారు. యిప్పుడు అక్కడ 'జీప్' ఒకటి దాచబడిందనే అనుమానం కూడా ఎవరికీ రాదు.

అన్నీ సరిచూసుకున్నాక ప్రసాదరావు ముందు తూర్పు కనుమలవైపు దారి తీస్తుంటే వెనుకగా మిగిలిన వారు కూడా ఆ దుర్గమారణ్యంలో ప్రవేశించారు....
కన్నారావు చేతిలో పొడవాటి తల్వార్ వుంది. దానితో వారికడ్డంగా వున్న ముళ్ళకంపల్నీ కొమ్మల్నీ నరుకుతున్నాడు.

సుమారు రెండు కిలోమీటర్లు సాగి వుంటుంది వారి ప్రయాణం. అంతవరకూ మౌనంగా వున్న 'చంద్రం' ఉన్నట్లుండి అడిగాడు.

"శబర నాయకుడు భీమో....కనిపించడం లేదేమిటి ప్రసాదరావుగారూ?" అనగా ప్రసాదరావు ఒక్కసారి తడబడ్డాడు. అయితే అది కేవలం క్షణంసేపు మాత్రం. తరువాత నవ్వుతూ చంద్రాన్ని చూశాడు.

"బహుశా, భీమో మనకు కలియకపోవచ్చు చంద్రం. వారి కులదైవమైన బంగారు నాగేంద్రుని ముక్కలుగా చేసి మనం ఈ చిన్న పెట్టెలలో పేర్చుకొని తీసుకొని పోవడానికి....మహేంద్రగిరి వచ్చామని గాని....మనకు

నాయకుడు భీమో సహాకారం వుందనిగాని ఎట్టి పరిస్థితులలో బయటకు పొక్కినా అది భీమో ప్రాణాలకే ప్రమాదకరం. అందుకే భీమో డైరెక్టుగా సీన్‌లోకి రాడు. మనమే మన తంటా లేవో పడి ... ఆ నిధిని చేజిక్కించుకోవాలి.

అయితే .... ఆ ప్లాన్ సంపాదించడానికి శ్రమపడినందుకు ప్రతిఫలంగా ఆ రెడ్ డయిమండ్స్‌లో ఒకటి అతనికి యివ్వాల్సి వుంటుంది. మిగిలినది మీకు యింతకు క్రితమే చెప్పానుగా. ఈ ప్లాన్‌కు యింతగా శ్రమించిన వాకు చెందుతుంది.

యిక గోల్డెన్ స్నేక్ అంటారా....అది నలుగురం సమానంగా పంచుకుంటాం. అది మాత్రం తక్కువా. కొన్ని మణుగుల బంగారు వుంటుంది అది" అన్నాడు ప్రసాదరావు.

ప్రసాదరావు నాయకుడు భీమో గురించి చెప్పినది శుద్ధ అబద్ధం. ప్రసాదరావు, భీమో 'గుప్త మహేంద్రం' ప్లాన్ సంపాదించిన పదిరోజుల్లోనే 'భీమో' పాము కాటుకు గురై మరణించాడు.

భీమో పాము కాటుకు మరణించాడన్న విషయం కప్పిపుచ్చాడు ప్రసాదరావు. నిజం చెబితే తన సహచరులు భయంతో వెనుదిరిగితే....? అసలు 'భీమో' చనిపోవడం వల్ల నేకదా..పాముల్లో తిరిగే రాంబాంబునీ, కరాటే వీరుడు చంద్రాన్నీ తన పార్ట్‌నర్స్‌గా చేసుకున్నది.

ప్రసాదరావు మెదడులో ఏవో ఆలోచనలు. తన వాటాకు ఆ రేర్ రెడ్ డయిమండ్స్ యింకా గోల్డెన్ స్నేక్‌లో భాగం వస్తాయి. కాని నాయకుడు భీమో

చనిపోవడంచేత తాము మరింత జాగ్రత్తగా వుండాలి. ఒక వంక క్రూరమృగాలు, విషసర్పాలు, మరో వంక శబరులు .... వీరందరినీ జాగ్రత్తగా వాచ్ చేస్తూ తమ ప్రయాణం కొనసాగించాలి.

ఆలోచనలతో ముందుకు అడుగులేస్తున్న ప్రసాదరావు, గభాలున కన్నారావు తన జబ్బ పట్టుకొని లాగే సరికి ఉలిక్కిపడి ఆగాడు. ఎదురుగా కనిపించిన ఒక భయంకరమైన దృశ్యం....చూసేసరికి వడలు జలదరించింది.

తన చేతిలోని తల్వార్‌ను ప్రసాదరావుకు యిచ్చి.... భుజంమీదనున్న రైఫిల్‌ను తన చేతిలోకి తీసుకున్నాడు కన్నారావు.

రాంబాబు, చంద్రం మాత్రం ఆసక్తిగా అటే చూస్తున్నారు.

వీరు నిలుచున్న ప్రదేశానికి సుమారు పది, పదిహేను అడుగుల దూరంలో బాట ప్రక్కనున్న చెట్ల గుబురుల మధ్యనుండి కన్పిస్తూంది ఒక భయంకరమైన పోరాటం.

పదిహేను అడుగులకన్నా పొడవున్న కొండచిలువతో ఒక చిరుతపులి హోరా హోరీగా పోరాడుతుంది. కొండ చిలువకు దూరంగా వుంటూ దాని తలను తన పంజాతో చిదుకగొట్టాలని ప్రయత్నిస్తూంది చిరుత. చిరుతను తన శరీరంతో బంధించి దాని ఎముకలను నుగ్గు నుగ్గు చేయాలని చూస్తూంది కొండచిలువ. ఎప్పుడూ బద్ధకంగా మెల్లగా కదిలే కొండచిలువలో అంత వేగం, షార్ప్ నెస్ వుంటాయని ఆ పోరాటం చూడనివారు యెవరూ నమ్మలేరు.

చిరుత పంజా దెబ్బలు అప్పటికే ఆ కొండచిలువ

శరీరంపై పడి రక్తం స్రవిస్తుంది.

అప్పటికే కొండచిలువ తోక ఆ పులి శరీరంపై రెండు చుట్టలు చుట్టేసింది.

చిరుతపులి భయంకరంగా గర్జించింది.

మెల్ల మెల్లగా కొండచిలువ తన శరీరాన్ని పూర్తిగా ఆ చిరుతపులి చుట్టూ బిగించింది. కొండచిలువ తన శరీరాన్ని మరింత బిగించేసరికి బాధతో అరవసాగింది చిరుతపులి. తన నోటికి అందిన కొండచిలువ శరీరాన్ని గట్టిగా కరిచింది. పంజా ఎత్తి దాని శరీరంపై బలంగా బాదసాగింది.

అప్పుడు వినవచ్చిన విచిత్రమైన శబ్దాన్ని విని ఉలిక్కి పడ్డారు ఆ నలుగురూ.

అది .... అది .... చిన్న పిల్లవాడి ఏడుపులా వుంది. గుక్కపట్టి ఏడుస్తున్న పిల్లవాని కంఠంలా వుంది ఆ స్వరం.

ఆశ్చర్యంతో చుట్టూ చూశారు వారు.

కాని....ఎక్కడా ఏం కన్పించటం లేదు. అడవిలో ఈ పిల్లవాని ఏడుపేమిటూ అన్న సందేహం వారి మనస్సులను పీడించసాగింది.

అదే క్షణంలో వారికి ఈసారి మరింత స్పష్టంగా వినిపించింది ఆ పిల్లవాని ఏడుపు. ఆ ఏడుపు వస్తున్న దిక్కుకేసి కేంద్రీకరించారు వారి చూపులను.

ఆ స్వరం యెవరిదో అర్థం చేసుకునేసరికి వారి అరచేతులకు చెమటలు పట్టాయి. కనుగ్రుడ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

చిన్న పిల్లవాడి ఏడుపులా వినిపిస్తున్న ఆ స్వరం బాధతో అరుస్తున్న కొండచిలువది.

"మై గుడ్ నెస్! ఈ అడవిలో యెప్పుడైనా చిన్న

పిల్లాడి ఏడుపు విని పరుగెత్తుకొని వస్తే....ఇలా కొండ చిలువల నోట్లో పడటమే" అన్నాడు కన్నారావు.

మరో రెండు నిముషాలు వారు ఆ పోరాటాన్ని చూశారు.

కన్నారావు మిగిలిన వారివైపు చూసి, యిక పదండి అన్నట్లు సైగ చేశాడు. చప్పుడు చేయకుండా మెల్లగా అడుగులు వేస్తూ వారు ఆ ప్రదేశాన్ని విడచి దూరంగా సాగిపోయారు.

సుమారు అర ఫర్లాంగు దూరం నడిచినంతవరకూ దారిలో ఎవరూ గొంతు విప్పలేదు.

మొదట గొంతు విప్పింది కన్నారావు.

"వాటి పోరాటం ఇంతట్లో ఆగేదికాదు. వాటికోసం నిరీక్షించడంకన్నా మనం దూరంగా తొలగిపోవడమే మంచిది."

రాంబాబు, చంద్రం మామూలు మనుషులు అవడానికి వారికి మరో అరగంట పట్టింది. నాగరిక ప్రపంచంలో పుట్టి పెరిగిన వారికి యిలా కీకారణ్యాల్లో, ఈ క్రూర మృగాల మధ్య ప్రయాణం చేయడం ఎంత థ్రిల్లింగ్ గా వుందో, అంత భయంగానూ వుంది.

మధ్యాహ్నం సమయానికి వారు ఒక పర్వత శిఖరానికి చేరుకున్నారు. ఎండ తీక్షణంగా వుంది. వేడిగాల్పులు మొహాన్ని కాల్చేస్తున్నాయి. కొండప్రాంతాలలోని ప్రత్యేకతే అది. పగలంతా విపరీతమైన ఎండ, వేడి. రాత్రి కావస్తున్నకొద్దీ మంచు, చలి.

ఒక పెద్ద చెట్టు మొదట్లో కూర్చున్నారు వారు.

తన చేతిలోఉన్న తుపాకితో ఒక నెమలిని వేటాడి చంపాడు కన్నారావు. మందపా అడవులు నెమళ్ళకు

పుట్టినిల్లు. దాని ఈకలు తీసేసి అప్పటికే ప్రోగుచేసిన చితుకుల మంటలో వేసి ఆ నెమలిని కాల్చాడు కన్నారావు. కాలిన మాంసం వాసన వారి ఆకలిని మరింత రెట్టింపు చేసింది.

ప్రసాదరావు రాలిన పండుటాకుల ఆకులను ఏరి తెచ్చాడు. ఆ ఆకులతో కాలిన మాంసాన్ని వుంచుకొని, కిట్స్‌లో తెచ్చుకున్న సాల్టు, పెప్పర్ చల్లుకొని తిన్నారు వారు.

'ఆకలి రుచి ఎరగదంటారు' అది నిజమే! లేక నిజంగా ఆ కాల్చిన నెమలి మాంసం అంత రుచిగా వుందో.... లొట్టలు వేసుకొని తినసాగారు వారు.

వాటర్ బాటిల్ లోని నీటిని త్రాగి ఆ చెట్టు మొదట్లో కాసేపు విశ్రమించారు వారు. వెల్లకిలా పడుకున్న చంద్రానికి తన తలపైన వున్న కొమ్మమీద పెద్ద తేనె పట్టు కనిపించింది. తన ప్రక్కన పడుకున్న రాంబాబును తట్టి లేపాడు చంద్రం. కొమ్మనుండి వ్రేలాడుతున్న తేనెపట్టును చూపించాడు.

చంద్రం మాటలకు వారికి కాస్త దూరంలో పడుకొని వున్న కన్నారావు, ప్రసాదరావు వారివైపు చూశారు.

"హేయ్! లెటజ్ గెట్ దట్ హనీ" అంటూ ఒక పెద్ద గులకరాయిని తీసుకున్నాడు చంద్రం.

తేనెటీగలలో కొండ తేనెటీగలు మరింత ప్రమాదకరమైనవి. వాటిని మనం రెచ్చగొట్టామా అవి మనను కొన్ని మైళ్ళ దూరం తరిమిగొట్టక వదలవు. చంద్రం చేతిలోని గులకరాయిని చూసి అతడేం చేయబోతున్నాడో తెలిసేసరికి ప్రసాదరావు వెన్నులో నుండి చలి పుట్టుకు వచ్చింది.

"చంద్రం.... ఆగు" అని ప్రసాదరావు అరిచేలోపలే..

చంద్రం చేతిలోని రాయి సూటిగా వెళ్ళి ఆ తేనె పట్టుకు తగిలి జల జలా తేనె ధారగా కారసాగింది. రాంబాబు దోసిలిలో ఆ తేనెను పట్టి ఆత్రంగా త్రాగసాగాడు.

అప్పుడు వినవచ్చింది వారికి 'ఝుంయ్ుం' మన్న ఒక భయంకర శబ్దం. రెండువేల అడుగుల ఎత్తున వెళ్ళాల్సిన జెట్ ప్లేన్ క్రిందకు వస్తే చెవులు చిట్లిపోయేలా వినిపించే శబ్దం అది. వారు తలలు పైకెత్తారు.

కొన్ని వేల అడవి తేనెటీగలు చెల్లాచెదరై ఆ పట్టు చుట్టూ తిరుగుతున్నాయి.

వాటిని చూసిన మరుక్షణం రియాక్టయ్యాడు ప్రసాదరావు. చివుక్కున లేచి లోయలోకి పరిగెడుతూ గట్టిగా అరిచాడు.

"రన్....రన్ ఫ్రెండ్స్.... లెటజ్ గెట్ అవుటాఫ్ దిస్ హెల్."

ప్రసాదరావు మాటలు చెవిన బడిన మరుక్షణం మిగిలిన ముగ్గురూ లేచి పరుగెత్తసాగారు.

కాని అప్పటికే చంద్రం, రాంబాబులను పూర్తిగా ఎటాక్ చేశాయి ఆ 'వైల్డ్ బీజ్'.

సుమారు రెండు ఫర్లాంగుల దూరం పరుగెత్తారు వారు. ఆయాసంతో గుండెలు ఎగిరెగిరి పడుతున్నాయి. వారి తలల పైనసే ఎగురుతుంటూ వెంటాడుతున్నాయి ఆ అడవి తేనెటీగలు. ఆగిన మరుక్షణం తమ శరీరాల్ని అవి తూట్లు తూట్లుగా పొడిచి చంపేస్తాయని వారికి తెలుసు. అందుకే ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని మరీ పరుగెడుతున్నారు వారు.

కొన్ని గజాల దూరంలో కన్పిస్తున్న చిన్న కొండ వాగును చూసేసరికి ప్రాణాలు లేచివచ్చాయి ప్రసాద రావుకు. కొండమీద నుండి జారిపడుతున్న నీరు అక్కడ చిన్న మడుగులా యేర్పడింది. ఆ మడుగువైపు పరుగెత్త సాగారు వారు.

అప్పటికే వారి మెడపైనా బుగ్గలమీదా, పెదిమల పైనా ఆ తేనెటీగలు కుట్టడంతో భయంకరంగా వాచి పోయాయి. ప్రసాదరావు ఆ మడుగు ఒడ్డుకు చేరిన మరు క్షణం ఆలస్యం చెయ్యకుండా అందులో దుమికాడు. అతన్ని అనుసరించారు మిగిలిన ముగ్గురూ.

నీటిలో తల కూడా ముంచి ఊపిరి బిగపెట్టడం.... తల ఒక్కసారి పైకి పెట్టి బలంగా ఊపిరి తీసుకోవడం. తలలు పైకి తేసరికి యెటాక్ చేయసాగాయి తేనె టీగలు. చటుక్కున తలలు నీటిలోనికి లాక్కునేవారు వారు.

ఇలా అరగంటసేపు గడిచేసరికి తేనెటీగలు వెనుతిరి గాయి. తమ దృష్టిపథం నుండి ఆ 'వైల్డ్ బీస్' కను మరుగయ్యాక చాలాసేపటికి వారు ఆ మడుగు నుండి బయటకు వచ్చారు.

గట్టుమీద తమ బట్టలు ఆరబెట్టుకొని కూర్చున్నారు.

"సారీ! యిలా అవుతుందని అనుకోలేదు" అన్నాడు చంద్రం, తల దించుకుంటూ. ఎక్కువగా వాటి కాట్లకు గురి అయింది అతడే. అతని మొహం అంతా ఉబ్బి పోయి ఉంది.

"ఇట్సాల్ రైట్ చంద్రం! టేక్ ఇట్ ఈజీ!" అంటూ చంద్రాన్ని అనునయించాడు ప్రసాదరావు.

కన్నారావు అటూ యిటూ ఉన్న పొదల నుండి

యేవో ఆకులను యేరి వాటి పసరు పిండి తేనెటీగలు కుట్టిన స్థలాలలో రాశాడు. ఆ ఆకుపసరు రాసి గట్టిగా రుద్దుకోనేసరికి.... కాస్త బాధ తగ్గినట్లు అనిపించింది వారికి.

కాసేపు సేద తీర్చుకున్నాక వారు ప్రయాణానికి సిద్ధమయ్యారు. ప్రసాదరావు 'మ్యాప్'ను తీసి పరీక్షగా చూస్తూ చెప్పసాగాడు.

“మనం ఈ లోయ దాటితే మహేంద్రగిరి పర్వతాన్ని చేరుకుంటాం. అదిగో! ఆ కనిపించే ఎత్తయిన పర్వతమే మహేంద్రగిరి. చూశారా దాని శిఖరం! అర్ధ చంద్రాకారంలో ఉంది. అయితే ఈ లోయ అంచులో సుమారు ఏడెనిమిది కిలోమీటర్లు ప్రయాణించాల్సింది ఉంటుంది. ఈ లోయ ప్రాంతంలో మనం ముఖ్యంగా జాగ్రత్త వహించాల్సింది శబరుల గురించి.... వారి గూడెం ఈ ప్రాంతంలోనే ఉంది.”

చెప్పడం ముగించి పటాన్ని కిట్ లో పెట్టుకొని ముందుకు నడవసాగాడు ప్రసాదరావు. కన్నారావు, చంద్రం, రాంబాబు అతడి వెనుకే అడుగులు వేస్తున్నారు.

చీకటిపడేవరకూ ఆగకుండా తమ ప్రయాణం సాగించారు వారు. దారిలో రెండు అడవి కుందేళ్ళను చంపాడు కన్నారావు. ఒక చిన్న నీటిగుంట ఒడ్డున ఆగారు దారు. కుందేళ్ళ చర్మం వలచి, బాగా కాల్చాక ఆ కాల్చిన మాంసాన్నే యెంతో ప్రీతిగా తిన్నారు.

పది, పన్నెండు అడుగుల వ్యాసంలో స్థలాన్ని కాస్త శుభ్రపరచి కొట్టిన తుప్పలను, ఎండు కట్టెలను చుట్టూ పేర్చుకొని రాత్రి పది దాటాక మంటను వెలిగించారు.

ఒకరి వెనుక ఒకరు వంతులుగా కాపలా వున్నారు.

చుట్టూ పెట్టని కోట గోడలవలె సమున్నతమైన పర్వతాలు సంకీర్ణమైన కాననం మధ్య వెలిగించిన జ్వాలా చక్రం మధ్య కూర్చుని ఉన్నారు ఆ నవనాగరిక బృందం. చుక్కలతో నీలాకాశం, తెలిమంచులు కురిసే వేళ... కార్తీక దీపాలతో కూడిన నదంలా వుంది. దూరంగా గుండెలు జలదరించేలా వినిపిస్తున్న 'హైనా' అరుపు. అడవి మృగాల పద ధ్వనులు, క్రూరమృగాల గర్జనలు అస్పష్టంగా వినిపించసాగాయి.

వారి మనస్సులలో యేదో తెలియని భావం అలుముకోసాగింది. భయం, ఆనందం, థ్రిల్లింగ్, ఒక్కటని కాదు. అన్నీ కలిపిన ఒక విచిత్రమైన భావం. ఇంత టెన్షన్‌లో కూడా అందరి మనసులలోనూ ప్రసాదరావు పడుకునే ముందు చెప్పిన మాటలే మెదులుతున్నాయి.

"మనం సూర్యోదయం కాకముందే మహేంద్రగిరి శిఖరం చేరుకోవాలి. లేకుంటే మనం పడిన ఇంత శ్రమా వృధాయే" అంటూ కిట్‌లోని మేప్ తీసి నేలమీద పరిచాడు ప్రసాదరావు.

మంటల వెలుగులో ఆ మ్యాప్ మీద గుర్తులను ఆత్రంగా చూశారు వారు.

ప్రసాదరావు వారికి ఆ బొమ్మలను చూపి చెప్పటం ప్రారంభించాడు. "ఇదిగో! ఈ అర్ధ చంద్రాకార శిఖరం ఉన్నది మహేంద్రగిరి. ఇక్కడ ఉదయిస్తున్న సూర్యుడు, ఆ కిరణాల వెలుగు ఒక కొండకొమ్ముపై పడి పరావర్తనం చెంది అదిగో అవలివైపు ప్రసరిస్తూంది. అక్కడ బంగారు రంగులో నాగేంద్రుని బొమ్మ చిత్రింపబడి వుంది.

అంటే—అదే ఖచ్చితంగా గుప్త మహేంద్రం అయి వుంటుంది, సో....మనం సూర్యోదయం కాకముందే మహేంద్రగిరి శిఖరాన్ని చేరుకోబోతున్నాం" అంటూ ముగించాడు ప్రసాదరావు.

# 6

వేగుచుక్క పొడిచేవేళకు మరలా ప్రయాణానికి సిద్ధమయింది ఆ నాగరక బృందం.

నిట్టనిలువుగా వున్న ఆ పర్వతాన్ని అధిరోహించడమంటే మాటలతో పనిగాదు. తూర్పుకనుమలలో అతి ఎత్తయిన పర్వతశిఖరం మహేంద్రగిరి. సుమారు ఐదువేల ఐదువందల అడుగుల ఎత్తు.

దట్టంగా కురుస్తున్న మంచులో కూడా వారి శరీరాలు తడిసి ముద్దలయిపోయాయి. రెండు మూడు సార్లు జారి పడటంచేత కొందరి మోకాళ్ళు కొట్టుకుపోయాయి.

అయినా సూర్యోదయం లోగా ఆ శిఖరాన్ని అధిరోహించాలనే మొండి పట్టుదలతో వారు తమ ప్రయాణం సాగించారు.

మహేంద్రగిరి శిఖరాన్ని అధిరోహించిన మరుక్షణం అక్కడ నుండి కనిపిస్తున్న మనోజ్ఞ దృశ్యాన్ని చూసేసరికి వారి అలసట అంతా మాయమై పోయింది.

తూర్పున కొన్ని వేల చదరపు మైళ్ళ పర్యంతం ఉన్న విశాలమయిన భూభాగం తమ పాదాల చెంత పరచిన రంగుల తివాచీలా వుంది. నింగి అంచులను తాకుతున్న అనంతమైన జలరాశి. కొండలూ, కోనలూ, నదులూ, నదాలూ, పల్లెలూ, పట్టణాలూ అన్నీ చిన్న చిన్న బొమ్మరిల్లులా ఉన్నాయి. భువిని వదిలి ఒక్క క్షణం దివికి

వచ్చామా అనిపించింది వారికి.

ప్రకృతి మాత సౌందర్యాన్ని చూసి మురిసిపోతున్న క్షణంలో కడలి గర్భంలోంచి నెమ్మదిగా పైకి రాసాగాడు బాలభానుడు. నింగికన్నె నుదురుట, నీలి సంద్రపు ముంగురులు తొలగిస్తే.... కెంజాయి సోనల ప్రకాశించే సింధూర తిలకంలా ఉన్నాడు భాస్కరుడు.

కొన్ని క్షణాలపాటు పరవశించి తమను తాము మైమరచిపోయారు వారు.

సరిగ్గా వారు నిలుచున్న ప్రదేశానికి పది అడుగుల వెనుక ఉంది ఒక గండ శిల. నలుపు, ఎరుపు రంగుల మిశ్రమమై పొడవుగా స్తంభంలా వుంది. సముద్ర గర్భం నుండి సూర్యబింబం పూర్తిగా పైకి వచ్చేసరికి వారికి కర్తవ్యం గుర్తుకు వచ్చింది.

అదే సమయంలో ఒక సూర్యకిరణం సూటిగా వచ్చి స్తంభంలా ఉన్న ఆ గండశిలపై పడి పరావర్తనం చెంది అవలివైపు నున్న మరో గండశిలపై పడింది. కాంతి పరావర్తనాన్ని చూసిన మరుక్షణం రియాక్టయ్యారు వారు.

కాంతి ప్రసరిస్తున్న దిక్కుకు పరుగెత్తారు. అర్ధ చంద్రాకారంలో ఉన్న మహేంద్రగిరి శిఖరంపై ఒకవైపు ఈ గండశిల ఉంటే యింకో మొనమీద ఆ గండశిల ఉంది.

అయితే ఆ గండశిలను చేరినవారికి అక్కడ యేమీ కనిపించలేదు. ఒక గుహగాని, రాతి పగులుగాని ఏమీ లేదు. నాపరాయిలా చదునుగా ఉన్న ఆ ప్రదేశంలో స్తంభంలా నిట్టనిలువుగా ఉన్నది ఆ గండశిలఒక్కటే....

ముగ్గురూ యేం చేద్దామన్నట్లు ప్రసాదరావువైపు

చూశారు. అతడి మొహం అప్పటికే వాడిపోయి ఉంది.

"ఇన్ని శ్రమలనూ ఓర్చి, యిన్ని కష్టాలు పడిందీ.... కేవలం. నో!.... అలా జరగడానికి వీల్లేదు" అనుకొని తల గట్టిగా విదలించాడు ప్రసాదరావు. అతని కన్నులు నలుదిక్కులా సునిశితంగా పరిశీలించసాగాయి. అప్పుడు.... అతడు గమనించాడు ఒక విచిత్రమయిన విషయం.

'అది.... ఆ గండశిల నీడ....!'

ఎండ ఎక్కుతున్నకొలదీ నీడ పడటం పెద్దదికావటం సహజం. కాని.... ఆ నీడ.... చాలా వేగంగా పెరుగుతుంది. కాదు ఎటో ప్రయాణిస్తూంది.

"హుర్రే!" అంటూ గట్టిగా అరిచాడు ప్రసాదరావు. అతని కళ్లలో ఏదో ఆనందం.

అందరూ అతడివైపే చూశారు ఆశ్చర్యంగా.

"లుక్.... లుక్ దట్ షాడో.... ఇటీజ్ గోయింగ్ అజ్ సమ్ వే" ప్రసాదరావు గొంతులో ఎంత అణచుకుందామనుకున్నా ఆగని ఎగ్జయిట్మెంట్.

మిగిలిన ముగ్గురూ అటే చూశారు. నిజమే. ఆ నీడ కదులుతుంది. పెద్ద కొండచిలువ జర, జరా ప్రాకుతున్నట్లు ఆ నీడ లోయలోకి సాగుతూంది.

"కమాన్.... లెటజ్ ఫాలో" అంటూ ప్రసాదరావు ముందుకు అడుగువేశాడు. మిగిలిన ముగ్గురూ అతన్ని అనుసరించారు. అదే సమయంలో ఒక ఈటె రివ్వుమని ఎగిరి వచ్చి వారి పాదాలముందు పడి 'ఖంగు' మని శబ్దం చేసింది. ఆ వెనుకే... వికృతమైన కేకలు వేసుకుంటూ వారిని సమీపించసాగారు__ఏ డెనిమిది మంది శబరులు.

ఈ నాగరిక బృందాన్ని రాత్రే కనిపెట్టారు శబరులు. చీకటిలో గూడెంలో ఉన్నవారికి అడవిలో మంటలు

కనిపించాయి. ముందు కార్చిచ్చులే అనుకొని నిర్లక్ష్యం చేశారు. కాని ఆ మంటలు ఒక వలయంలా కనిపిస్తూంటే సరికి అనుమానం వచ్చింది. వెంటనే ఆ లోయలోకి ప్రవేశించారు. కాని అప్పటికే ఈ నాగరిక బృందం ఆ స్థలాన్ని ఖాళీచేసి మహేంద్రగిరిని అధిరోహించడం మొదలు పెట్టారు.

శబరులు కూడా వారిని వెన్నాడుతూ గిరిశిఖరం చేరుకున్నారు.

యమకింకరులులా తమను సమీపిస్తున్న ఆ శబర వీరులను చూసేసరికి నిశ్చేష్టులయిపోయారు వీరు.నీడ మెల్లగా జరిగిపోతూ ఉంది. ఏమాత్రం తాత్సారం చేసినా ఆ నీడ దాడ తప్పిపోతుంది. అడుగు ముందుకు వేద్దామంటే ఆకలిగొన్న పులులులా....ఆ కొండజాతివారు తమనే చూస్తున్నారు.

ఏం చేయటం....??

నీడ మరింత ముందుకు జరిగింది. ఏం చేసినా వెంటనే చేయాలి. మహా అయితే యింకో రెండు, మూడు నిముషాలు. అది దాటితే నీడను పట్టుకోవడం బ్రహ్మతరం కూడా కాదు.

ఎలా?

అందరూ ఒకరినొకరు చూసుకున్నారు. ముందుగా తేరుకున్నవాడు కన్నారావు. యుద్ధంలో శత్రుపై నిపుల దాడిని త్రిప్పికొట్టే పై నికుడుగా మారిపోయాడు. అంతే. భుజంమీద నున్న రైఫిల్‌ను చేతిలోకి తీసుకున్నాడు.

కన్నారావు యుద్ధానికి సిద్ధపడుతున్నాడని తెలిసిన మరుక్షణం.... మెరుపులా రియాక్ట్ అయ్యాడు చంద్రం.

యింతకు క్రితం తనమీదకు విసరబడ్డ ఈటె వారి కాళ్ళ దగ్గరే వుంది. ఎప్పుడు కాలును విసిరాడో.... ఆ ఈటె యిప్పుడు అతని చేతిలోనికి వచ్చిందో.... రెండు ముక్కలయి ఒక్కొక్క చేతిలో ఒక్కొక్క ముక్క సిద్ధంగా ఉంది.

అతని వేగానికి ఆశ్చర్యపోయారు శబరులు. అక్కడే నిల్చుండిపోయారు. అదే మంచి సమయమనుకున్నాడు. వారు తేరుకోనే లోగానే ఏమైనా చేయాలి అనుకున్నాడు కన్నారావు,

"ప్రసాద్! నువ్వు రాంబాబూ ఆ నీడను వెంబడించండి. నేనూ, చంద్రం వీరి పని చూస్తాం. కమాన్.... క్విక్!"

అంటూ మెల్లగా చెప్పాడు కన్నారావు.

రైఫిల్ గురిచూసి ఒక శబరుని గుండెలకేసి కాల్చాడు. అంతే..! గుండె పగిలిపోయి రక్తం వరదలవుతూండే ఆ కొండజాతివాడు అక్కడికక్కడే మరణించాడు.

అంతే! తమలో ఒకడు మరణించేసరికి ఆ శబరులలో యెక్కడలేని ఆవేశం వచ్చింది. పిచ్చికోపంతో, తెగింపుతో ఒక్కుమ్మడిగా వారిదరిమీదా పడ్డారు.

శత్రువులు ఒక్కసారి మీదపడటంతో తుపాకీ పనికి రాకుండా పోయింది. తుపాకీని విడిచి తల్వార్ తీసేలోగా ఒక శబర వీరుడు తన చేతిలోని బల్లెంతో కన్నారావు ఎడం భుజంమీద పొడిచాడు. రక్తం కాల్వలు కడుతున్నా భరించలేని నొప్పితో భుజం క్రిందకు వాలిపోతున్నా, ఒక్క చేతితోనే తల్వార్ త్రిప్పుతూ యుద్ధం చేయసాగాడు కన్నారావు.

తన చేతిలోని రెండు స్టిక్స్‌ను ఉపయోగిస్తూ తనమీద

పడ్డ శత్రువులను ఎదొర్కొన్నాడు చంద్రం. అతని శరీరం వారి మధ్య బొంగరంలా తిరుగుతుంది. అతని చేతులు మెరుపుతీగెల్లా కదులుదున్నాయి. తనమీదకు విసురుతున్న బల్లేలను ఒక స్టిక్‌తో అడ్డుకుంటూ బల్లెం మొన ఉన్న మరో స్టిక్‌తో శత్రువులను గాయపరచసాగాడు.

కుడికాలి బొటనవేలిపై ఆధారాన్ని ఉంచి, రౌండ్ సర్కిల్‌లో గిర్రున తిరుగుతూ ఎడమకాలి పాదంతో అతడు రిలీజ్ చేసిన సైడ్ కిక్స్‌కి ఇద్దరి శబరుల ప్రక్క టెముకలు ఫెళ ఫెళమని విరిగిపోయాయి.

పోరు ఘోరంగా జరుగుతూంది.

## 7

ప్రసాదరావు, రాంబాబు ఆ నీడవెంటే పరుగెత్తసాగారు.

సరిగ్గా అరగంటసేపు ఆగకుండా సాగిన ఆ నీడ ఒక రాతి గుట్ట దగ్గర ఆగిపోయింది. ఆయాసంతో వగరుస్తూ.... ఆ రాతి గుట్టను చేరుకున్నారు, ప్రసాదరావు, రాంబాబు.

అది పెద్ద నల్లబండల గుట్ట. ఒక్కొక్క బండ చిన్న సైజు గున్నఏనుగుల్లా ఉన్నాయి.

"ఈ బండలలో యెక్కడని వెదకటం?" అంటూ నిస్సత్తువుగా ఒక బండ మీద కూలబడ్డాడు రాంబాబు.

ప్రసాదరావు మాత్రం పట్టువదలని విక్రమార్కుడిలా ఆ బండ లన్నింటినీ శల్యపరీక్ష చేస్తున్నాడు.

బండలకూ, బండలకూ మధ్య ఏవైనా చీలికలు వుంటాయేమోనని పరిశీలించాడు. ఎంతసేపు గాలించినా

ప్రయోజనం మాత్రం శూన్యం.

ప్రసాదరావు కూడా నిస్సహాయంగా రాంబాబు ప్రక్కనే చతికిలబడ్డాడు. కిట్ లోని వాటర్ బాటిల్ తీసి రెండు గుక్కలు నీరు త్రాగాడు. అప్పటికి కాస్త సేద దీరిన రాంబాబు మొలనున్న పేష్కావ్ తీసి ఏవో అడవి దుంపలను త్రవ్వి తీయసాగాడు.

త్రవ్వుతున్న రాంబాబును చూసేసరికి ప్రసాదరావు మెదడులో ఒక ఆలోచన తట్టింది. ఏదో ఆశ....అతని కళ్ళలో పొడచూపింది. వెంటనే మొలలోని పేష్కావ్ ను తీశాడు.

"రాంబాబూ! మనం వెంబడించిన నీడ ఆగిపోయింది సరిగ్గా యిక్కడే కదూ" ఏవో పిచ్చిమొక్కలు మొలిచిన ఒక స్థలాన్ని చూపిస్తూ అడిగాడు ప్రసాదరావు.

త్రవ్విన దుంపలను పైకి తీయబోతున్నవాడల్లా ఆగి వింతగా ప్రసాదరావు వంక చూసి 'ఔనన్నట్లు' తలూపాడు రాంబాబు.

అంతే! చేతిలోని పేష్కావ్ తో ఆ స్థలాన్ని త్రవ్వసాగాడు ప్రసాదరావు. 'ఏదో కారణం లేనిదే ప్రసాదరావు యే పనీ చేయడని' రాంబాబుకు తెలుసు. అందుకే చేతిలోని దుంపలను అక్కడే పడేసి ప్రసాదరావుకు తాను కూడా సాయం చేయసాగాడు.

సరిగ్గా అరగంటసేపు ఆగకుండా త్రవ్వేసరికి వారి శరీరాలు చెమటతో ముద్దలయిపోయాయి. అరచేతులు కందిపోయి ఎర్రవారాయి. విసుగుపుడుతుంటే 'ఇంకెంత సేపు త్రవ్వాలి' అని రాంబాబు అడుగుదామనుకున్న సమయంలో అతని పేష్కావ్ కు 'ఖంగు' మంటూ ఏదో తగిలింది. కాస్త మట్టిని తొలగించి చూశారు. నున్నగా

చెక్కబడి వుంది ఆ శిల. రెట్టించిన ఉత్సాహంతో తవ్వ సాగారు వారు. మరో పదిహేను నిముషాలు తవ్వేసరికి ఆ శిల పూర్తి రూపం కనిపించింది.

అది.... నాగ శిల.

గుప్తమహేంద్రం ప్లాన్ దొరికిన వేమురుతోపులోని శిలను ముమ్మూర్తులా పోలిన నాగశిల.

దానిని పైకి పెకలించడానికి ప్రయత్నించసాగారు వారు. కాని ఎంత శ్రమించినా దానిని కదపలేక పోయారు. చివరిప్రయత్నంగా దానిని తిరగలిరాయిలా తిప్పి పెకలిద్దామని కదిపారు. చిత్రంగా ఆ నాగశిల ప్రక్కకు తిరగసాగింది.

అప్పుడు వారికి వినవచ్చింది ఒక వికృత శబ్దం. చెవులు చిల్లులుపడేలా వినిపించిన ఆ శబ్దం వంక చూశారు వారు. ఆ క్షణం వారికి కన్పిస్తున్న దృశ్యాన్ని చూసి నిశ్చేష్టు లయిపోయారు. వారి కళ్లల్లో తొలుత అపనమ్మకం.... ఇది నిజమేనా అన్న భావం. చైతన్యంలోకి వచ్చేసరికి వారి ముఖాలలో నిర్వచించలేని ఆనందం. యిన్ని కష్టాల కోర్చినా సాధించామన్న విజయగర్వంతో పగలబడి నవ్వుకున్నారు.

వారి యెదురుగా వున్న ఒక పెద్ద గండశిల ప్రక్కకు తప్పుకుంటూంది. ఎదురుగా సన్నని దారి.... ఆ లోపల అస్పష్టంగా అగుపిస్తున్న గుహ, అందులో.... ఏదో వెలుగు.... అదే గుప్తమహేంద్రమా....??

## 8

కన్నారావు ఒక చేతితోనే తల్వార్ త్రిప్పుతూ శత్రువులను అడ్డుకుంటున్నాడు—

కాని ఒకవంక ఎడమ భుజం నుండి రక్తం ధారా

పాతంగా కారుతూ ఉండటంతో....నీరసం ముంచుకు వస్తూంది. ఏదో మైకంతో కన్నులు మూతలు పడు తున్నాయి. నిస్త్రాణతతో వళ్లు తూలుతూంది. తన అంత్యకాలం సమీపించిందని గ్రహించాడు కన్నారావు.

'సైనికుడు చనిపోయే చివరి క్షణంలో కూడా తన శతృవును చంపడానికే ప్రయత్నిస్తాడు.'

'యస్! ఐ యామ్ ఎ సోల్జర్....బ్రేవ్ సోల్జర్' అనుకున్నాడతడు.

శరీరంలోని సత్తువునంతా కూడదీసుకొని ఒక్కసారి తల్వార్‌ను విసిరాడు. ఎదురుగా వున్న శబరివీరుని తల పుచ్చకాయలా దొర్లుకుంటూ లోయలోకి వెళ్ళి పోయింది. ముందుకు తూలిన కన్నారావు వెన్నులో నుండి, కడుపును చీల్చుకుంటూ వచ్చింది వెనుక నుండి మరో శబరుడు విసిరిన ఈటె.

ముందుకు తూలిపడ్డాడు కన్నారావు. రాతి నేలకు ముఖం కొట్టుకోవడంతో ముఖమంతా రక్తసిక్తమైంది. అతనికి అడుగు దూరంలో నేలమీద పడివుంది....

అతని రైఫిల్.

మెల్లగా ప్రాకుతూ రైఫిల్‌ను అందుకోవడానికి ప్రయత్నించసాగాడు. వెన్ను నుండి కడుపులోనికి పొడుచుకోనివచ్చిన ఈటె....ప్రాకుతూంటే ప్రాణాలను తోడేస్తుంది. అయినా యేదో మొండి పట్టుదల—తనను చంపిన శబరుడు వికటంగా నవ్వుతున్నాడు. ఆ నవ్వే కొండంత బలాన్నిచ్చింది కన్నారావుకు.

రక్తసిక్తమయిన ముఖంతో, సగం తెగిన భుజంతో వెన్నులోనుండి కడుపుగుండా బయటకు వచ్చిన ఈటెతో తూలుతూ నిలబడ్డ కన్నారావు నరరూప రాక్షసుడులా

ఉన్నాడు. అతని చేతిలో రైఫిల్ వుంది. కన్నారావు రూపం చూసిన ఆ శబరుడు భయంతో వణికిపోయాడు. కన్నారావు కన్నులు మూతలు పడుతున్నాయి. లోక మంతా చీకటి. అతని వేలు మాత్రం ట్రిగ్గర్ పై బిగుసు కుంది. కన్నారావు ప్రాణమే ముందు పోయిందో... తుపాకీ గుండే ముందుకు దూసుకుపోయిందిదో...

"ఢాం!!..." అన్న శబ్దంతో అటు శబరుడు, యిటు కన్నారావు యిద్దరూ నేల మీదకు వాలి పోయారు.

## 9

గండశిల పూర్తిగా ప్రక్కకు తొలగిపోయాక రెండు నిముషాలపాటు ఆ గుహనే చూస్తూ ఉండిపోయారు ప్రసాదరావు, రాంబాబు.

గుహ ముఖద్వారం వెడల్పుగా వున్నా రాను, రాను మరీ సన్నగా వుంది. కిట్స్‌లోని టార్చ్‌లైట్స్ తీసి వెలి గించి ఆ గుహలోనికి ప్రవేశించారు వారు. గుహ లోపలికి దారి ఇరుకుగా వుండటంతో వంగి నడవవలసి వచ్చింది. కొంత దూరం పోయేసరికి మోకాళ్ళమీద ప్రాకవలసి వచ్చింది.

సుమారు ఒక అరగంటసేపు ప్రయాణించేసరికి ఆయా సంతో వారి గుండెలు బరువెక్కసాగాయి. ఆ గుహలో గాలి వచ్చే మార్గం లేనందున, ఆక్సిజన్ అందక వారికి ఊపిరి తీయడంకూడా కష్టంగా వుంది. దూరంగా ఏదో కాంతి....ముందు అస్పష్టంగా అగుపించిన కాంతి ఇప్పుడు జిగేల్ మంటూ కనులు మిరుమిట్లు గొలుపుతూంది.

ఇంకో పది, పదిహేను గజాల దూరం అలా ప్రాకు కుంటూ వెళ్లేరు. ఇంకొన్ని నిముషాలు ఇలాగే ప్రయాణం

చేయాల్సి వస్తే....ఊపిరి అందక తాము మరణించడం ఖాయం అనుకున్నారు వారు.

'పోనీ వెనక్కి తిరిగి వెళ్ళిపోతే' అన్న ఒక ఆలోచన మనసులో మెదిలింది రాంబాంబుకు. 'బ్రతికివుండిన సుఖములు బడయవచ్చు ఛీ... ఛీ! వెధవ ఆలోచన!' అనుకున్నాడతడు.

ఎదురుగా కోట్లకొలదీ రూపాయల విలువచేసే నిధి కాంతులు కన్పిస్తూంటే....యిన్ని శ్రమలకూ ఓర్చి యిప్పుడు వెనుతిరగడమా?

'నో....ఇంపాజిబుల్.'

పళ్ళ బిగువున లేని శక్తిని తెచ్చుకొని వారు మెల్లగా ప్రాకసాగారు. ఆక్సిజన్ అందక వారి ఊపిరితిత్తులు మండసాగాయి. వారి శ్వాస రంధ్రాలనుండి సన్నగా రక్తం స్రవించసాగింది. తమ అంత్యకాలం సమీపించిందని గ్రహించారు వారు. నిస్సహాయంగా ఒకరినొకరు చూసుకున్నారు.

ఇప్పుడు వారు వెనుకకుకూడా వెళ్ళలేరు. వారి శరీరంలోని శక్తి పూర్తిగా హరించుకుపోయింది. ఇప్పుడువారు కోరుకొంటుంది....భగవంతుని మౌనంగా ప్రార్థిస్తూంది... 'గోల్డెన్ కోబ్రా' గురించి కాదు. ఇంత ప్రాణవాయువును ప్రసాదించి తమ ప్రాణాలు రక్షించమని.

చివరిసారిగా కనులు జిగేల్‌మంటూ వెలుగు ప్రసరిస్తున్న గోల్డెన్ కోబ్రాను చూద్దామని మరో ఐదడుగుల దూరం జర జరా ప్రాకాడు ప్రసాదరావు. అక్కడ గుహ మార్గం కొంత విశాలంగా కన్పించింది. తలెత్తి చూసేసరికి మార్గం రాను రాను, విశాలంగా పెద్ద హాలులా కన్పించసాగింది.

ప్రసాదరావు సంజ్ఞను అందుకొని రాంబాబుకూడా నెమ్మదిగా ప్రాకసాగాడు. వారి చెవులనుండి వేడి గాడ్పులు రాసాగాయి. నాసికా రంధ్రాలనుండి కారుతున్న రక్తం పెదవులమీదకు జారి....నోటికి 'ఉప్పగా' తగిలింది. వారి కన్నులు మూతలు పడుతున్నాయి. కళ్ళ ముందు ఏవో నల్లని పరదాలు దించినట్లు అంతటా చిక్కటి చీకటి.

ఒకటి....రెండు....మూడు....నాలుగు....

ఒక్కొక్క అడుగే ప్రాకుతుంటూ వస్తున్నారు వారు. తన జీవితపు చివరి ప్రయత్నంగా..కిట్ లోని బాటిల్ను పైకితీసాడు ప్రసాదరావు. అతడి చేతులు సన్నగా వణకసాగాయి. అప్పటికే రాంబాబు నిస్త్రాణంగా నేలమీదకు వాలిపోయాడు. అతికష్టంమీద బాటిల్ మూతను తొలగించాడు ప్రసాదరావు. బాటిల్ను పెదవుల దగ్గరకు చేర్చాడు. అప్పటికే అతని శరీరం జోగుతుంది. తల గిర్రున తిరుగుతున్న అనుభూతి. అలాగే వెనక్కు వాలిపోయాడు. అతని చేతిలోని వాటర్ బాటిల్ నేలమీదపడి నీళ్ళు ధారగా కారసాగాయి.

# 10

తుపాకీ మ్రోత వినిపించేసరికి ఒక్కసారి అటుపక్క చూశాడు చంద్రం. తమ నేస్తం కన్నారావు మరణం చూసేసరికి షాక్ తిన్నాడు.

ఒక ప్రత్యర్థి మరణించేసరికి 'చంద్రం' మీదకు మూకుమ్మడిగా ఎటాక్ చేశారు మిగిలిన శబరులు. కన్నారావు మరణాన్ని చూసిన షాక్నుండి యింకా తేరుకోలేదు చంద్రం. తేరుకొని వారిని యెదుర్కొనే లోపలనే నాలుగు ఈటెలు చంద్రం శరీరాన్ని గాయపరిచాయి.

తన శరీరంపైన రక్తం చూసిన మరుక్షణం ఉగ్రుడయి పోయాడు చంద్రం. అతని నోటి వెంట బయటకు వచ్చింది భయంకరమైన 'కుంగ్ ఫూ' సింహనాదం. గాలిలోకి పక్షిలా ఎగిరాడు అతడు. అతడి ఎడమకాలు మడచి వుంది. కుడికాలు తిన్నగా వెళ్ళి ఒక శబరుని తలను తాకింది. ఇటుకరాతి గోడలను సైతం ముక్కలు చేయగల ఆ 'కిక్' తగిలిన మరుక్షణం ఆ శబరుని తల రెండు ముక్కలుగా వీడిపోయింది. క్రిందకు వాలిన మరుక్షణం ఈటె మొన వున్న స్టిక్‌ను అండర్ త్రోలో విసిరాడు. అది సూటిగా వెళ్ళి మరో శబరుని కంఠం మధ్య గుచ్చు కుంది. 'అమ్మా' అన్న కేకకూడా వేయకుండానే అతని ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

అయితే మిగిలిన ఇద్దరు శబరులలో ఒకడు విసిరిన ఈటె తొడలో బలంగా గ్రుచ్చుకోవడంతో వెల్లకిలా పడ్డాడు. క్రిందపడిన చంద్రాన్ని చూసి వికటంగా నవ్వుతూ అతడిని సమీపించసాగారు వారు.

చంద్రాన్ని వారు చాలా తక్కువగా అంచనా వేశారు. తనకు అందుబాటులో వారు వచ్చిన మరుక్షణం మెరుపులా రియాక్ట్ అయ్యాడు చంద్రం.

తన తొడలో గ్రుచ్చుకున్న ఈటెను లాగడం దాన్ని బలంగా ఒక శబరుని కడుపులో గ్రుచ్చటం కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయాయి. మిగిలిన ఆ ఒక్క శబరుడు చంద్రాన్ని వెర్రిగా చూసి వెనుతిరిగాడు.

"లుంబా....లుంబా....లుంబా" అంటూ గొంతెత్తి అరుస్తూ లోయవైపు పారిపోసాగాడు.

కాని చంద్రం..తన మొలలోని పేష్కవ్‌ను బలంగా విసరటంతో అది ఆ శబరుని వెన్నులో దిగబడి..అక్కడే

కూలిపోయాడు.

తమ శత్రువులందరూ మరణించటంతో తృప్తిగా నిట్టూర్చాడు చంద్రం. కాని 'కన్నారావు' మరణం అతడిని బాగా కృంగదీసింది.

గాయమైన తొడ, వంటిమీద మిగిలిన నాలుగైదు గాయాలనుండి రక్తం స్రవిస్తుంటే విరిసిన మోదుగుపూల చెట్టులా వున్నాడు చంద్రం. మెల్లగా కుంటుకుంటూ కన్నారావు శవాన్ని సమీపించాడు. ఆర్ద్రంగా అతని ఫాలాన్ని ముద్దుపెట్టుకున్నాడు. యివే నే సర్పించే పుష్పాలన్నట్లు రెండు కన్నీటిబొట్లు రాలాయి చంద్రం చంపలమీదుగా.

"గుడ్ బై! గుడ్ బై మై ఫ్రెండ్!" గొంతు దుఃఖంతో పూడుకుపోతుంటే కన్నారావు శవానికి సైనిక వందనం చేసి, ప్రసాదరావు, రాంబాబు వెళ్ళిన దిక్కున నడిచాడు చంద్రం.

తొడమీద గాయంనుండి రక్తం విపరీతంగా స్రవిస్తుంది. కర్చీఫ్‌తో కట్టినా రక్తప్రసరణం ఆగటంలేదు. అడుగుతీసి అడుగువేస్తుంటే నరాలు బాధతో జివ్వుమని లాగేస్తున్నాయి. మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ నడవసాగాడు.

దాహంతో నోరు పిడచకట్టుకుపోతుంది. కిట్‌లోని వాటర్ బాటిల్.. ఫైట్‌లో క్రిందపడి నీళ్ళు నేలపాలయ్యాయి. కిట్ అంతా గాలిస్తే ఒక వాడిన నిమ్మకాయ దొరికింది. ఆ సమయంలో అదే అమృతంలా కన్పించింది. పుల్లని నిమ్మరసం నోటికి తగిలేసరికి ప్రాణం లేచి వచ్చింది.

# 11

సుమారు గంటసేపు శ్రమించి..... 'గుప్త మహేంద్రం' వున్న గుహ ద్వారాన్ని చేరుకున్నాడు చంద్రం. 'ఇదేనా గుహ....! ఇందులో తన మిత్రులు ప్రవేశించి వుంటారా? వుంటే తనూ లోపలకు వెళ్ళడమా? మానటమా' అని సందేహిస్తూ నిలుచున్నాడు చంద్రం.

అదే క్షణంలో అతని భుజాలమీద పడింది పిడుగు పాటులాంటి ఒక దెబ్బ. ముందుకు తూలి ఐదారడుగులు దొర్లుకుంటూపోయి పడ్డాడు చంద్రం...తనను యెవరు కొట్టారు చెప్మా? అని ఆశ్చర్యంగా చూశాడు చంద్రం.

ఎదురుగా రక్తంలా వున్న కళ్ళతో, సుమారు ఆరు అడుగుల పైన పొడవు వున్న ఒక నరవానరం. అది తన చేతులతో ఒక్కసారి తన గుండెలను బాదుకుంటూ వికృతంగా అరిచింది. ఆ శబ్దం వికృతంగా,..ఏదో అరు పులా వున్నా..జాగ్రత్తగా పరిశీలించి వింటే 'లుంబా' అని అరచినట్లు అనిపిస్తుంది.

అంటే....ఆ శబరుడు చనపోతూ అరచింది....పిలి చింది ఈ నరవానరాన్నేనా....? చంద్రం మనసులో ఆలోచనలు.

కాని....ఆ నరవానరం తననే సమీపిస్తుండేసరికి తాను కూడా యుద్ధానికి సిద్ధమయ్యాడు. అయితే ఆ నర వానరాన్ని ఎదుర్కొనడానికి చంద్రం దగ్గర ఆయుధ మేమీ లేదు.

అరచేతులను కత్తులలా బిగించి ఆ వానరాన్ని యెదు ర్కొనసాగాడు. కాని తొడమీద గాయం కదిలి రక్తం స్రవిస్తూండటంతో చంద్రం అనుకున్నంత వేగంగా కదలలేకపోతున్నాడు.

చంద్రం కొట్టిన 'జూడో' దెబ్బలకు ఆ నరవానరం బాధతో అరుస్తూ రెండడుగులు వెనక్కి వేసింది. కాని ఆ నరవానరం పంజా దెబ్బలకు కండలు ఊడి చంద్రం శరీరం నిస్సత్తువుగా తూలసాగింది. రక్తం విపరీతంగా కారటంతో నిస్త్రాణగా వుంది.

తన ప్రత్యర్థిలోని బలహీనతను కనిపెట్టింది నరవానరం. రెండు చేతులను ఎత్తి చంద్రం గుండెలమీద చరిచేసరికి రబ్బరుబొమ్మలా ఎగిరి దూరంగా పడ్డాడు. కాస్త దూరంలో వున్న నాగశిల ఆ నరవానరాన్ని ఆకర్షించింది. ఆ గోతివైపు నెమ్మదిగా అడుగులు వేయసాగింది నరవానరం.

ఏదో మైకం తనను క్రమ్ముతుంటే పడిన చోటునుండి లేవలేక నిస్సహాయంగా ఆ నరవానరాన్నే చూడసాగాడు చంద్రం.

## 12

వాటర్ బాటిల్ లో నుండి ఒలికిన నీరు పారుతూ వచ్చి రాంబాబు ముఖాన్ని చేరేసరికి రాంబాబుకు కాస్త తెలివి వచ్చింది. అలా ఆ బురద నీటినే ముఖానికి పూసుకున్నాడు.

'తను చనిపోలేదు. యింకా బ్రతికేవున్నాడు' రాంబాబుకన్నులు ఒక విచిత్రమయిన ఆనందంతో మెరిశాయి. అలా రెండు క్షణాలపాటు అయోమయ స్థితిలోనే ఉండిపోయాడు. అప్పుడు అతడు ఒక కొత్త విషయాన్ని గుర్తించాడు. అంతవరకూ అతడు గమనించనిది.

అది....ప్రాణవాయువు.

ఇప్పుడు యెక్కడినుండో చల్లని గాలి వీస్తుంది.

గుండెలనిండా గాలిని పీల్చుకున్నాక ప్రక్కన పడివున్న ప్రసాదరావును చూశాడు. అతని ప్రక్కనే పడివున్న వాటర్ బాటిల్‌ను చూశాడు.

అప్పుడు గుర్తుకువచ్చింది తన కిట్ లోని వాటర్ బాటిల్ విషయం. 'ఫూలిష్ ఫెలో' అది గుర్తురాక ఆ బురదనీటినే ముఖానికి రాసుకున్నాడు తను.

వాటర్ బాటిల్‌ని తీసి ప్రసాదరావు ముఖంపై నీళ్ళు చిలకరించాడు. కాసిన్నినీళ్ళు గొంతులో పోశాక ప్రసాద రావు కూడా తేరుకున్నాడు.

చల్లగా వీస్తున్న గాలిలో కాసేపు సేదదీరాక ఓ పది అడుగులు నడిచారు. అక్కడ నుండి యింకో గుహ వుంది. మధ్యలో చిన్న చీలిక. ఆ గుహలోకి చూసిన వారు ఆనందాశ్చర్యాలతో శిలా విగ్రహాల్లా అయి పోయారు.

ఆ గుహ మధ్యలో వుంది నిలువెత్తు నాగేంద్రుని విగ్రహం. పూర్తిగా మేలిమి బంగారంతో చేయబడ్డ ఆ నాగేంద్రుని కన్నుల స్థానంలో మెరుస్తున్నాయి అపు రూపమైన రెండు వజ్రాలు.

"ది గోల్డెన్ కోబ్రా విత్ రెడ్ డయిమండ్స్" అప్రయత్నంగా అన్నాడు రాంబాబు.

ఆ గుహంతా వింత కాంతులతో వెలిగిపోతూంది. ఆ అపురూపమైన దృశ్యాన్ని చూస్తూ మాటా, పలుకు లేకుండా నిలుచుండిపోయారు వారు. ముందుగా ప్రసాద రావు తేరుకున్నాడు.

తన మొలకు వున్న స్టీల్ గొడ్డలిని రాంబాబు చేతికి యిచ్చి లోపలకు వెళ్ళమన్నట్లు సైగ చేశాడు. ఒక చేతిలో వంకీ కర్ర, మరో చేతిలో స్టీల్ ఏక్స్‌తో ఆ గుహలో

అడుగు పెట్టాడు రాంబాబు.

గొడ్డలి యెత్తి ఆ బంగారు నాగేంద్రుని శిరస్సుపై ఒక్క దెబ్బ వేశాడు. 'ఖంగ్' మన్న శబ్దంతో ఆ గుహ మార్మోగిపోయింది. మరుక్షణం కొన్ని వేల 'హూత్కారా లతో' ఆ గుహ నిండిపోయింది.

రెండవసారి దెబ్బ వేయడానికి గొడ్డలి ఎత్తిన రాంబాబు అలానే నిల్చుండిపోయాడు, ఆ విగ్రహం వెనుక నుండి వచ్చి విగ్రహానికి, రాంబాబుకు మధ్య పడగ విప్పుకొని వుంది పన్నెండడుగుల పొడవున్న శ్వేతనాగు. తన చుట్టూ యేవో బుసలు వినిపించేసరికి ఒక్కసారి చుట్టూ పరకాయించి చూశాడు రాంబాబు.

కొన్ని వందల పాములతో సెల్‌లో కొన్ని రోజుల పాటు గడిపిన రాంబాబుకు కూడా ఆ దృశ్యం చూసే సరికి గుండెల్లో వణుకు పుట్టింది.

రాంబాబును చుట్టు ముట్టి వున్నాయి కొన్ని వందల సర్పాలు. అవి నల్లత్రాచులు, తెల్ల త్రాచులు. ఒక్క టేమిటి అన్నీ జాతి సర్పాలే. అందులో యే ఒక్కటి కాటేసినా....ఆ మనిషి చావు తథ్యం. మరి అన్నీ ఒక్క సారి కాటేస్తే....?

శ్వేతనాగు రాంబాబును సమీపించసాగింది. తన చేతిలోని వంకీకర్రతో ఆ నాగును పక్కకు తొలగించ డానికి ప్రయత్నించసాగాడు రాంబాబు.

'ఏంటీ పాయిజన్' ఇంజక్షన్ బాటిల్‌లోని ద్రవాన్ని సిరెంజ్‌లో యెక్కించి సిద్ధంగా వున్న ప్రసాదరావు భయంతో వణికిపోతున్నాడు. అతని చేతిలోని సిరెంజ్ యే క్షణంలో నైనా క్రిందకు రాలిపోవడానికి సిద్ధంగా వుంది.

అంతవరకూ విగ్రహాం పాదాల చెంత చుట్టలుచుట్టు కొని వున్న నల్లత్రాచు చటుక్కున కదిలింది. శ్వేత నాగుపై దృష్టిని కేంద్రీకరించిన రాంబాబు తన కాలిని చుట్టుకుంటూ పైకి కదులుతున్న నల్లత్రాచు స్పర్శతో భయంతో కంపించిపోయాడు.

రాంబాబు మరో పాదాన్ని చుట్టి నెమ్మదిగా అతని తొడల పైకి ప్రాకసాగింది ఒక కట్లపాము. రాంబాబు చేతిలోని వంకీ కర్ర, గొడ్డలి యెప్పుడో నేలమీదకు జారిపోయాయి.

తోకమీద నిలబడి....బుసలు కొడుతూంది శ్వేత నాగు. చుట్టూ పద్మవ్యూహంలోని సైనికుల్లా మిగిలిన విష సర్పాలు.

పాములంటే జీవితంలో మొదటిసారి భయం కలిగింది రాంబాబుకు. తన చావు ఆసన్నమైందని తెలిసిపోయింది అతనికి.

అందుకే మొండిధైర్యంతో ముందుకు అడుగు వేశాడు రాంబాబు. రాంబాబు అడుగు ముందుకుపడిన మరుక్షణం పడగను వంచి అతని నాభిమీద కసిగా కాటు వేసింది శ్వేతనాగు. అతని రెండు తొడలమీదా తమ కోరలను దించాయి నల్లత్రాచూ, కాట్లపామూ.

నోటిలో నుండి నురగలు గ్రక్కుతూ నేలమీదకు వాలిపోయాడు రాంబాబు. రాంబాబు నాభిమీద శ్వేత నాగు కాటువేసిన మరుక్షణమే ప్రసాదరావు చేతిలోని సిరెంజ్ నేలమీదకు జారి ముక్కలయిపోయింది. రాంబాబు శవంమీదకు ప్రాకుతున్న ఆ విషసర్పాలను చూసే సరికి ప్రసాదరావు గొంతు ఆర్చుకుపోయింది.

ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని అతడు వెనుతిరిగి

పరుగెత్తసాగాడు.

'నువ్వెక్కడికి పోతావన్నట్లు' నెమ్మదిగా కదులుతూ అతడిని వెంబడించసాగింది శ్వేతనాగు. మిగిలిన విష సర్పాలు ఆ గుహలోనే వుండిపోయాయి.

ప్రసాదరావు ప్రాకుతూ, దొర్లుతూ పరుగెత్తుతున్నాడు. మోకాళ్ళు, మోచేతులూ, గుండె అంతా కొట్టుకుపోయి రక్తసిక్తం అయిపోయింది. ఆయాసంతో గుండెలు ఎగిసిపడుతున్నా ఎక్కడా ఆగటంలేదు.

ఆగిన మరుక్షణం తను శ్వేతనాగు కోరలకు బలికాక తప్పదని—ప్రసాదరావుకు తెలుసు. అందుకే ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని మరీ పరుగెత్తుతున్నాడు. అతని ముఖం భయంతో పాలిపోయి వుంది.

పది అడుగుల దూరంలో గుహ ద్వారం కన్పించేసరికి యేదో ఆశ....పొడచూపింది. అడుగులు తడబడుతుంటే వేగం పెంచాడు.

ఇంకో ఐదు అడుగులు. అంతే. ఆ గుహ దాటితే చాలు. తన అనుభవం ప్రకారం శ్వేతనాగు ఆ గుహను దాటి రాదు. పైగా గుహను మూసేయవచ్చును. ఇంకో మూడు అడుగులు....చాలు తన ప్రాణాలు నిలవడానికి. ప్రసాదరావు గుండెల్లో ఆత్రం.

అదే సమయంలో నరవానరం ఆ నాగశిలను పెకలించి వేసింది. అంతవరకూ ఆ నాగశిలను పెకలించడానికి శ్రమించిన నరవానరం ఆ శిలను పెకలించిన ఆనందంతో వికృతంగా అరిచింది. ఆ నాగశిలను రెండు చేతులలో పట్టుకొని చంద్రంవైపు అడుగులు వేయసాగింది.

ఆ నరవానరం ఉద్దేశం గ్రహించిన చంద్రం భయంతో

పణికిపోయాడు.

నరవానరం నాగశిలను పెకలించిన మరుక్షణం గుప్త మహేంద్ర గుహా ద్వారం మూసుకుపోయింది.

చివరి అడుగులో గుహ బయటకు రావాల్సిన ప్రసాద రావు తలకు గృహా ద్వారమైన గండశిల కొట్టుకుంది. అంత హఠాత్తుగా మూసుకున్న ఆ గుహా ద్వారంవైపు పిచ్చిగా చూశాడు ప్రసాదరావు.

అతని ఎదురుగా కోరలు సాచి బుసలుకొడుతూంది శ్వేతనాగు.

## ఉప సంహారం:

చంద్రం తలను నాగశిలతో బ్రద్దలుకొట్టి అడవులలోకి పారిపోయింది నరవానరం.

గుప్తమహేంద్రానికి మార్గమైన ఆ గృహాద్వారం శాశ్వతంగా మానుకోవడంతో....గుప్త మహేంద్రం రహస్యం....ఆ బంగారు నాగేంద్రుని విగ్రహం....కథగానే మిగిలిపోయింది.

మందసా, పర్లాకిమిడి, ఇచ్ఛాపురం ప్రాంతాలలో గుప్తమహేంద్రం నిధిరహస్యం....అందరూ చెప్పుకునే బహిరంగ రహస్యం.

—: అయిపోయింది :—

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

మరో అయిదు నిమిషాల తర్వాత మేజర్ ఆ చెట్టు కిందికి వచ్చాడు. అటు యిటు చూస్తూ సరాసరి తన క్వార్టర్సువైపు వేగంగా పరుగెత్తుకుంటూ వెళ్ళి పోయాడు.

జ్వలిత వేగంగా ఆలోచిస్తోంది! అతను మళ్ళీ తిరిగి వస్తాడు. అతను గ్లాస్ హౌస్‌కి వెళ్ళిపోయేవరకు ఆగితే మంచిదేమో! తను తొందరపడి చెట్టు దిగితే దొరికిపో తుంది. పిట్టను కాల్చినట్టు కాల్చేస్తాడు.

పదిహేను నిమిషాల్లో వీరేంద్ర తిరిగొస్తూ కనిపిం చాడు. అతని ముఖంలో ఆందోళన ఆశ్చర్యం కొట్టొచ్చి నట్టు కనిపిస్తున్నాయి. తను బహుశా తప్పించుకొని యిల్లు చేరిపోయిందని నిర్ధారణ చేసుకొని వుంటాడు. అక్కడ వాచ్‌మన్ కుక్ వీరయ్య, ఆ బెండర్లు వున్నారు.

వాళ్ళ కళ్ళుబడటం యిష్టంలేక తిరిగొచ్చేస్తూన్నాడు! మళ్ళీ మరోసారి తనకోసం ప్రయత్నించక మానడు! తనని అంతం చేసేవరకు నిద్రపోడు!

ఆమె ఆలోచన తప్పని, మరి కొద్ది నిమిషాల్లోనే తేలిపోయింది. జీప్ తోలుకుంటూ మహా వేగంగా వస్తూ కనిపించాడు బీరేంద్ర. చెట్టు ఆకులు కొమ్మలతో కప్పి పెట్టినట్టు జీప్ బోనెట్ మీద కొమ్మలు, ఆకులు కనిపిస్తూన్నాయి. ఓపెన్ టాప్ జీప్ అది! వెనక కేంప్ కాట్ చుట్టచుట్టి పెట్టబడి వున్నది.

బీరేంద్ర పారిపోతున్నాడు. అతన్ని వెళ్ళనివ్వకూడదు. తన వాళ్ళకి తెలియచెయ్యాలి. కాని యెలా? తను క్వార్టర్సుకి వెళ్ళేందుకు ఏమాత్రం అవకాశంలేదు. తను వెళ్ళేలోపల బీరేంద్ర జీప్‌లో అడవేకాదు, ఘాట్ రోడ్ కూడా దాటి వెళ్ళిపోతాడు.

జ్వలిత నిస్సహాయంగా అలాగే కొమ్మల మధ్య కూచుని వుండిపోయింది.

జీప్ గతుకులరోడ్ ఎక్కేసింది. మరో పదినిమిషాల్లో ఘాట్ రోడ్ ఎక్కేస్తూంది కూడా!

జ్వలిత చెట్టు దిగింది. గ్లాస్ హౌస్ దగ్గరకు పరుగెత్తింది.

అక్కడ ఫిలిప్ గాని, అతని శవంగాని లేవు!

ఏమయినట్టు?

దూరంగా ఫిలిప్ గన్ ఎగిరిపడి వున్నది.

జ్వలిత గన్ మేగజైన్ తెరిచి చూసింది. ఓ బుల్లెట్ వున్నది! ఫిలిప్ ఓ బుల్లెట్ గాల్లో పేల్చాడు. రెండోది అలాగే చెక్కు చెదరకుండా వుంది. అతను గన్ మళ్ళీ ఉపయోగించకుండానే బీరేంద్ర చేతిలో చచ్చిపోయి

వుండాలి! తను విన్న గుండు శబ్దం వీరేంద్ర గన్ దే అయ్యుండాలి! తను బయటికొచ్చేయగానే ఫిలిప్ కి లొంగి పోయినట్లే నటించి గ్లాస్ హౌస్ గోడకి చేరేసిన గన్ ని అందుకుని ఫిలిప్ ని కాల్చేసివుంటాడు వీరేంద్ర.

అయితే శవం ఏమయినట్టు??

ఆమెకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. వీరేంద్ర కేంప్ కాట్ యెందుకు పట్టుకుపోయాడో అర్థమయింది. ఎవరికీ అనుమానం రాకుండా ఫిలిప్ ని కాంప్ కాట్ లో చుట్టేసి జీప్ లో తీసుకుని పోయాడు.

ఫిలిప్ ని చంపగా ప్రత్యక్షంగా చూసినవాళ్ళు లేరు. కాబట్టి వీరేంద్రను ఎవరూ ఏం చెయ్యలేరు. తనమీద అత్యాచారం చేయబోయినట్టు తను చెపితే తప్ప లోకానికి తెలియదు! పరువింటి ఆడపిల్ల పెదవి విప్పి నిజాన్ని బయట పెట్టుకోదు—అదీ అతని ధైర్యం! అందుకే తన కోసం మరి ప్రయాసపడకుండా పారిపోయాడు.

జ్వలిత హృదయం బాధగా మూలిగింది.

ఇప్పటికి రెండు నిండుప్రాణాలు దుర్మార్గుల రాక్షసత్వానికి బలై పోయాయి. గోపాల్, ఫిలిప్!

నాయుడు, వీరేంద్ర నరరూప రాక్షసులు. తమ స్వార్థంకోసం మనుషుల్ని పిట్టల్లా చంపేశారు.

గోపాల్, ఫిలిప్ యిద్దరు తన మూలంగానే చని పోయారు. గోపాల్ కి నాయుడు కలప అక్రమ రవాణా చేస్తున్న విషయం తనే చెప్పింది—ఆవేశంలో నిరాయుధుడై వెళ్ళి అతను బలై పోతే సాయుధుడై వుండీ తనని రక్షించబోయి ఫిలిప్ ప్రాణాలను వదులుకున్నాడు!

తను యిక్కడికి రాకపోతే యిదంతా జరిగివుండేదా?

తండ్రిలేని సమయంలో ఒంటరిగా తను అడవిలో తిరగటానికి తలపెట్టడం వల్ల యెంత అనర్థం జరిగిపోయింది!?

జ్వలిత మనసు ఆర్ద్రమై కన్నీళ్ళు జలజల రాలిపోయాయి. మౌనంగా చాలాసేపు అలాగే నిల్చుండిపోయింది.

సరిగ్గా అప్పుడే "అమ్మాయిగారూ!" అంటూ వెర్రిగా కేకలు పెడుతూ వస్ వీరయ్య గొంతు వినిపించింది. జ్వలిత తుళ్ళిపడి చూసింది. వీరయ్య వాచ్‌మన్ జక్రయ్య పరుగెత్తుకొస్తున్నారు.

జ్వలితను చూడగానే వాళ్ళు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

దగ్గరకొచ్చి "ఏంటమ్మాయిగారూ, యింతసేపు ఏమైపోయారు? అమ్మగారు ఒకటే హడావిడి పడిపోతున్నారు. వద్దని చెప్తుండగా వచ్చేశారంట. మాకు చెపితే ఎవరోకరం ఎంట వొచ్చేవోళ్ళం కదమ్మా. ఈ అడవిలో అసలే పులులూ సింహాలు తిరుగుతాయి పట్టపగలే! పదండి, పదండి!" అంటూ గుక్క తిప్పుకోకుండా చెప్పేసి తొందర పెట్టేశాడు వీరయ్య.

"అన్నట్టు గార్డుగారు యిలా వొచ్చాడుగదా, కనిపించాడా అమ్మా?" అడిగాడు జక్రయ్య.

జ్వలిత మౌనంగా ఫిలిప్ గన్ వంక చూపించింది. జక్రయ్య గన్ అందుకుని చూశాడు.

"అవును, యిది ఫిలిప్ బందూకే! ఆ దొర యేమయినాడు? ఎటు బోయినాడు?" అనడిగాడు జక్రయ్య.

"బహుశా ఇక ఫిలిప్ మనకు కనిపించడు" అంది జ్వలిత.

వింటున్న వాళ్ళకు అర్థం అయ్యీ కాకుండా వుంది....

"పది నిమిషాల క్రితం బీరేంద్ర జీప్‌లో వెళ్ళాడు కదా, అతని జీప్ నెవరైనా ఆపి చూశారా?"

"లేదమ్మా. సాధారణంగా ఆ మేజరుబాబు జోలి కెవ్వరం ఎళ్లం."

"నా ఊహే నిజమయితే బీరేంద్ర మన ఫిలిప్‌ని చంపేసి జీప్‌లో తీసుకుపోయుంటాడు. ఫిలిప్ గన్‌తో బీరేంద్ర గ్లాస్‌హౌస్ వైపు వెళ్ళటం అరగంట క్రితం చూశాను. ఆ తర్వాత కాసేపటికి గన్ పేలిన శబ్దం వినిపించింది. నేను ఫోటోలు తీసుకొంటూ అదంతా పట్టించుకోలేను. తర్వాత జీప్ వెళ్ళిన శబ్దం వినిపించింది. నేను యిటు వస్తూ చూసేసరికి యిక్కడ యీ గన్ ఒక్కటే కనిపించింది, ఫిలిప్ లేడు!...." అన్నది జ్వలిత.

తనమీద బీరేంద్ర జరిపిన అత్యాచారంగురించి వాళ్ళకు చెప్పదల్చుకోలేదామె. తండ్రితోను, తల్లితోను కూడా చెప్పుకోలేని పరిస్థితి. పరాయి మగాళ్ళతో, అందునా తమకింద పనిచేసేవాళ్ళతో యెలా చెప్పుకుంటుంది!? ప్రత్యక్షంగా చూసిన ఫిలిప్ యీ భూమ్మీద లేడు!

జ్వలిత చెప్పిన మాటలు నోరు తెరచుకుని విన్నారు వాళ్ళిద్దరు.

"అమ్మో, ఎంత పనయిపోయినాది? ఆ మేజరుగోడు యింత పన్జేసాడా? అయ్యగారిమీద కత్తి యిలా తీర్చుకుంటున్నారా యీళ్లు?" జక్రయ్య ఆక్రోశం వెళ్ళబుచ్చాడు.

ఫిలిప్ గన్ తీసుకుని వీరయ్య ముందు నడుస్తూంటే జక్రయ్య, జ్వలిత అనుసరించారు.

• • •

తల్లితో ఏమీ చెప్పలేదు జ్వలిత!

మర్నాడు మధ్యాహ్నానికి తిరిగొచ్చాడు రాఘవేంద్ర రావు. తండ్రి ఏకాంతంగా వున్నపుడు జరిగిన సంగతంతా చెప్పేసింది జ్వలిత.

ఫిలిప్ మరణానికి సహేతుకమైన కారణం అప్పుడు తెలిసింది రాఘవేంద్రరావుకి. ఆవేశంతో అతనిర క్తం ఉడుకెత్తిపోయింది. నిలువెల్లా క్రోధంతో వూగిపోయాడు.

"ఇంత ఘోరానికి పూనుకున్నాడా ఆ స్కౌండ్రల్! ఇక అలస్యం చేయకూడదు. వీడి విషయం యిదివరకే కాన్ఫరెన్స్‌లో చెప్పాను. నిన్న నాయుడు చేసిన హత్య గురించికూడా చెప్పాను. ఈ సాయంత్రమే మా డిపార్టు మెంటులో హెడ్స్, పోలీసులు బయల్దేరి యిక్కడికివస్తా మన్నారు. ఎంక్వయిరీకండక్ట్ చేస్తారు. ఆ రాస్కెల్ బల్లారా నివాసి. దేశవిదేశాల్లో ఏ మూలకి పారిపోయినా వాణ్ణి అరెస్టు చేయించి తీర్తాను" అన్నాడు రాఘవేంద్రరావు.

అతని మనసు సంక్షోభంతో నిండిపోయింది. నమ్మకస్తులైన యిద్దరు సబార్డినేట్సు కళ్ళముందే కాల గర్భంలో కలిసిపోవటం తీరని మనస్తాపం కలిగించింది. సగం క్రుంగిపోయాడు.

"డాడీ! నువ్వు మరోలా అనుకోకపోతే మనం ఇక్కడ్నుంచి వెళ్ళిపోదాం. కొన్నాళ్ళు సెలవు పెట్టెయ్యి. ఆ తర్వాత ట్రాన్స్‌ఫర్‌కి ట్రై చెయ్యొచ్చు!"

రాఘవేంద్రరావు సాలోచనగా చూశాడు కుమార్తె వంక.

"నీకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోకుండా నేనిక్కడ్నుంచి కదలనమ్మా! ఆ నాయుడ్ని, మేజర్ని నా చేతులతో నేనే చట్టానికి అప్పచెప్పాలి, అప్పుడు కావాలంటే సెలవేమిటి, ఉద్యోగానికి రిజైన్

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకూ చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించనవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

చేసెయ్యమన్నా నేను సిద్ధమే!" అన్నాడు.

అతని కంఠం చాలా దృఢంగా, అచంచలంగా ధ్వనించింది. ఆ సాయంత్రం ఫారెస్టు తాణాలో, ఆఫీసర్లు, పోలీసులు వస్తారని చాలాసేపు ఎదురుచూశాడు, రాఘవేంద్రరావు తన సిబ్బందితో. కాని, ఎందుకో వాళ్ళు రాలేదు. ఆ రాత్రి పొద్దు పోయేవరకు ఎదురుచూస్తూనే వున్నాడు. బహుశ బయల్దేరడం ఆలస్యమయి వుంటుందని సరిపెట్టుకున్నాడు.

* * *

రాత్రి సమయంలో యెందుకో అకస్మాత్తుగా మెలకువ వచ్చింది జ్వలితకు.

'బుస్'మంటున్న శబ్దం వినిపించింది.

బెడ్ లాంప్ వెలుగులో యేదో నల్లగా నిగనిగ మెరుస్తూ కనిపించింది.

ట్యూబ్ లైటు వేసింది జ్వలిత. పడగవిప్పిన నల్లత్రాచు చరచర ఆమెమీది కొచ్చేసింది. తప్పించుకునేలోపల ఆమె పాదంమీద కాటందుకున్నది. జర జర పక్క మంచంవైపు వెళ్ళింది.

"అమ్మా!" అంటూ కేకపెట్టింది జ్వలిత.

పక్క మంచంమీద నిద్రిస్తూన్న తల్లి లేచింది ఉలిక్కిపడి. తన విషయం వదిలేసి పాము తల్లిని కాటందుకుంటుందేమోనని ఆమెని తన పక్కకు లాగేసింది జ్వలిత.

నల్లత్రాచుని అప్పుడు ప్రత్యక్షంగా చూసింది సుభద్రమ్మ. పిచ్చిగా కేకలు పెట్టింది.

పక్క గదిలోనించి రాఘవేంద్రరావు పరుగెత్తుకుని వచ్చాడు. వరండాలో పడుకున్న కుక్ వీరయ్య, ఆ వెంటరు అతని వెనుకనే వచ్చారు.

వీరయ్యా పామును కొట్టేశాడు.

రాఘవేంద్రరావు దృష్టి జ్వలిత పాదంమీద పడింది. రెండు గాట్లు స్పష్టంగా పడ్డాయి పాదంమీద. రక్తం చిమ్మింది. విష సర్పం గాట్లు! విషంలేని పాము గాట్లు రెండుకన్న యెక్కువే పడతాయి. రెండే గాట్లు పడితే అది ఖచ్చితంగా ప్రమాదకరమైన విష సర్పం!

రాఘవేంద్రరావు అమాంతరం కూతురి పాదంమీద నోరుపెట్టి విషాన్ని పీల్చేశాడు. తర్వాత ఉమ్మేశాడు. చిన్న తాడుతో కాలు దిగువ భాగంలో గట్టిగా కట్టేశాడు విషం పైకెక్కకుండా. ఆ తర్వాత బ్లేడుతో పాదంమీద 'ఎక్స్'లాగా గుర్తుపెట్టి రక్తాన్ని పిండేశాడు. చల్లటి నీళ్ళతో గాయాన్ని శుభ్రంగా కడిగేశాడు.

జ్వలిత తండ్రిని వారించే స్థితిలో లేదు. అప్పటికే ఆమెను నీరసం, నిస్సత్తువ ఆవరించాయి. కళ్ళు తిరుగుతున్నట్టనిపించి నేలమీద అలాగే సొలిపోయింది.

సుభద్రమ్మ కంగారుపడిపోయింది. "ఏమండీ విషం ఎక్కుతున్నట్టుంది; యెవరైనా మంత్రగాడ్ని పిలిపించండి. నా చిట్టితల్లికి యేదో అయిపోతోంది. వెంటనే పిలిపించండి!" అంటూ గోలపెట్టేసింది.

రాఘవేంద్రరావు చాలా స్థిరంగా వ్యవహరిస్తూన్నాడు. ఏ మాత్రం చలించకుండా అల్మయిరాలో నుంచి కాటన్ గాజ్ గుడ్డ తీసి కట్టుకట్టాడు జ్వలితకు.

"వీరయ్యా వేణ్ణీళ్ళు పెట్టు! పాలుంటే అలాగే కాఫీ కూడా పెట్టి తీసుకురా!" అన్నాడు రాఘవేంద్రరావు. లోపల్నుంచి సిరంజి, నీడిల్ తీసి పైన పెట్టాడు. ఏంటి వెనమ్ ఏంప్యూల్ సిద్ధంగా పెట్టుకున్నాడు. జ్వలితను మంచంమీద పడుకోబెట్టాడు. (సశేషం)

